# ఆంధ్రసచిత్ర వారపత్రిక

సంపుటి : 83 విజయవాడ వెల: రు.4/-

శక సం. 1912 మాఘ మాసం 5వ తేదీ

సంచిక : 23 25-1-1991 పేజీలు: 76


## విషయానుక్రమణిక

### సీరియల్స్:



### కథలు:



### శీర్షికలు:



ముఖచిత్రం: నటి రాధ
(ఫొటో : ఎస్. శివన్నారాయణ)


Chairman S RADHAKRISHNA, Editor VEERAJI,
Printed and Published by S. NAGESWARA RAO for Nageswararao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhinagar, VIJAYAWADA-520 003,
Phones Editorial 75667, Business 61247 61248


## సంపాదకీయం

అయోధ్యలో రామజన్మభూమి బాబ్రీ మసీదు వివాదం విషయంలో యేనాడో చేయవలసిన పని కనీసం ఇప్పుడైనా చేస్తున్నారు- చర్చల బల్లమీద యెంత యుద్ధం జరిగినా దానివల్ల కొంత వెల్తురు రాగల అవకాశాలుంటాయి. పరస్పరం అర్థం చేసుకోవడానికి చేసే ప్రయత్నాలు ఇసుమంతైనా జరుగుతాయి. విశ్వహిందూపరిషత్, అఖిలభారత బాబ్రీ మసీదు కార్యాచరణ సంఘం ప్రతినిధులు న్యూఢిల్లీలో జనవరి 10న యెవరి వాదాన్ని వారు సుహృద్భావ వాతావరణంలో మరింత లోతుగా ప్రవేశపెట్టి తర్జనభర్జనలు చేసుకున్నారు. నాలుగు గంటలపాటు జరిగిన చర్చలలో అసలు సమస్యమీదికి ఇరువర్గాల దృష్టి కేంద్రీకరింపబడటం కూడా ఒక సాహసచర్యగానే- ఇప్పుడున్న ఉద్రేక భావోద్వేగ పరిస్థితులలో మనం అనుకోవాలి.

మొదట భయపడ్డట్లు ఈ సమావేశాన్ని వి.హెచ్.పి. బహిష్కరించక పోవడంలోనే - యేదో తెలియని ఆనందం, ఆశ దేశక్షేమాన్ని దేశంలో అన్ని వర్గాల శ్రేయస్సును కోరే వారికి కలిగింది.

ఈనాటిదా? ఈ బాబ్రీ మసీదు - రామజన్మభూమి వివాదం? ఇప్పుడు మసీదు ఉన్నచోట ఇది నిర్మించడానికి పూర్వం ఒక రామమందిరం వున్నదా? లేదా? ఉంటే దాన్ని పడగొట్టి - మసీదుని కట్టించారా? ఇదే అసలు తేలవలసిన సమస్య. దానికి సంబంధించిన పత్రాలు- సాక్ష్యాలు- దాఖలాలు దస్తావేజులు విశ్వహిందూపరిషత్‌వారు చాలానే సేకరించారు అఖిలభారత బాబ్రి మసీదు కార్యాచరణ సంఘంవారు కూడా అందుకు తీసిపోలేదు. వారుకూడా "బండెడు" పత్రాలు, పొత్తాలు తీసుకొని వచ్చారు. వీటిని పరిశీలించాలి- విశ్లేషించాలి. "నిశానీ" విడగొట్టి నిజానిజాల్ని వెలికి తీసుకొనిరావాలి. కేంద్ర హోమ్‌శాఖ సహాయమంత్రి సుబోధ్‌కాంత్ సహాయ్‌గారికి "ఇన్ని డాక్యుమెంట్లు" వెంటనే సుబోధకం ఎట్లా అవుతాయి? కేంద్ర మంత్రికే గాదు. సమావేశంలో పాల్గొన్న ఒక స్వతంత్ర పరిశీలకుడు శ్రీ క్రిష్ణకాంత్ గారిక్కూడా ఇవి అంతుపట్టకపోవడం సహజం వీటిని క్షుణ్ణంగా తనిఖీ చేయించేటందుకు- దస్తావేజులు డాక్యుమెంట్లు - పురావస్తు సంబంధమైన మతలబులు అవీ తెలిసిన నిపుణులు కావాలి - వారు ఈ

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు: దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు సంపాదకులు: శివలెంక శంభుప్రసాద్(1938-1972)

ఛెయిర్మేన్: శివలెంక రాధాకృష్ణ ఎడిటర్: వీరాజీ ప్రింటర్&పబ్లిషర్: శివలెంక నాగేశ్వరరావు

# "సయోధ్య" మార్గంలో "అయోధ్య?"

"దస్త్రాల"ను బాగా అనుశీలించి చూడాలి అని ఉభయపక్షాలు అంగీకరించడంతో - ప్రభుత్వానికి రెండు వేర్వేరు పరిశీలక, పరిశోధక నిపుణుల బృందాల యేర్పాటుకి అవకాశం చిక్కింది - ఈ కమిటీలను ఏకపక్షంగా గవర్నమెంట్ నిర్ణయించలేదు. ఇది మంచిపని. బాబ్రీ - రామ్‌భూమి వర్గాలు - తమ తమ "నిపుణుల"ను ఎంపికచేసుకొని పంపాలని ఈ సమావేశం నిర్ణయించింది - దీనివల్ల లేనిపోని అనుమానాలకు అవకాశం కూడా రాదు. సుమారు ఐదు వందల సంవత్సరాల నాటి పత్రాలు, చిత్రాలు అన్ని కోణాల నుంచి చూడగల సకల శాస్త్ర పారంగతులు వుండటం కష్టం. అంచేత రెవెన్యూ విషయాలకు, చారిత్రక అంశాలకు వేర్వేరు కమిటీలు ఉండటం అవసరం. అలాగే న్యాయశాస్త్ర సూక్ష్మాలను తరిచి చూసే సంఘం - డాక్యుమెంట్‌ల పరిశోధకుల సంఘం కూడా యేర్పాటు చేస్తున్నారు. ఈ నాలుగు కమిటీలకు - సభ్యులను నామినేట్‌చేసే హక్కు కూడా ఇరువర్గాలకు కల్పించడం కూడా బాగుంది. కేంద్ర మంత్రి, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, మహారాష్ట్రల ముఖ్యమంత్రులు ఈ సమావేశంలో కేవలం మధ్యవర్తులుగా - చర్చలు సాఫీగా కొనసాగటానికి దోహదించే తటస్థమయిన పెద్దలుగా మాత్రమే వున్నామని స్పష్టంగా ప్రకటించారు.

విశ్వహిందూ పరిషత్ వారు ఈసారి చర్చలలో చాలా పట్టూ- విడుపూ ధోరణిని ప్రదర్శించారని- చర్చల తరువాత వెలువడ్డ వివిధ రకాల ప్రకటనలు, వార్తలు వెల్లడి చేస్తున్నాయి. వారిని అందరూ అభినందించాలి. రాముడు చరిత్రలో ఉన్నాడా? లేక దేవుడా? లాంటి మీమాంసకి, ఈ 'తగాదా'కి యేమీ సంబంధం లేదు హిందువుల 'నమ్మిక'కి సంబంధించిన వ్యవహారాలలో బాబ్రీ కమిటీయే కాదు - గవర్నమెంట్ కూడా ప్రశ్నించకూడదు. ఈ విషయాన్ని చర్చల పరిధిలోకి లాగటం- కోరి తగాదాలోకి దిగటమే అవుతుంది.

ఇప్పుడు తేల్చవలసినది ప్రస్తుత బాబ్రీ మసీదు వున్న జాగాలో వెనుకటి కాలంలో ఒక దేవాలయం ఉన్నదా? లేదా? వుంటే అది ఏమైంది? ఈ మసీదు ఎట్లా వచ్చింది? దీని లావాదేవీలు శిస్తు వగైరాలు అవీ ఏ తీరున కొనసాగాయి? అన్న అంశమే- ఈ విషయంలో అఖిలభారత బాబరీ మసీదు కార్యాచరణ సంఘం వారు వెంటనే దారికి వచ్చి "హిందువుల లేదా ముస్లింల" విశ్వాసాల ప్రసక్తి తేబోవటం లేదని హామీ ఇవ్వటంకూడా "శాంతి పంథా"కి జేగంటగానే మనం భావించాలి.

నిపుణుల కమిటీలు యేర్పడి అవి ఈ దస్త్రాలన్నింటిని జనవరి 24 నుంచి ముందు వేసుకొని కూర్చొని పరిశీలించిన తరువాత ఫిబ్రవరి ఐదోతారీఖునాడు మరోసారి ఈ ముఖాముఖి చర్చలు జరగాలని కూడా ఉభయ వర్గాలు నిర్ణయించుకున్నాయి కనుక అందాకా అన్ని వర్గాలవారు కూడా వేచిచూడటమే మంచిది! అయితే ఈ సమావేశానంతరం ఇరుపక్షాల ప్రతినిధులలో కొందరు అనవసరమైన ప్రతిష్ఠ కోసం ప్రాకులాడటం కనబడ్డది.

విశ్వహిందూ పరిషత్ తిరిగి నిపుణుల సంఘ నివేదికలంది - చర్చల బల్లదగ్గరికి ఇరుపక్షాలు వచ్చేలోగా యెటువంటి ఆందోళనలు చేపట్టరాదని - బాబరీ కమిటీ సభ్యుడు శ్రీ జావేద్ హబీబ్ హెచ్చరించారు. వారు తమ ప్రతిష్ఠ కోరి - ఆందోళనా కార్యక్రమాలు చేపడితే - ముస్లిమ్‌ల పరువు కోసం తాముకూడా కొంత ఆందోళన చేస్తామని ఆయన అనడం - చర్చలు కొనసాగినంతకాలం - ఉండిన సుహృద్భావ వాతావరణాన్ని వేడెక్కించినట్లే భావించాలి అయితే విశ్వహిందూపరిషత్ అలహాబాద్ (ప్రయాగ)లో సంత్ సమ్మేళన్‌లో దుందుడుకు కార్యక్రమాలను నిర్ణయించకపోవడం చాలా అవసరం. సంయమనం ఇరు వర్గాలకి అవసరం- సందర్భశుద్ధి గల సత్యాగ్రహాలను - దీక్షలను కొనసాగించటంలో తప్పులేదు కాని, అపార్థాలకు, హింసాకాండకు కక్ష కార్పణ్యాలకి దారితీసే మార్గాలు- విస్మరించడం అన్నది ఒక యుద్ధ భయంతో - మరొక గల్ఫ్ సంక్షోభంతో నిత్య నూతన సమస్యలతో సతమతమవుతున్న దేశ ప్రజలందరి క్షేమం దృష్ట్యా అత్యవసరం- అయోధ్య బాబరీ మసీదు వివాదంలో తలలు ఏకంచేస్తున్న వారంతా హృదయాలను కూడా కరుణార్ద్ర రసభరితం చేసుకొని - నిగ్రహాన్ని పాటించాలని కోరుతున్నాము

*11-1-'91*



"శ్రీ ఏడు కొండల స్వామి"లో భానుప్రియ

## ఉపగ్రహం ద్వారా క్లాసు రూమ్ పాఠాలు

గ్రామీణ ప్రాంతాలలో పిల్లలకు పాఠాలు చెప్పడానికి ఉపాధ్యాయులు కరువైతే ఏం చెయ్యాలి? ఈ సమస్యకు 'హైటెక్' (అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానం)తో సమాధానం చెబుతోంది అమెరికా! అక్కడ ఉపాధ్యాయులు అందుబాటులో లేని పల్లె ప్రాంతాల పాఠశాలలకు ఉపగ్రహ అనుసంధానం గల 'శాటిలైట్ డిష్'ల ద్వారా వీడియో పాఠాలను ప్రసారం చేసి తరగతులను నడిపించి వేస్తున్నారు. అమెరికాలో ఒక గ్రామీణ ప్రాంతమైన హార్డీకౌంటీ (పశ్చిమ వర్జీనియా)లో 540 మంది విద్యార్థులు గల మూర్‌ఫీల్డ్ (సెకండరీ) హైస్కూలులో సైన్సు, విదేశీ భాషల తరగతులను ఈ విధంగానే నిర్వహిస్తున్నారు. శాన్ అంటోనియో (టెక్సాస్)లోని 'టి-ఇన్' సంస్థ 'శాటిలైట్ డిష్' ద్వారా ఇప్పుడీ పాఠశాలకు రోజువారీ తరగతులను ప్రసారం చేస్తున్నది. 'టి-ఇన్' సంస్థ అమెరికాలో 32 రాష్ట్రాలలోని వివిధ గ్రామీణ ప్రాంతాల పాఠశాలలకు ఇప్పుడు ఈ విధంగా పాఠాలను ప్రసారం చేస్తున్నది.

### భూగర్భ రహస్యాలు

స్టాన్‌ఫర్డ్ (కాలిఫోర్నియా) యూనివర్శిటీకి చెందిన ఒక భూభౌతిక శాస్త్రవేత్త కనుగొన్న ఒక క్రొత్త 'ఇమేజింగ్' ప్రక్రియవల్ల భూగర్భంలోని విశేషాలను అతి స్పష్టంగా అర్థమయ్యే అవకాశం ఏర్పడుతున్నది. ఈ ప్రక్రియను ఉపయోగించి భూమి నుంచి ఆయిల్‌ని మరింత ఎక్కువ స్థాయిలో వెలికి తీయవచ్చునని భావిస్తున్నారు. 'క్రాస్‌వెల్ సీస్మిక్ టోమోగ్రఫీ' అనే ఈ ప్రక్రియను 'స్టాన్‌ఫర్డ్' అసోసియేట్ ప్రొఫెసర్ జెర్రి ఎం. హారిస్ కనుగొన్నారు. భూమి లోపలి భాగాలను ఇదివరలో ఏ ప్రక్రియ చూపనంతటి స్పష్టంగా ఇప్పుడీ ప్రక్రియ చూపగలుగుతున్నది. అత్యధిక ఫ్రీక్వెన్సీ గల 'సీస్మిక్' తరంగాలను వినియోగించడం ద్వారా ఈ ప్రక్రియలో 8 కిలో మీటర్లలోని భూగర్భం విశేషాలతో ఒక మీటర్ పరిమాణంగల పటాన్ని (మాప్) తయారు చేస్తారు. ఇది భూమి లోపలి ఆయిల్ నిక్షేపాలను కనుగొని ఆయిల్ వెలికితీతను మరింతగా పెంచడానికి దోహదం చేస్తుందని పరిశోధకులు విశ్వసిస్తున్నారు. ○



## న్యూఢిల్లీ లేఖ!



జైదుబాషీ

# వీరే సెక్యులర్ మేధావులు





ఇది భయానకమైన సంవత్సరం అని- కొందరు మరీను- ఎందుకు అంటున్నారో నాకు తెలీడం లేదు. వేసవిలో మన లౌకికవాద మేధావులు వరుల సొమ్ముతో యూరప్‌కు విహారం వెళ్లినట్లుగా వెళ్లకుండా శ్రీ అద్వానీ సోమనాథ్ నుంచి అయోధ్యకు పాదయాత్ర చేసినందుకేమో! *1917* తర్వాత రష్యాలాగా, *1787* తర్వాత ఫ్రాన్సులాగా అయోధ్య సంఘటన తర్వాత భారతదేశం బాగా మారిపోయింది. వేసింది ఒక్క అడుగే ఆ ఒక్క అడుగు ఇప్పుడు చరిత్రకు సంబంధించినది.

ఆ మరునాడు నేను రాజ్‌పత్‌కు కారు నడుపుకుంటూ వెడుతూ వుండగా ఈ మేధావులు "ఇండియా గేట్" దగ్గర అయోధ్యకు వ్యతిరేకంగా ఆందోళన చేస్తుండగా, నేను చూసాను. ఈ ఆందోళన తర్వాత వాళ్లేం చేసారు? ఇండియా ఇంటర్ నేషనల్ సెంటర్‌కి వెళ్లి ఇష్టం వచ్చినట్లు గొంతు వరకు తిని, త్రాగి, క్యూబా, అల్బేనియా నుంచి వచ్చిన పెద్ద మనుష్యులతో ఎకసెక్కాలాడారు

భారతదేశంలో "సెక్యులర్" ప్రవర్తనపై నిబంధనలు విధించడానికి వీరెవరు? గత నలభై ఏండ్లుగా వారు ప్రతి ఒక్కరిపై కర్రపెత్తనం చెలాయిస్తూ వస్తున్నారు వారు వార్తా పత్రికలు నడిపారు. కాలమ్‌లు వ్రాశారు. వారు మన దౌత్య సంబంధమైన సర్వీసులలో అజమాయిషీ చేశారు. న్యాయస్థానాలకు అధ్యక్షత వహించారు. వారు మనదేశ ప్రధాన మంత్రులకు సలహా లిచ్చారు. ప్రణాళికా సంఘంలో కూర్చున్నారు. వారు భారీ ప్రభుత్వ రంగ సంస్థలకు యాజమాన్యం వహించారు. సమావేశాలు, సెమినార్లు అంటూ దేశ విదేశాలకు విమానాల్లో తిరిగారు. వారు తలదూర్చని సంస్థ లేదా ప్రచార సాధనం లేదు. వారు పెద్ద బడ్జెట్‌లను నిర్వహించారు. మధ్యప్రదేశ్ లాంటి పేద రాష్ట్రాలలో కూడా రాబందుల సంస్కృతికి ఖర్చు చేశారు. వారు అభూత ప్రభుత్వ సంస్థలు నడిపి ప్రభుత్వం నుంచి సమాచారాన్ని దొంగిలించి తిరిగి అదే ప్రభుత్వానికీ, ఇతర ప్రభుత్వాలకు పెద్ద మొత్తం ధరలకు అమ్ముకుంటున్నారు. వాళ్ళు వ్రేళ్ళు పెట్టని చోటులేదు. కొన్ని వ్రేళ్లు ఇమెల్డా మార్కోస్ వ్రేళ్లు ఆభరణాలతో ఎంత బరువుగా వున్నాయో అంత బరువుగా వున్నాయి.

నేడు ఈ వ్యక్తులు-వీరి మహిళలు -దేశంలో జరుగుతున్న దానికి మేము బాధ్యులంకామని ఎలా చెప్పగలరు? మతతత్వం నిన్న పుట్టింది కాదు ఒకరి సామర్థ్యంతోకానీ, ఇంకొకరి సామర్థ్యంతో కానీ ప్రణాళికా సంఘాన్ని ఇన్నేళ్లు నడిపిన వ్యక్తులు ఈరోజు ప్రస్తుత ఆర్థిక వ్యవస్థ దుస్థితికి తాము బాధ్యులు కామని చెప్పగలరా? టాటా ఉక్కు కర్మాగారంలో ఏదైనా ఎగుడుదిగుడు జరిగి, ఆ కంపెనీ సరిగ్గా నడవకపోవడానికి జె.ఆర్.డి. వంటి వారే పూర్తిగా బాధ్యులని నిందింపబడతారా? గత నలభై సంవత్సరాలుగా భారతదేశ పాలన ఏదో విధంగా నిర్వహిస్తున్న వ్యక్తులు నేడు తమకు సంబంధం లేదని చెప్పగలరా? హేతువు, ప్రభావం మాదిరిగా అటువంటిది వుంది. ప్రభావాలు తీవ్రతరంగా వున్న షక్షంలో దానికి బాధ్యులుగా వున్న వారు "అయోధ్య" అని నినాదాలిచ్చుకుంటూ ఇండియా గేటు చుట్టూ తిరగడం ద్వారా తమ బాధ్యత నుంచి తప్పించుకోజాలరు.

ముల్క్‌రాజ్ ఆనంద్‌లు, కుష్వంత్‌సింగులు, వర్గీసులు, జె.డి. సేఠీలు, రజనీ కొఠారీలు, అశోక్ మిత్రాలు, జయకర్లు, సోనల్ మాన్‌సింగ్‌లు, ప్రభుత్వ యంత్రాంగంలోని పురుషులు, స్త్రీలు తమ చిన్న ప్రపంచానికి చిల్లుపడిందని హఠాత్తుగా తెలుసుకొన్నారు. వారు ప్రభుత్వంతో మాకెలాంటి సంబంధాలు లేవని అంటున్నారు. కానీ అది హాస్యాస్పదం. మీరు ప్రభుత్వానికి ఇంచుమించు అతి సన్నిహితంగా పనిచేస్తూ మేము ప్రభుత్వానికి చెందిన వారంకామని ఎలా అనగలరు? సోవియట్ ప్రభుత్వానికి చెందిన వాడిని కానని ప్రస్తుతం వేరే రాగం ఆలాపిస్తున్నంత మాత్రాన శ్రీ మిఖయిల్ గోర్బచెవ్ అనగలరా? మార్క్సిజమ్ కప్పకూలిన దరిమిలా సోవియట్ ప్రభుత్వం కూలుతున్నందుకు యిన్ని రోజుల నుంచి సోవియట్ ప్రభుత్వాన్ని అంటిపెట్టుకుని వున్న గోర్బచెవ్ నాకేమి బాధ్యత లేదని అనగలరా? ఈ విషయంలో స్టాలిన్, కృశ్చేవ్‌లు ఎంత అపరాధులో గోర్బచెవ్ కూడా అంతే అపరాధి.

బి.జె పి. ఆర్.ఎస్.ఎస్., రామజన్మభూమిలను వేలుపెట్టి చూపిస్తూ "అయోధ్య" అని అరుస్తున్న మన నేరస్తులు నెహ్రూయిజమ్ కుప్పకూలిన దరిమిలా భారతదేశ వ్యవస్థ కూలిపోవడానికి అంతే సమానంగా, బాధ్యులు. ఈరోజు భారతదేశంలో జరుగుతున్నది. సోవియట్ రష్యాలో జరుగుతున్న దానికి భిన్నంగా

ఏమీలేదు. సోవియట్ రష్యాలో కమ్యూనిజం కూలిపోవడానికి ఏదైతే కారణమో! అదే భారతదేశంలో నెహ్రూయిజమ్ కూలిపోవడానికి కారణం అయింది. అదిక్కడ పని జరుగ లేదు. మనం ఏదైనా సాధ్యపడే యుగంలో వున్నాం- ఏమి చేస్తే అది జరుగుతుంది. జరుగలేదూ అంటే ఆ యంత్రాంగం, లేదా వ్యవస్థ మొన్నపడిందన్నమాటే! అమెరికన్లకి లాగా సోవియట్ లకి తిండి, నీడ వుండి వుంటే వారు కార్ల్‌మార్క్స్‌ని కిటికీలోంచి విసిరి వేసే వారు కాదు. ఇన్ని ఏండ్ల కమ్యూనిజం పరి పాలన తర్వాత సోవియట్లు ఇంకా పేదరికంలో బ్యాంకుల్లో బోగస్ రూబల్లతో భోజనం బల్ల మీద కనీసం పూర్తి రొట్టె కూడా లేకుండా వున్నారు. మార్క్స్, మార్క్సిజమ్ వారిని ఈ స్థితికి తెచ్చిం తర్వాత, వారు ఆ దేశాన్ని వదిలి వలస పోవడానికి సంసిద్ధులవుతున్నా రంటే వారినెందుకు నిందించాలి?

సోవియట్ రష్యాలో కమ్యూనిజం ఎంత

## న్యూఢిల్లీ లేఖ!

పూర్తిగా కూలిపోయిందో భారతదేశంలో నెహ్రూ యిజమ్ కూడా అంతగానూ కూలిపోయింది. గత నలభై సంవత్సరాలలో గర్వించ తగినట్లు మనం ఏం సాధించాం? "భారత అంతర్జా తీయ మురా"కి అత్యంత గొప్ప ప్రియుడు అధికారం చేజిక్కించుకోవడానికి తన స్వంత వాళ్లనే వెన్నుపోటు పొడిచిన శ్రీ చంద్ర శేఖర్ లాంటి కాఫీ హౌస్ మేధావిని మనం తయారు చేశాం. శ్రీ విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ కన్నా ఈయన భిన్నమైన వారేమీ కాదు. ఈయనా నెహ్రూ మూసలోంచి వచ్చిన వారే. నెహ్రూలు దేశాన్ని ముక్కచెక్కలు చేయడా నికి ఒక కమ్యూనిటీని వాడుకున్నట్లే వీరూ, దేశాన్ని చిన్నాభిన్నం చేయడానికై ఏదో ఒక దాన్ని వాడుకుంటున్నారు.

పంజాబ్‌కు బాధ్యులెవరు? బి.జె.పి.? కాశ్మీర్‌కి బాధ్యులెవరు? బి.జె.పి.? అస్సాంకు, ఉల్ఫాకి బాధ్యులెవరు? బి.జె.పి.? పంజాబ్, కాశ్మీర్, అస్సామ్‌లలో ప్రస్తుత పరిస్థితికి ఎవరు బాధ్యులో వారే, మతపరమైన దాడులకు విచ్ఛి న్నకర వాతావరణానికి బాధ్యులు. అదే 'నేరస్థులు', అదే "అంతర్జాతీయ మురా"నే బాధ్యులు.

ఈ దేశం ఇప్పుడు వీరందరిని ఏరి పారే యాలని నిర్ణయించుకుంది. అయోధ్య ముఖ్య ఉద్దేశ్యం అదే. అయోధ్య ఒక దేవాలయం కాదు. అది ఒక ఉద్యమం. అది ఒక విప్లవం. వాస్తవానికి విప్లవానికి నాంది. భారతదేశం లాంటి దేశం తొలి అడుగు వేస్తే అది ఎక్కడ అంతం అవుతుందో ఎవరికి తెలుసు? వెళ్లి విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్‌ని అడగండి. శ్రీ లాల్ కృష్ణ అద్వానీ సోమనాథ్ నుంచి వేసిన ఒక అడుగు మంచి కోసం అయన్ని గద్దె దింపివే సింది. ●

# వీక్లీ పోస్ట్

## మహిళలకు ఉచితం!

అధ్యాత్మికపరమైన మహిళా సేవా పథకం క్రింద "రుద్ర" సంస్థ ఇంద్రకృతమైన "మహాలక్ష్మ్యష్టకమ్" స్తోత్రమును మహాలక్ష్మి సుందర రేఖా చిత్రముతో ఇరువది ఏడు వేల ప్రతులను మహిళలకు ఉచితముగా పంపకము చేయుటకు తెలుగు లిపిలో ప్రచురించినది. ఈ స్తోత్రమును నిత్యము పఠించినచో పాపములు హరించునని, శత్రువులు నశించెదరని, ధన ధాన్య కనక వస్తు వాహన సౌభాగ్యములు కలుగునని "పద్మ పురాణము" తెలుపుచున్నది.

"మహాలక్ష్మ్యష్టకమ్" ప్రతులు ఉచితముగా పొందగోరు మహిళలు ప్రతి ఒకరు తమ పేరు, చిరునామా వ్రాసి ఒక రూపాయి పోస్టు స్టాంపు అంటించిన కవరును తమ జాబుతో పాటు "రుద్ర- అధ్యాత్మిక ప్రచార విభాగం, కేరాఫ్ పోస్టు బాక్సు 6900, మద్రాసు- 40" అను చిరునామాకు పంపి పొందవచ్చును.

ప్రతుల నిమిత్తం ముందుగా జాబులు వ్రాయు మహిళలకు ముందుగాప్రతులు పంపు ప్రాతిపదికపై, ఒక్కొక్క మహిళకు ఒక్క ప్రతి మాత్రమే పంపబడును.

– రుద్ర,
పి. బి. నెం. 6900,
మద్రాసు-40.

## సావిత్రి తొలిచిత్రం

శ్రీమతి సావిత్రి కథానాయికగా నటించినది 'పెళ్లిచేసిచూడు'. ఆమె కథా నాయకుడు అమలాపురం స్టేజీ హాస్యన టుడు జోగారావు. ఆ తరువాత అయన టి.బి.చే పేదరికం మీద మరణించాడు.

## తారాశశాంకం

భక్తప్రహ్లాద చిత్రంలో (1942) ప్రముఖ రంగస్థల నటి లేటు రాజేశ్వ




ఉన్నారు. ఆమె నటించిన చలనచిత్రం అది ఒక్కటే. ఆమె భర్త సూరి బాబుతో "తారాశశాంకము" నాటకము ఆలిండియా అంతా గంగవెర్రులెత్తించినది. వీరిద్దరు తారాశశాంకము నాటకముద్వారా తెలుగు నాటకరంగమునకు అమూల్య మైన సేవ చేశారు. సూరిబాబు కంఠము కంచుకంఠము. సినిమా రంగాన్ని, నాటక రంగాన్ని ఒక త్రాటిమీద నడిపించిన సవ్య సాచి. తారాశశాంకము ఆంగ్ల నాటకకర్త షేక్స్‌పియర్ "వీనస్ అండ్ డానిస్"కు దగ్గర. ఆలిండియా రేడియో సూరి బాబు పద్యాలు నాటకకళ క్రింద ప్రసా రము చేస్తుంటారు. జూనియర్ శ్రీరంజని ఈమె వియ్యపురాలు. వీళ్లందరూ తమ ప్రజ్ఞవల్లనే ఒక సుస్థిర స్థాయిని సంపాదిం చారు కాని సినిమా రంగము ఒక మహా మారిగా మారి మిడిమిడిజ్ఞానము తీరులో వున్నది.

చల్లపల్లి వాసుదేవరావు
అనపర్తి

## ఎన్.టి.ఆర్.ఇంటర్వ్యూ

"ఆంధ్రసచిత్రవారపత్రిక"లో ధారావా హికంగా ప్రచురిస్తున్న తెలుగుదేశం నేత శ్రీ ఎన్.టి. రామారావుగారితో ఇంటర్వ్యూ సూపర్బ్! తన కళాభివేశాన్ని, నటనా వైదుష్యాన్ని అపర కృష్ణపరమాత్మ శ్రీ ఎన్.టి.ఆర్. పలుకులు చాలా ఆశ్చర్యంగా ఉన్నాయి.

ఎన్.వి. సుబ్బరాజు
విజయవాడ ●

# కమ్మని ఫలాల ఆహారం మీ పాపాయి పెరుగుదలకు సహాయం.

## పాపాయి కోసమే ప్రత్యేకం 'ఫ్రూట్ సలాడ్ ఆహారం'

ఒక్క ఫారెక్స్ ఫ్రూట్స్ మాత్రమే
కల్గి వున్నది ఆపిలు, మామిడి మరియు
అరటి పళ్ళలోని కమ్మని పౌష్టికత
— గోధుమ ధాన్యం మరియు పాలతో సహా
ముందుగానే వండి తయారు చేసిన ఈ ఆహారాన్ని
పాపాయిలు ఎంతో ఇష్టపడి తింటారు

---

రెగ్యులర్ ప్యాక్ కన్నా
**100** గ్రా.లు ఎక్కువ.

---




## ఫారెక్స్-ఫ్రూట్స్

పెరుగుదలకు రుచికమైన విధానం.

ఏ దుకాణంలోనైనా పొదుపైన ఒకే ధరలో దొరుకుతోంది

GX 357 90 TI

సీరియల్

# మోహినీ తాండవం

డా. కొత్త రవీంద్రబాబు

**ఇంతవరకూ సాగినకథ-21:** ప్రణవనాధ్‌ను హత్య చేసిన మోహిని గురించి వివరాలు ఆరా తీయాలనుకున్న నందికేశ్వర చావుదెబ్బతింటాడు ఫ్లూటోగా పిలువబడే రవితేజను రేఖ కలుసుకుంటుంది. అతనికి చేరువవుతుంది జైనవి హారంలో వున్న డేవిడ్‌ను రవి, భీంలు కలుసుకుంటారు అనర్థాలకు కారణమైన మోహినిని మట్టు పెట్టాలన్న ఉద్దేశ్యంతో రవి, రేఖ, భీం-ఉదయ్‌పూర్ వెళ్తారు అనేక దోపిడీలతో సంబంధంవున్న మోహిని మరణించిందని రవికి ప్రతాప్‌సింగ్ తెలియజేస్తాడు. కైలాసగిరి వెళ్లి కపర్దిని రవితేజ కలుసుకుంటాడు.

*(గత సంచిక తరువాయి)*

**తలుపు తెరచుకుని రాజస్థానీ యువతి ట్రేలో రెండుగ్లాసులతో లోపలకువచ్చింది. లంగా, జాకెట్, తలను, ఛాతినీ కప్పే జలతారు మేలిముసుగు చేతులకు రంగు రంగుల గాజులు- అలవంచుకున్న యువతి నడుస్తున్న ఇంద్ర ధనసులాగా వుంది.**

"షర్బత్ గ్లాసు వారికివ్వడమా"

షర్బత్ గ్లాసు రవికి మంచినీళ్ళగ్లాసు కపర్దికి యిచ్చి తలవంచుకునే వెళ్లిపోయింది ఉమ.

"తీసుకోండి రంజిత్‌సింగ్- మీరే పత్రిక నుండి వచ్చారు?!"

"ఫ్రీలాన్స్-హిందూ, ఎక్స్‌ప్రెస్, హెరాల్డ్ అన్ని పత్రికలలోను నా వ్యాసాలు వస్తాయి. మీ కైలాసగిరి ఎంటర్‌ప్రైజెస్ గురించి వ్యాసం వ్రాద్దామనుకున్నాను!"

"అలాగా-పేపర్లు పెద్దగా చదువను. ఏదో హెడ్డింగ్స్ చూసి అవతల పడేస్తుంటాను."

"ఆయిల్ ఇండస్ట్రీమీద నాకు మక్కువ ఎక్కువ. ఆయిల్ యీ రోజుల్లో అమృతం కన్న విలువైందని నా అభిప్రాయం"

"బాగా చెప్పారు"

"కొత్తగా ఏర్పడిన మీ ఆయిల్ కన్‌సార్షియం గురించి వివరాలు తెలుసుకుందామనుకుంటున్నాను!"

"కొత్తగా ఏర్పాటయినా మా కైలాసగిరి ఎంటర్‌ప్రైజెస్‌లో చాలామంది అనుభవజ్ఞులున్నారు! దీనికోసం యింత దూరం వచ్చారా?"

"నేను కొన్నాళ్లు ఉదయపూర్‌లో పెరిగాను."

"మీకు ఉదయపూర్ అంటే మక్కువ అనుకుంటా."

"అవును సర్దార్ సాబ్!"

"రవికి గడియారం కొట్టుకుంటున్నట్లు శబ్దం వినవచ్చింది గాని గడియారం ఎక్కడా కనపడలేదు!"

"టిక్ టాక్ మన్న శబ్దం వినిపిస్తుంది గదూ-అందుకేనా గడియారం ఎక్కడుందా అని చూస్తున్నావు?"

తలూపాడు రవి

"అది గడియారం గాదు. మినీ కంప్యూటర్ పంప్, తీవ్రతరమైన ఉబ్బసం వ్యాధిని అదుపులో వుంచటానికి వైద్యులు చేసిన ఆఖరి ప్రయత్నం! టిక్‌టాక్‌మన్న శబ్దం ఆగిపోయినప్పుడు నా వూపిరి ఆగిపోతుంది!"

ఆశ్చర్యం నుండి తేరుకుని "సర్దార్ సాబ్-మీకు ఆయిల్ యిండస్ట్రీమీద మక్కువ ఎప్పుడ్నుంచి కల్గింది?" అని అడిగాడు రవి.

"పాతిక సంవత్సరాలనాడు నేను ప్రధాన మంత్రి పదవికి పోటీ చేయాలని నా అనుచరులు చాలామంది కోరారు." కారణవశాత్తు నేను పోటీచేయలేదు

అప్పట్నుంచి నాకు రాజకీయాల మీద విముఖత-ఆయిల్ యిండస్ట్రీ మీద మక్కువ పెరిగింది.

"భారత దేశంలోని ఆయిల్ కంపెనీల నన్నీ కలిపినందువల్ల ఏం ప్రయోజనం ఆశించారు మీరు?"

"అన్నీ కలసినందువలన దేశంలోని ఆయిల్ నిల్వల గురించి ఎక్కువగా పరిశోధించవచ్చు

ఒకరు చేయలేని పనిని పదిమంది కూడి చేయవచ్చు. అదీగాక కైలాసగిరి ఎంటర్‌ప్రైజెస్‌కు అపార ధనరాసులు, మూలద్రవ్యం వున్నాయి.

కంపెనీలన్నీ విడి విడిగా వుంటే ఆ సదుపాయం వుండదు!"

"మీ కైలాసగిరి ఎంటర్‌ప్రైజెస్‌లో భాగస్వామ్య కంపెనీ లేమిటి?"

కపర్ది మనసులో జ్ఞాపకాల పొర రగిలింది. "సీమా ఎన్నాళ్ళయింది నిన్ను చూచి?" ఆలోచనలను అణగదొక్కి రంజిత్‌సింగ్ ఏమిటడిగావు?

"కైలాసగిరి ఎంటర్‌ప్రైజెస్‌లో పార్టనర్స్ ఎవరు?"

"మీరా ఆయిల్స్, మమతా కంపెనీ, మాతా కంపెనీ, సం..."

"సందీప్ మోటార్స్, స్వదేశీ ఆయిల్స్, పూర్ణా క్రూడాయిల్ కంపెనీ" పూర్తిచేసాడు రవి.

"అవును - అవికాక రోజ్ ఆయిల్ టాంకర్స్ కంపెనీ కూడా మా పార్టనరే!"

"ఇటాలియన్ కంపెనీనా?"

"అవును-ఇతర దేశాలనుండి - భారత దేశానికి దూరంగా సముద్రగర్భంలో వున్న ఆయిల్ రిగ్స్‌నుండి కాంబేపోర్టుకు ఆయిల్ జేరవేయటానికి ఎన్నో ఆయిల్ టాంకర్లు కావాలి. బాడుగకు ఆయిల్ టాంకర్లు తేవటంకన్న సొంత టాంకర్లుండటం చవక పని సులువుగా వుంటుంది!"

"మీరే ఆయిల్ టాంకర్లు తయారు చేస్తారా?"

చుట్ట వెలిగించి గుప్పుమని పొగవదుల్తూ "ఆ" అన్నాడు కపర్ది.

"ఆయిల్ ఎగుమతి దిగుమతి కాంబే పోర్ట్‌లో జరుగుతాయన్న మాట?"

"అవును!" ఆలోచనలు ముసురుకోసాగాయి కపర్ది మనసులో.

"మరి హెడ్ఆఫీస్ కాంబేలో వుంచక యిక్కడ వుంచారేం?"

"నాకీ వాతావరణం నచ్చింది. పైగా యిక్కడ మా ఆయిల్ రిఫైనరీ వుంది!"

"కపర్ది మనసు గతి తప్పిపోసాగింది - కనులపై పల్చటి నీటిపొర కమ్మింది."

"సీమా" గుండెలో మంట రగిలింది.

"బాబుగారూ!"

"ఎవరు-నువ్వేనా?" అయిదేళ్ళ తర్వాత కనపడ్డ సీమా మరింత అందంగా నాజూకుగా కనపడింది.

"ఎక్కడకు వెళ్లావ్ - ఎందుకు వెళ్లావ్?" బాధగా మూలిగింది కపర్ది హృదయం.

"మీ క్షేమంకోరి వెళ్లిపోయాను!"

"ఎందుకు? నీకోసం సర్వం త్యాగం చెయ్యటానికి సిద్ధపడ్డానే - నాతో మాట మాత్రం చెప్పకుండా ఎందుకు వెళ్లావ్."

"చెప్పాగా - మీ క్షేమంకోసం"

"నువ్వెళ్ళకపోతే నాకు హానికల్గిస్తామన్నారా?" తల వొంచుకుంది సీమా.

"చెప్పు సీమా నిజం చెప్పు నిన్ను నా నుండి దూరం చేసినవాళ్లెవరో చెప్పు వాళ్ల అంతుచూస్తా"

బదులు చెప్పలేదు సీమా.

"సీమా - గుండెలో గూడుకట్టి పూజించిన నాకంటే నీకు వాళ్లెక్కువా? చెప్పు?" గద్దించాడు.

"బాబుగారూ - అవన్నీ తవ్వుకుని ప్రయోజనం ఏముంటుంది? జరిగిందేదో జరిగి పోయింది!"

"సీమా నీకు..."

"కొడుకు పుట్టాడు"

"ఇప్పుడు బాబుకు అయిదు సంవత్సరాలు అవునా?"

"అవును"

"ఎలా వుంటాడు?"

"నా అందం మీ తెలివి - ఎంతో చురుకుగా చలాకీగా వుంటాడు."

"ఏం పేరెట్టావ్"

"మోహన్"

"తీసుకుని రాలేదేం?"

"బాబుకోసమే మీదగ్గరకు వచ్చాను!"

"అదేమిటి సీమా"

"బాబును బందిపోటు మోహిని ఎత్తుకుపోయింది!"

"అయ్యో ఎంతఘోరం జరిగింది! పోలీస్ రిపోర్ట్ యివ్వకపోయావా?"

"అందువలన ఏం ప్రయోజనం కల్గ



తుంది? పైగా పోలీస్ రిపోర్ట్ యిస్తే బాబును చంపేస్తానంది మోహిని!"

"ఎంత దుర్మార్గం!"

"బాబుగారూ-మోహిని వొక కోరిక కోరింది!"

"ఏమిటి?"

"మీ పలుకుబడి ఉపయోగించి ఆమెమీద వున్న కేసులు ఎత్తివేయించి పోలీసుల నిఘా తొలగించమని కోరుతున్నది!"

ఆలోచనలోపడ్డాడు కపర్ది. మామూలు పరిస్థితులలో మోహిని మీద కేసు ఎత్తివేయించడం అసాధ్యం కాదు - కాని కొంతకాలంగా సీమా విషయంలో తనమీద రాజకీయంగా దుమారం బయల్దేరింది.

పార్టీలోను ప్రభుత్వంలోను తనకున్న పట్టు సడలింది.

ఈ పరిస్థితులలో మోహిని కోర్కె తీర్చటం అంత సులభంగాదు!

## మోహినీతాండవం

గనుక సర్దార్ సాబ్ నన్ను ప్రేమిస్తున్నారని నమ్మి మోసపోయాను!"

"అబద్ధం-నేను నిన్నే మీ మోసగించలేదు నువ్వే నా దగ్గరకు వచ్చావు - నిజం చెప్పాలంటే నువ్వు నాపక్కలో వచ్చి పడుకున్నావు!"

"వయసులో చిన్నదాన్ని నేనేదైనా చిన్న పొరపాటు పనిచేస్తే సరిదిద్దవలసిన మీరు నాతో ప్రేమకలాపాలను ఎందుకు కొనసాగించారు?"

"సీమా నువ్వేనా యీ మాటలనేది?!"

"కామంతో కళ్ళు మూసుకుపోయిన మీదగర ప్రణయకలాపాలు సలిపిన సీమాను కాను!"



జరిగిందంతా కెలికి బయటకు తవ్వుతారు. అల్లరిపెడతారు. దుమారం లేవదీస్తారు. హోంమినిష్టరు రాజకీయాల్లో తనకు చిరకాల ప్రత్యర్థి.

దేశం అంతటా ప్రచారంచేసి నగుబాటుపాలు చేస్తాడు.

ప్రయోజనం లేనిపని చేయడం ఎందుకు? తల అడ్డంగా తిప్పాడు కపర్ది.

"అయితే అంతా నాటకమన్న మాట!" అరచింది సీమా.

"ఏమిటి?"

"సర్దార్ సీమాను ప్రేమించడం అన్నదొక పెద్ద బూటకం!"

"సీమా"

"మీ శారీరక వాంఛ తీర్చుకోవటానికై నా మీద ప్రేమ అభిమానం వున్నట్లు నటించారు - అంతే - అది తెలియని మూర్ఖురాలిని

"ఏమంటున్నావు-నాకు కామంతో కళ్ళు మూసుకుపోయాయా?"

"లేకపోతే మీ వయసెక్కడ-నావయసెక్కడ?"

"శారీరక సంబంధం వున్నప్పుడు అడ్డురాని వయోభేదం ఇప్పుడు గుర్తుకొచ్చిందా?"

"చిన్నదాన్ని కాబట్టే పై మెరుగులకు భ్రమపడ్డాను" మీలో నిలువెల్లా స్వార్థం నిండి వుందని యిప్పుడు తెలుసుకున్నాను.

"దేశంకోసం సర్వం వొదులుకున్న వాడిని-ప్రధానమంత్రి పదవికూడా లెక్కచేయని వాడిని- నన్ను స్వార్థపరుడినంటున్నావా?"

"కన్నబిడ్డ ప్రాణం కాపాడలేని నువ్వు స్వార్థపరుడివి కాకపోతే మరెవరు స్వార్థపరులు?"

"సీమా మానుతున్న వ్రణాన్ని కెలికి నట్లు సర్దుమణుగుతున్న పుకార్లను రెచ్చగొట్టటం తప్ప మరేం ప్రయోజనం వుండదు!"

"దేశంకోసం ప్రధానమంత్రి పదవిని వొదులుకున్నారే మీరు కోరితే హోంమంత్రి మీ మాట వినడా?"

"అతను రాజకీయాల్లో నా చిరకాల ప్రత్యర్థి. నా కోరికను ఆసరాగా తీసుకుని నాకు వ్యతిరేకంగా పెద్ద దుమారం లేవదీస్తాడు తప్ప ఫలితం వుండదు!"

"ఈ మాటను నమ్మేవాళ్లెవరూ వుండరు! సర్దార్ కన్నకొడుకు ప్రాణాలను కాపాడలేనంత బలహీనుడు అసమర్థుడు అంటే ఎవరు నమ్ముతారు?"

"సీమా బాబుని చూడాలని నాకు మాత్రం లేదా!-కాని పరిస్థితులెదురైనప్పుడు ఎంతటివాడైనా తల వొగ్గక తప్పదు!"

"ఆపండి మీ బుకాయింపు!"

"సీమా-బందిపోటు మోహినికి కబురు చేస్తాను ఎంత డబ్బు కావాలంటే అంత- లక్ష, రెండులక్షలు, పదిలక్షలు ఇస్తాను. మోహన్‌ను వదిలేయమని కబురుచేస్తా."

"ఉహూ! మోహినికి డబ్బు అవసరం లేదు. తనమీద కేసులు ఎత్తివేయమని కోరుతున్నది."

"ఆయుధాలు స్వాధీనం చేసి ప్రభుత్వానికి లొంగిపోమను- అప్పుడు ప్రభుత్వం కేసుల విషయం పట్టుపట్టదు!"

"ఆ పని చేయటానికి మీ సహాయం సలహా అవసరం లేదు!'

"సీమా నన్నెందుకర్థం చేసుకోటానికి ప్రయత్నించవు?"

"మిమ్మల్ని పూర్తిగా అర్థం చేసుకున్నాను. కన్నబిడ్డ ప్రాణాలు తీయటానికి వెనుకాడని కసాయివి!"

కోపం వెల్లువికి "ఎవరు నువ్వు-ఎందుకు నా జీవితంతో చెలగాటమాడుతున్నావు? ఎవరు పంపారు నిన్ను? ఇన్నాళ్ళు ఎక్కడున్నావు? ఇప్పుడెందుకొచ్చావు?"

పకపక నవ్వింది సీమా.

"నీ కామవాంఛ తీర్చుకోవటానికి ముందు నన్నీ ప్రశ్నలడిగివున్నట్లయితే బాగుండేది! అప్పుడు పనికి వచ్చిన నా శరీరం యిప్పుడు నీకు రోత పుట్టిస్తున్నదా?"

అప్పటివరకు నిగ్రహించుకున్న కపర్ది కోపంతో వూగిపోతూ 'సీమా' అని గర్జించాడు.

పిచ్చెత్తినదానిలా నవ్వుతున్న సీమను సమీపించి "ఎందుకిలా అల్లరిచేస్తావు-ఆపు" అని అరిచాడు.

"నీ బతుకు బయటపెడ్తా- నువ్వెంత నీచుడివో ప్రజలకు చెబుతా! నీ నిజస్వరూపం నగ్నంగా అందరిముందూ వుంచుతాను! నలుగురూ నిన్ను చీదరించుకునేలా చేస్తా నన్ను

బలాత్కారంగా అనుభవించావని చెబుతా! రాజకీయాల్లో నీకు భవిష్యత్తు లేకుండా చేస్తా" బిగ్గరగా అంది సీమా.

అనురాగం ద్వేషంగా మారినప్పుడు ప్రళయ సదృశమవుతుంది కపర్ది విషయం లోను అదే జరిగింది!

అప్పటి వరకు సీమామీద మనసులో పెంచుకున్న ప్రేమ, అభిమానం పోయి విపరీతమైన కోపం, ద్వేషం ప్రతీకారేచ్ఛ రగిలి రెండు చేతులతో ఆమె గొంతును బలవంతంగా పిసుకసాగాడు.

"అహహ" సీమా గొంతులో వికటాట్ట హాసం ఆగేవరకు కపర్ది చేతులు వుక్కుకడ్డీల్లా నలుముతూనే వున్నాయి.

అదివరలో ప్రేమానురాగాలు వర్షించిన సీమా కళ్ళు పరిహాసిస్తూ ద్వేషిస్తూ నవ్వుతూనే వున్నాయి - స్వరపేటిక నుండి ధ్వను లాగిన తర్వాత కూడా!

"సర్జార్జీ" పొలికేక పెట్టాడు నరసింహం. అప్పుడుగాని జరిగిన దేమిటో అర్థమై సీమా నిర్జీవశరీరాన్ని వదిలివేయలేదు కపర్ది! దూది బొమ్మలా నేలమీద పడిపోయింది సీమా.

"ఎంత పని చేశారు సార్" వణికిపోయాడు నరసింహం.

బతికి సాధించాలనుకున్న సీమా ఆశయం చచ్చాక నెరవేరింది.

రాజకీయాలలో కపర్ది స్థానం మరింత బలహీనమైంది.

సీమా అన్న కపర్ది మీద కోర్టులో పెట్టిన కేసు సాక్ష్యాలు లేక వీగిపోయింది!

మళ్లీ జీవితంలో పదవీ రాజకీయాలు జోలికి పోలేదు కపర్ది!

గవర్నరు పదవికి రాజీనామా చేసి ఉదయపూర్ వచ్చి పరిశ్రమలు స్థాపించాడు.

రాజభవన్ కాళీచేసి వస్తుండగా వచ్చింది మొదటిపెట్టె.

నర్తిస్తున్న మోహిని బొమ్మ-"నా మాట వినలేదు గదూ-చూస్తా-నీ అంతు చూస్తా మోహిని" అన్న చీటీ వున్నాయాపెట్టెలో.

అప్పట్నుంచీ అడపా దడపా పెట్టెలు వస్తూనే వున్నాయి.

కొరివితో తల గోక్కున్నట్లు మోహిని స్థావరం దగ్గరే తను వచ్చి స్థిరపడ్డానని అర్థం అయింది కపర్దికి.

కైలాసగిరి దుర్గం మోహినికి దుర్భేద్యంగా వుండేట్లు అన్ని ఏర్పాట్లు చేసాడు కపర్ది.

కాని అడపాదడపా మోహిని మురావాళ్లు జొరబడి అందిన వస్తువులు దోచుకుని వెళ్లేవాళ్లు.

అప్పుడప్పుడూ పెట్టెలూ వచ్చాయి. అవి శత్రుదుర్భేద్యమైన కైలాసగిరి దుర్గం

## మీకు తెలుసా?

### బాక్సింగ్‌లో ఎక్కువ అంతర్జాతీయ టైటిల్స్

బాక్సింగ్‌లో ఎక్కువ అంతర్జాతీయ టైటిల్స్ హెవీ వెయిట్ బాక్సర్ కౌర్‌సింగ్‌కు దక్కాయి. 1980, 82లో ఏషియన్ బాక్సింగ్ చాంపియన్ షిప్‌ను కౌర్ గెలుచుకున్నాడు. అంతర్జాతీయ పోటీలలో నాలుగు బంగారు పతకాలను కౌర్ చేజిక్కించు కున్నాడు



### విదేశాల్లో తొలిటెస్ట్ విజయం

విదేశాల్లో జరిగిన క్రికెట్ టెస్ట్‌లో మన దేశం 1968లో తొలివిజయాన్ని సాధించింది. న్యూజిలాండ్ పై జరిగిన పోటీలోమన జట్టు విజయం పొందింది. ఆ జట్టుకు పటౌడీ నాయకత్వం వహించారు.

### తొలి క్రికెట్ టెస్ట్ విజయం

క్రికెట్‌లో తొలి టెస్ట్ విజయాన్ని మనదేశం 1952లో చవిచూసింది. విజయ్ హజారే నాయకత్వంలో మద్రాసులో జరిగిన పోటీలో ఇంగ్లండ్ జట్టుపై మనదేశం విజయం సాధించింది.

### చెస్‌లో మహిళా క్రీడాకారిణి

చెస్‌లో మహిళా క్రీడాకారిణి బొంబాయికి చెందిన భాగ్యశ్రీ సాథే. 1986 ఆగస్టులో జరిగిన పోటీలో ఆమె గెలుపొందింది.

### తొలి టెస్ట్ క్రికెట్

అధికారిక తొలి టెస్ట్ క్రికెట్ 1932 లార్డ్స్‌లో జరిగింది. ఆ జట్టుకు సి.కె. నాయుడు నాయకత్వం వహించారు. ఇంగ్లండ్‌తో జరిగిన ఆ పోటీలో మనదేశం ఓటమి చవిచూసింది.

### అంతర్జాతీయ పోటీల్లో ఎక్కువ సార్లు పాల్గొన్న బాక్సర్

బాక్సింగ్ పోటీల్లో ఎక్కువ సార్లు పాల్గొన్న ప్రతిభ లైట్ ఫ్లై వెయిట్ బీరేందర్‌సింగ్ థాపకు దక్కుతుంది. 1977 నుంచి 82 వరకు థాప 10 సార్లు భారత్ తరఫున పాల్గొని ఐదు అంతర్జాతీయ పతకాలను చేజిక్కించు కున్నాడు.

### ఉత్తమ ప్రతిభ

ఫెదర్ వెయిట్ బాక్సింగ్ పోటీలలో ఎం. క్సేవియర్ (సర్వీసెస్) ఉత్తమ ప్రతిభను కనబరిచాడు. ఢిల్లీలో 1982లో జరిగిన ఏషియన్ గేమ్స్‌లో మంగోలియాకు చెందిన రవ్సాత్ ఆట్‌గాన్ బేయర్‌ను మొదటి రౌండులోనే మూడుసార్లు క్సేవియర్ ఓడించి తన ప్రతిభను నిరూపించు కున్నాడు.

### సెంచరీలు చేసిన తండ్రీ కొడుకులు

క్రికెట్ చరిత్రలో సెంచరీలు చేసిన తండ్రీ కొడుకులుగా లాలా అమర్‌నాథ్, సురిందర్ అమర్‌నాథ్‌లు నిలిచిపోతారు. 1933లో ఇంగ్లండ్‌తో జరిగిన క్రికెట్ టెస్ట్‌లో లాలాఅమర్‌నాథ్ తొలి టెస్ట్ సెంచరీ చేయగా, సురిందర్ 1976లో న్యూజీలాండ్‌తో జరిగిన పోటీలో 124 పరుగులు సాధించాడు.

### ఎక్కువ డక్‌లు

ఎక్కువ క్రికెట్ పోటీల్లో పాల్గొని అసలు స్కోరంటూ సంపాదించని వ్యక్తి బి.ఎస్. చంద్రశేఖర్. అతను పాల్గొన్న 80 ఇన్నింగ్స్‌లోను 24 ఇన్నింగ్స్‌లో ఒక పరుగు కూడా చంద్రశేఖర్ సాధించలేకపోయాడు.

సేకరణ: తిలక్

లోని డెస్క్ మీద కెలా వచ్చాయో కనుక్కోలేక పోయారు!

** ** ** ** ** **

"సర్దార్" ఆదుర్దాగా పిలిచాడు రవి. నీరసంగా కళ్లు తెరిచాడు కపర్ది.

"మీకేమైనా అయిందేమో అనుకున్నాను"

"ఉహూ-వార్థక్యం పైబడ్డాక మనసు స్థిరంగా వుండదు గతంలోకి పయనమై పోతుంటుంది. బలవంతాన వర్తమానంలోకి తీసుకుని రావాలి! ఇవ్వాళ ఎందుకో వంట్లో అంత బాగాలేదు!"

"మరో రెండు ప్రశ్నలున్నాయి."

"అడగండి"

"వేరే విషయం అనుకోండి! మోహిని గురించి మీకేమైనా తెలుసా?"

కపర్ది కళ్లు మెరిసాయి. పెదాలు కంపించి దవడ ఎముక బిగుసుకుంది బుగ్గలు కందినట్లు ఎరుపెక్కాయి.

"మీ ప్రశ్నకు ఆయిల్ వ్యాపారానికి సంబంధం లేదనుకుంటాను."

"కాని మోహినికి, కైలాసగిరి ఎంటర్ ప్రైజెస్‌కు సంబంధం వుంది!"

"ఇవ్వాళ ఏంబాగాలేదు" కుర్చీలోంచి లేవబోయాడు కపర్ది.

"క్షమించండి సర్దార్‌సాబ్ - మోహిని గురించి నాకంతా తెలుసు. మీరు ఆమెను గురించి మాట్లాడడం మంచిది!"

కపర్ది కోపంగా రవివంక చూస్తూ "అందుకే వచ్చారా మీరు!"

"అవును!" దృఢంగా పలికాడు రవి.

"మోహిని గురించి మీకేం తెలుసో చెప్పండి?!"

## మోహినీతాండవం

"మోహిని" డబ్బు తీసుకుని కావలసిన వ్యక్తిని హతమార్చే ఒక శక్తివంతమైన సంస్థకు అధిపతి.

ఆమె మనుష్యులు వందలాదిమంది ప్రాణాలు తీసారు. కోట్లకొలది విలువ గల పరికరాలను ధ్వంసం చేశారు. విలువైన వ్యాపార రహస్యాలను కాజేశారు. ఏ కారణం వలనో మోహిని కైలాసగిరి ఎంటర్ ప్రైజెస్‌లో జేరాలనుకున్న సంస్థల సభ్యులను, అధిపతులను, ఉన్నతాధికారులను ఎక్కువగా హతమారుస్తున్నది?"

"పత్రికల కెక్కించనంటే వొక మాట చెబుతా!"

"చెప్పండి"

"మోహిని కంటే ప్రమాదకరమైన టెర్రరిస్టు ప్రపంచంలో ఎవరూలేరు. ఏం చేస్తుందో ఎలా చేస్తుందో ఎవరిమీద కురుకుతుందో తెలియదు.

హత్య, బ్లాక్‌మెయిల్, కిడ్నాప్, దొంగతనం, విధ్వంసకాండ ఏదీ మోహిని కసాధ్యం కాదు!"

"వ్యాపారంలో మీ పోటీదార్లు మోహినిని ఉపయోగిస్తున్నారంటారా?"

"లేదు అనలేను. కాని మా ప్రత్యర్థులూ మోహిని చేతుల్లో దెబ్బతిన్నవాళ్ళే."

"కాని కైలాసగిరి ఎంటర్‌ప్రైజెస్ మీద మోహిని ప్రత్యేకంగా కక్షగట్టినట్లుంది!"

"ఉహూ..."

"కైలాసగిరి ఎంటర్ ప్రైజెస్‌లో జేరిన, జేరాలనుకున్న కృష్ణాజీ, సందీప్, సుభాష్, శేఖర్ అందర్నీ మోహిని హత్యచేయలేదా?"

"మీ వూహాగానాన్ని నేను నమ్మలేను!"

"వాళ్లందర్నీ చంపిన వ్యక్తి నాకు తెలుసు!"

"అయితే అతన్ని తీసుకురండి మాట్లాడుదాం!"

"అది సాధ్యం కాదేమో సర్దార్ సాబ్!"

"నా మాట విను రంజిత్‌సింగ్. నువ్వీ మోహిని అనే పిశాచాన్ని గురించి పత్రికలలో తెలిపి ప్రపంచాని కామె నిజస్వరూపం తెలియజేస్తే నాకంటే సంతోషించేవాళ్లుండరు.

కానీ తగిన సాక్ష్యాధారాలు లేకుండా అలా చేస్తే అందరూ నవ్వుతారు."

చుట్ట వెలిగించుకుని తాగి-పొగవదుల్తూ "నువ్వు చెప్పిన వాళ్లందరూ సహజంగానే మరణించారు. వాళ్లలో ఎవరూ హత్య చేయబడలేదు.

వ్యాపారస్తులకు మానసికాందోళన ఎక్కువ ఆందోళన పడేవాళ్లలో గుండెజబ్బు లెక్కువగా వస్తాయనేది జగమెరిగిన సత్యం."

"కాని అందరూ గుండెజబ్బుతో మరణించడం యాదృచ్ఛికమంటే నేనొప్పుకోను."

"రంజిత్‌సింగ్-మీకీ విషయంలో ప్రత్యేకమైన ఇంటరెస్ట్ వుందా?"

"ఒక పత్రికా విలేఖరిగా మోహిని దురాగతాలను ప్రజలకు తెలియజేయాలని వుంది. మోహిని అనేకమంది వ్యాపారవేత్తలను బెదిరించి డబ్బు గుంజుతున్నది! ఎందుకనో మీ మీద ప్రత్యేకంగా కక్షగట్టింది!"

"అందుకు కారణం వుంది. నేను మోహిని బెదిరింపులకు లొంగలేదు. కోరిన డబ్బు యివ్వలేదు అందుకే కక్షగట్టింది!"

(ఇంకా వుంది)



## మందాకిని నిర్ణయం

ప్రేక్షకులు మందాకిని చిత్రాలంటే ఎంతో ఉత్సాహం కనబరుస్తారు- కారణం ఆ నటి నటించే చిత్రాలు కను'విందు'గా వుంటాయి. ఫొటోలో మాదిరి స్టిల్స్ దర్శనమిస్తాయి. కాని ముందు ముందు ఆ అవకాశం ప్రేక్షకులకు లభించదట. తను యిలాంటి పాత్రలు యిక ముందు చేయనంటోంది. ఆ మాటకే కట్టుబడి యింతవరకు ఒక్కక్రొత్త సినిమాకు కూడా సంతకం పెట్టలేదు మందాకిని. మరి యింత గట్టి నిర్ణయం మందాకిని తీసుకోవటానికిగల కారణాలేమిటో?!

# యువతి కవితా!

## దేవుడు

పేదలకు పట్టెడన్నం పెట్టలేనివాడా?
ధనికుల ధనాగారాల్ని నింపేవాడా?
అసలీ దేవుడెవరు?
పేదల నిందల్ని భరించేవాడా?
ధనికుల స్తోత్రాలకు
సంతసించేవాడా?
నిలువుదోపిడీలకు నిలువునా
లొంగిపోయేవాడా? ఎవరీ దేవుడు?
చాలినంత తిండి దొరకి
అందరి పొట్టలు నింపి-
కడుపులో మండే మంటలు ఆర్పి -
నిత్యశాంతి
నీ- నా గుండెల్లో నెలకొల్పేవాడే -
దేవుడు!
నీతినీ న్యాయాన్ని
ప్రపంచంలో చిరస్థాయిగా
ప్రతిష్ఠాపించాలని
నిన్నూ-నన్నూ
పేదలనూ-ధనికులనూ
కాలాన్ని
జీవితరంగం మీదకు దించి
దర్శకత్వం నిర్వహించే
దయామయుడే- మన దేవుడు!
మంచిని చూపించి
దాన్ని పెంచుకోమని
మనకప్పగించేవాడే
మన దేవుడు!

- బెల్లాల నరసింగరావు

## పోజు

నడుస్తున్న వాడిని చూస్తే
సైకిల్ వాలా పోజు!
సైకిల్ వాలాని చూస్తే
మోటార్ వాలా పోజు!!
మోటార్ వాలాని చూస్తే
చిన్నకారు నడిపేవాడి పోజు!
చిన్నకారు నడిపే వాడ్నిచూస్తే
బస్సునడిపేవాడి-పోజు!
బస్సు ఎక్కిన వారికి
క్రిందవున్న వార్ని చూస్తే పోజు
తనదాకా వస్తే కాని వదలదు
ఈ పోజు బాబుల బూజు!!

పట్టెం పరశురామ్



## తెలుగుభాష

తియ్యమామిడిపండుకన్నా
తెలుగు'భాషే' మధురమన్నా!
అమృతము రుచి ఎరుగకున్నా
తెలుగు తీపిని మించదన్నా!
భక్తి సంద్రమ్మై పారి
ముక్తి చెందినదీ తెలుగు!
శక్తి ప్రభంజనమై పోరి-వి
ముక్తి నొందినదీ తెలుగు!!
నన్నయార్యునిఘంటమే-ఒక
వింటియై కురిపించె తెలుగు!
వేల పద్యములల్లి వేమన
విందుచేసినదీ తెలుగు!!
కృష్ణపక్షపు కక్ష్యలో
పరిభ్రమించినదీ తెలుగు!
మహా ప్రస్థానమై సాగి
గళం ఘర్జించిందీ తెలుగు!!
ఎంకి శిగలో పంకజాలై
వెల్లి విరిసినదీ తెలుగు!
కులుకు తళుకుల పసిడిపలుకుల
కూనలమ్మ పదాలు తెలుగు!!
పద్యరచనై-గద్యవచనై
మినీ కవితై మెరిసె తెలుగు!
ప్రజాభాషై-ప్రజలయాసై
వెల్లివిరిసి నిలిచె తెలుగు!!

-రాపోలుపరమేశ్వరరావు

## అరాజకీయం

పంచభక్ష్య పరమాన్నాలమధ్య
ఉరిత్రాడుకువ్రేలాడుతున్న
శవంలా వుంది దేశ ప్రగతి
నేటి రాచకీయం-అమ్మా!
నీ గుండెల్లో గునపాలను దింపి
వ్రయ్యలుచేస్తూ
నీ ఒళ్ళో పదవులకోసం
నీ స్తనాన్నే గుంజి, గుంజి
కుడుస్తుంది అరాజకీయం!!

-కురువెళ్ళసాంబశివరావు

## ఆశలు-ఆశయాలు

ఎక్కడో ఉన్న తీరాలు
ఏనాటికీ నీదరిచేరలేవు
దగ్గరే ఉన్న కెరటాలు
నిన్ను తాకుతూ మురిపిస్తాయి!
చుక్కలలోని అందం మాత్రమే
తెలుసుకుంటాయి మనకళ్లు
చుక్కల కాంతులను మాత్రం
అందుకోలేవు మనకళ్లు!
అందినదంతా చేదని
అందనిదంతా తీయనని భావిస్తావు
అందినదే అందమని
అందనిదంతా వ్యర్థమని తెలుసుకో!
తుదిలేని కోర్కెలకై పయనించకు
కోరివచ్చినదాన్ని మాత్రమే స్వీకరించు
మనసును అదుపులో ఉంచు
నీ కోర్కెలకు కళ్ళెం వేయించు!
దూరపు కొండలు నునుపుగా
దగ్గరకొస్తే గరుకుగా ఉన్నట్లే
దూరాన ఉన్న ఆశలకై వెళ్తే
అవే నిన్ను కబళిస్తాయి!
నింగినున్న ఆశల సౌధాన్ని
నీవే నాటికీ అందుకోలేవు
అందుకే నీ ఆశయాలరథాన్ని
కొనసాగించు చివరిదాకా!

ఆశల కంతులేదు
ఆశయాల అంతం తృప్తి
ఆశలన్ని వదులుకో
నీ ఆశయాల్ని నిలుపుకో!

- జొన్నలగడ్డ శ్రీపద్మ

వారి అన్యోన్య దాంపత్యాన్ని గమనిస్తుంటే చాల ముచ్చటేసేది నాకు. వారి పెళ్లయి పాతిక సంవత్సరాలు కావస్తున్నా వారిమధ్య పెళ్ళికి మునుపు ఏర్పడిన అభిమానాలూ, ఆప్యాయతలూ ఏ కొంచెమూ చెక్కుచెదరకుండా నిరిచాయీ అంటే కారణం-వారిమధ్య ఏర్పడిన 'ప్రేమ' సాగరంలో మొదటినుంచీ అంతర్లీనంగా ప్రవహిస్తోన్న నిజాయితీయేనేమో?!

పెళ్ళైన తొలి సంవత్సరంలో భార్యాభర్తలమధ్య కనిపించే అనురాగపు ఆప్యాయతలూ, ఎదురుచూపులూ, విరహవేదనలూ వారి అనుబంధం పాతబడేకొలదీ అవి ఏడుపులూ, కీచులాటలూ, విసుగులూ.....నొసటి విరుపులుగా మారిపోయే ఎన్నో జంటలూ -

ప్రేమ పేరుతో పార్కులవెంటా, చీకటి సందులవెంటా తిరుగుతూ పెళ్ళి ప్రస్తావన వచ్చేసరికి కట్నకానుకలకూ, సంప్రదాయవాదులైన పెద్దల ఆజ్ఞలకూ బద్ధులౌతూ మనసొకరితోనూ, మనువొకరితోనూ పంచుకున్నా జీవితాలను ఆనందమయంగా గడిపేయగలుగుతున్న ఏ ప్రేమికుడుగానీ, ప్రేమికురాలుగానీ -

వారి స్థాయికెదగాలీ అంటే - ఎన్నిసార్లు పవిత్ర గంగాజలంతో స్నానాలు చేయాలి?

బుద్ధగయలోని మహాబోధివృక్షంక్రింద ఎన్ని సంవత్సరాలు తపస్సు చేయాలి? ఏమో? !

ఆ ఆదర్శ కుటుంబంతో రెండు సంవత్సరాలకు పైగా చేరువైన నా యెదలోతుల్లో లావణ్యపై గాఢంగా ప్రేమపొర పేరుకుపోతున్నదని గమనించేసరికి ఆమె డిగ్రీ పూర్తిచేసింది. ఆ సరికి పి.జి. కూడ పూర్తిచేసిన నేను ఆపై చదివే వోపికలేక పూర్తిగా ఉద్యోగ ప్రయత్నాలలో కాలాన్ని వెచ్చించసాగాను.

సరిగ్గా ఆ సమయంలోనే -

ఓ మధ్యతరగతి రైతుగా మా నాన్నగారు "వాన రాకడ....ప్రాణం పోకడ తెలియదట" అనే సూక్తి తెలుసుండీ సకాలంలో కురిసే వర్షపు ధారలకై బీడువారిన భూములతోపాటూ ఎదురుతెన్నులు కాచికాచీ విసుగుచెంది వున్న కొద్దిపాటి ఆస్తిపాస్తులనూ కుదువబెట్టి

## అందం! అద్దం!

మనిషి మనసు
అద్దంతో పోలుస్తే
అద్దం పగిలితే అతుకదు!
మనసు విరిగితే అతుకదు!
అద్దంలాగే పగిలిన మనస్సు
తిరిగి బాగుపడదు!
మంచిని ఏర్పరచడానికి
అహోరాత్రులు శ్రమించినా
ఫలితం మాత్రం శూన్యం
అందుకే మంచిని మనసును
నొప్పించరాదు!
మెప్పించడానికి కృషి చేయాలి
మనసుకి గాయమైతే
అలాగే ఉంటుంది!
అందుకే పోలుస్తారు
మనసుని అద్దంతో
జీవితాన్ని పోలుస్తారు
అందంతో -

- కంకటి శంకర్‌రావు

మోటార్ పంపుసెట్‌ను కొని లోవోల్టేజీ దెబ్బకు కొన్న మరుసటి రోజునే అది ప్రాణాలు విడువగా చివరికి ఇంటిని సైతం తాకట్టుపెట్టి గొట్టపు బావులను త్రవ్వించి రక్తమాంసాలను చెమటబిందువుల రూపంలో ఎరువులుగా వేయడం ద్వారా భూమిని సారవంతంచేసి పండించిన పంటను అగ్నిదేవుడు ఆఖరినిముషంలో తన కర్కశ జ్వాలా నాలుకలతో స్వాహాచేసాడని, విక్రమార్కునిలా ఆయన తిరిగి పంటను పండించగానే "ఓ అగ్నీ....నీకంటే గొప్ప శాడిస్టును నేను...." అని పరిహసించడానికై వరుణుడు అకాల వర్షాలతో కోతకొచ్చిన పంటచేలను రెండు పర్యాయాలు వరుసగా ముంపుకు గురిచేసి ఆనందించడంతో-కనుకొనల రెండు సంవత్సరాలుగా వెలిగించుకుంటూ వచ్చిన ఆశాజ్యోతులు పూర్తిగా ఆరిపోగా యిక వెలిగించుకునే శక్తిలేక నిస్తేజమైన చూపులతో శూన్యంలోనికి చూస్తూ నీరసంగా కూలబడిపోయారాయన!

ఆ కాలంలోనే-

లావణ్యపట్ల నా హృదిలో జనించిన ప్రేమప్రేరణ సముద్రపుగాలిలా హోరున సుళ్ళు తిరుగుతూ మొత్తం మెదడంతా ఆవరించసాగింది! అందుకేనేమో ఏ ఒక్కరోజు ఆమెను చూడలేకపోయినా ఆ రోజంతా మనసును ఏదో వెలితి తొలిచేసేది. ఫలితంగా ఆలోచనలు అదుపుతప్పి గుండెలో దిగులుపుట్టి ఒక్కసారిగా నీరసించిపోయేవాడిని!

పరువు మర్యాదలే ప్రాణంగా జీవిస్తూవచ్చిన నాన్నగారు మధ్యతరగతి రైతు స్థానంనుంచి వ్యవసాయకూలీగా క్రమంగా జారిపోయి 'పూలమ్మినచోటనే కట్టెలమ్ముకోలేక' అవస్థపడుతుండటాన్ని గమనించి నన్ను నేను వేసుకున్న మొట్టమొదటి ప్రశ్న-నేనున్న స్థితిలో 'లావణ్య'ను గూర్చి ఆలోచించడం ఎంతవరకూ సమంజసమూ అని?!

ఫలితంగా -

పాతిక సంవత్సరాలుగా ఆశలు వటవృక్షాల్లా నా తల్లిదండ్రుల గుండెల్లో బలంగా వ్రేళ్ళూనుకుంటుండగా నన్ను గొప్పస్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో అల్లారుముద్దుగా అపురూపంగా పెంచినవారిపై యింత వయసొచ్చీ యింకా ఆధారపడి, జీవిస్తున్నది చాలక 'లావణ్యతో నా సంసారం' అనే అంశంపై పగటికలలుకనే సమయంలో - ఏ ఒక్కనిముషమైనా వారి కష్టాలలో భాగం పంచుకోవాలని ఆలోచించలేకపోతున్నానూ అంటే -

ప్రేమ ఊబిలో కూరుకుపోయి గొప్ప 'ఎస్కేపిస్ట్'గా మారిపోతున్నానేమో ,అనిపించింది నాకప్పుడు.

అందుకు ప్రతిగా లావణ్యకు దూరం కావడం ద్వారా నా మనసు నామెవైపు నుంచి డైవర్షన్ చేయించాలని భావించి రెండు సంవత్సరాలపాటూ ఆమెతో ఏవిధమైన కమ్యూనికేషన్సూ పెట్టుకోకుండా గడప నిశ్చయించుకొని కష్టంమీద సఫలీకృతుడినయ్యాను. అయితే అప్పుడే తెలిసొచ్చింది నాకు -

అరేబియన్ రేస్ హార్స్‌నైనా తొలి ప్రయత్నంలోనే అదుపుచేయవచ్చునేమో గానీ 'ప్రేమ' అనేది ఉద్భవించాక అణచుకోగలగడం అసాధారణ విషయమూ అని!

దండకారణ్యంలో మూడు యుగా

లైనా ఒంటరిగా గడపగలమేమోగానీ చేరువలోనున్న ప్రియురాలిని చూడ కుండా ఒక్కరోజు గడపగలగటం ఎంత కష్టమైన విషయమో అని?!

ఆ సరికి లావణ్య పి.జి.కూడ పూర్తి చేసిన విషయాన్ని తెలుసుకుని ఆమెను అభినందించడానికై ఆమె యింటికి వెళ్ళాన్నేను. రెండు సంవత్సరాలుగా దూరంగా వుండటంతో జనించిన విరహ వేదననుంచి బయటపడటానికి ఒక్కసారి ఆమెను కళ్ళనిండుగా దర్శించుకోవాలీ అనే కాంక్షకూడ అందుకు కారణం కావొచ్చునేమో?!

రెండు సంవత్సరాల తరువాత ఆమె కుటుంబంతో ఆప్యాయతలను పంచుకోగలిగినందుకంటే మాటల సందర్భంలో వారు 'లావణ్యకు వరుణ్ణివెదికే ప్రయత్నాల్లో పడ్డామని' చెప్పిన సంగతికే ఎక్కువగా కదిలిపోయాన్నేను. అయినా మనసు చంపుకుని రోజులు గడప ప్రయత్నించాను. కానీ ప్రతిరోజూ రాత్రి -

- సమయం పన్నెండు దాటినా - పదే పదే ఓ అపరిచిత వ్యక్తి లావణ్య చేతిని గులాబీను స్పృశిస్తోన్నట్లూ పుచ్చుకుని అద్భుత ఆనందపారవశ్యంలో తేలియాడుతూ నెమ్మదిగా సుదూరతీరాలకు పయనమై వెళుతోన్న దృశ్యం కళ్ళ ముందు కదులుతూ యెదను రంపపు కోతకు గురిచేయసాగింది.

మండువేసవిలో వెంట ఒక్క మంచినీటి చుక్కైనా లేకుండా 'థార్' ఎడారిలో మిట్టమధ్యాహ్నం సంచరించే ప్రయత్నం చేయవచ్చునేమోగానీ మన సుపడ్డ ప్రియురాలు మరొకరి సొంతమవబోతున్నదని తెలుసుకునీ ఆమెతోడు లేకుండా భావిజీవితాన్ని గడపగలమనుకోవడం ఎంతటి అవివేకమైన ఆలోచన అన్నది అప్పుడే అర్థమయింది నాకు!

ఫలితంగా -

జీవితంలో సమస్యలనేవి అతి మామూలు. అసలు జీవితమంటేనే సమస్యలూ, పరిష్కారాలేనేమోకూడ... కష్టాలు కడతేరడానికి నా ప్రయత్నమేదో నే చేయాలని భావించి ఆమెకు అన్ని విషయాలనూ ఏకరువుపెడుతూ లేఖ వ్రాయడం మొదలుపెట్టాను. ఆ సందర్భంలో

## దాగుడుమూతలు

నేను చేయగల పని అదొక్కటే కావడంతోనూ, అసలంటూ ఆమె అభిప్రాయాన్ని తెలుసుకుంటే సరిపోతుందన్న ఆలోచన కలగడంతోనూ!

ఇదిగో - ఆ లేఖను కూడ యిక్కడ యథాతథంగా వ్రాస్తున్నా....చదువు....!

* * * * * *

ప్రియమైన నీకు.....

ఇది ప్రేమలేఖ అవునా కాదా అని కాదుగానీ "దీనిలోని నిజాయితీ విలువెంత? దానికి నేనివ్వాల్సిన ప్రాముఖ్యత ఎంత?" అన్న విషయాలు ఆలోచించి మనసు ప్రశాంతంగా వున్నపుడూ, మూడ్ బావున్నపుడూ ప్రతి వాక్యాన్ని నా కోణం నుంచి చూస్తూ చదువు. ఎందుకంటే -

'నిన్ను నువ్వు అంచనా వేసుకునేటపుడు మెదడునువుపయోగించు.... కానీ యితరులను అంచనావేసేటపుడు మాత్రం మనసు నుపయోగించు' అన్నాడుగా షేక్స్పియర్?!



### దర్శకురాలిగా జయాబచ్చన్

చాలాకాలం తర్వాత మళ్లీ జయాబచ్చన్ చిత్రరంగంలోకి అడుగిడబోతోంది. నటిగాకాదు... దర్శకురాలిగా. నటిగా తన ప్రతిభతో పేరుగడించినట్లు దర్శకురాలిగా కూడా పేరు సంపాదించగలదని అనుకుంటున్నారు పరిశ్రమలోని వాళ్లు. దర్శకురాలిగా మరి జయ అభిమానుల్ని ఎలా సంపాదించుకుంటుందో వేచి చూడాల్సిందే! దీనికి అమితాబ్ ఎలా ప్రతిస్పందిస్తాడో?

నా హృదిలో సరిగ్గా నాలుగు సంవత్సరాల క్రితమే నీపై 'ప్రేమ' పుద్భవించింది. కానీ రెండు సంవత్సరాల కుగానీ నా ప్రేమ సాధారణ అంశాలైన యిష్టం, కామం, ఆకర్షణ వంటి వాటినుంచికాదు పుద్భవించిందీ అన్న విషయాన్ని నిర్ధారించుకోలేక పోయాను. అఫ్కోర్స్ అవి ప్రేమలో వేరువేరు భాగాలు కావచ్చునేమో?!

ఆదర్శ దాంపత్యానికి ప్రతీక అయిన నీ తల్లిదండ్రుల సునిశిత పెంపకమూ, వారు నీపట్ల చూపే గారాబమూ....నీకిచ్చిన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలూ - అద్భుత సౌందర్యాన్నీ, సుమధుర కంఠస్వరాన్నీ, గొప్ప వ్యక్తిత్వాన్నీ నీకు అందించాయేమో నాకైతే తెలియదు గానీ వాటితాలూకు ఏ కొంచెమూ గర్వం నీలో లేకపోవడమే నన్ను ఆశ్చర్యపరుస్తోంది.

సృష్టికర్త తనకు నచ్చిన అన్ని అంశాలతోనూ 'అహల్య' వంటి అమ్మాయిని పుష్కరానికొకరి చొప్పున సృష్టించి ఈ ప్రపంచానికి అందిస్తాడట. ఆ అమ్మాయి దుఃఖమనేది ఎరుగక గొప్ప అదృష్టవంతురాలై భాసిల్లుతుందట. ఏదో ప్రాచీన గ్రంథంలో చదివాను. అందుకే నిన్ను భార్యగా పొందగలిగిన వ్యక్తి నీ అదృష్టాన్ని సగం పంచుకోవడంద్వారా ఈ భూమిలోనే గొప్ప అదృష్టవంతుల జాబితాలో అత్యున్నతస్థానాన్ని అలంకరించగలుగుతాడనేది నేను నమ్మిన సత్యం.

అదిగాక -

వినయ విధేయతలతోనూ, పొందికైన ఆలోచనలతోనూ, హుందాతనం పుట్టిపడే ప్రవర్తనతోనూ ఖచ్చితంగా నీవు సంసారం విషయంలో ప్రముఖపాత్ర వహిస్తూ నీ కుటుంబానికి మార్గదర్శకురాలివౌతావ్! సంఘంలో నీ భర్త ఎంతటి హోదాకలిగిన వ్యక్తిఅయినా సరే కుటుంబం విషయంలో నీ సలహాలనే ఎక్కువగా పాటించితీరుతాడు. అందుకు ప్రతిఫలంగా ప్రశాంతతనూ, ఆహ్లాదాన్నీ సదా నీ చేరువలో పొందుతూనే వుంటాడు. మరీ ముఖ్యంగా వున్నంతలో సరిపెట్టుకోలేక అసంతృప్తితో అనుక్షణం శాంతినికోల్పోతూ

బ్రతికే మధ్యతరగతి కుటుంబాల్లో కనిపించే "మిడిల్ క్లాస్ మొరాలిటీ"ను నీ చక్కనైన ప్లానింగ్‌తో ఖచ్చితంగా నీవు తరిమికొడతావ్!

ఇదేవిటీ....ఓ ప్రక్క 'ప్రేమ' అంటూనే సంసారాన్ని గూర్చి చర్చిస్తున్నాడూ అని నీకు నవ్వొస్తోంది కదూ...? అదే ఆశ్చర్యం... ఈ దేశపు సగటు యువ ప్రేమికుడిలా నీతో అందమైన సాయంత్రాలు రహస్యస్థలాల్లో గడపాలనో.... నిన్ను ముద్దులతో ముంచెత్తాలనో, కబుర్లు చెప్పుకుంటూ తిరగాలనో....ఊహాలు రావెందుకనో మరి? ఆ విషయంలో నేను 'సైక్రియాటిస్ట్'ను కలవాలేమో? ఆ విషయాన్నలా వుంచితే

ఇతని దృష్టిలో స్త్రీ అంటే సమయానికి వండిపెడుతూ, పిల్లల్ని కంటూ యంత్రంలా బ్రతికే మరమనిషేమో? అనుకుంటున్నావ్ కదూ? కాదు కాదు - అలాంటి భావాలకు పూర్తి వ్యతిరేకిని నేను!

స్త్రీ అంటే వంటింటి కుందేలనీ, భర్త కనుసన్నల్లోనే మెలగాలనీ, రోజంతా యింటిని కాపలాకాస్తూ గడపాలనీ, పతిని ప్రత్యక్షదైవంగా భావించి మగాడు ఎన్ని తప్పులుచేసినా తను మాత్రం పవిత్రంగావుంటూ పెద్దమనసుతో మొగుణ్ణే మొగసాల కెక్కించకుండా అటు పుట్టింటి పరువునూ యిటు మెట్టినింటి ప్రతిష్టనూ నిలుపుతూ మసలుకోవాలనీ వాదించేవారికి శత్రువున్నేను. అలాగని 'ఫెమినిస్టు'ను కాదు నేను!

నా దృష్టిలో స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం దగ్గర్నుంచీ మగాడితో సమానంగా అన్నివిధాల స్వేచ్ఛ వుండాలి! అలాగని పూర్తి 'మార్క్సిస్ట్'ను కూడ కాదునేను! నా భావాలు స్త్రీయలిజానికి దగ్గరగావున్నా స్త్రీయలిస్టును మాత్రంకాదు నేను!

స్త్రీ పురుషుల మధ్య ఎలాంటి భేదాలు కనిపించవ్ నాకు. కాకపోతే స్త్రీ సహజమైన సంసారాన్ని నీవు చక్కగా నిర్వహించగలవంటున్నానంతే! నా వుద్దేశ్యంలో ఈకాలం అమ్మాయిలకు పూర్తి విరుద్ధంగా అరుదైన వ్యక్తిత్వంతో ఎదిగిన నిన్ను స్వంతం చేసుకోగలిగిన వ్యక్తి తన భావిజీవితానికి ఓ గొప్ప స్నేహితురాలిని సంపాదించుకున్నట్లే!

మరి యిన్ని గొప్ప అంశాలతో అలరారుతోన్న నీ మనసు గెలవడమెలా అని ఆలోచిస్తే నా చిర్నవ్వే సమాధానమౌతోంది నాకు! ఎందుకంటే -

ఓ సాధారణ సగటుమనిషిని నేను. లేకి ప్రవర్తనను సైతం వున్నతవిలువలతో ఈ సంఘంచే కొలవబడటానికి నేను 'ఆస్తిపరుణ్ణి'కూడ కాను. కనీసం కనుచూపు మేరలో ఉద్యోగపు ఆశ కూడ కనిపించడం లేదు నాకు!

"మరలాంటి స్థితిలో నీ యెద కనుమలలో ప్రేమగీతికెలా ప్రతిధ్వనిస్తోంది?" అని నీవు అడుగుతున్నట్లే నా అంతరాత్మ అనుక్షణం నన్ను వేధిస్తూనే వుంది. అందుకే యిన్ని సంవత్సరాలుగా 'ప్రేమ' విషయంలో మౌనాన్నే ఆశ్రయంగా చేసుకోక తప్పలేదు నాకు!

అదిగాక 'ప్రేమ' అనేది రెండు వైపులనుంచీ వుదయిస్తేనే ఆ తరువాత ప్రేమికులిరువురూ ఏకమయ్యాక బయటపడే చిన్నచిన్న బలహీనతలు ఆ ప్రేమ వెల్లువలో కొట్టుకుపోతాయ్ అన్న నమ్మిక నాది! అయితే నావైపునుంచి ఏ ప్రయత్నమూ లేకనే నీ మనసు తెలుసుకోవడం (ఆమాటకొస్తే ఏ స్త్రీ హృదయాన్నైనా) చాల కష్టమైన విషయం అని తెలుసు నాకు. నీకు 'ప్రేమ' అనే పదంపై సదభిప్రాయమే వున్నా నా వంటి సాధారణవ్యక్తి నీ మనసు గెలుచుకోగలగడం కష్టంగానే తోచింది నాకు.

అంతేగాక ఒకవేళ నా ప్రేమను నీవు అంగీకరించలేకపోతే అంతవరకూ నీతో నేను పెంపొందించుకున్న స్నేహానుబంధాన్ని అనుమానించడం ద్వారా నన్నవమానించే అవకాశం నీకు వున్నందున కొంత వెరవ వలసొచ్చింది కూడ! నాలోని గొప్పతనం - వాస్తవాలకు దగ్గరగా ఆలోచించడం!

"అయితే మరి నన్నే ఎందుకు ప్రేమించాలీ..? నీవున్న స్థితిలో నీకంటే పేదపిల్లను ప్రేమించి పెళ్ళిచేసుకోవడంద్వారా ప్రేమతో విజయాన్ని సాధించగలగడమే కాకుండా నలుగురికీ ఆదర్శవంతమైన బాటనెందుకు చూపలేకపోయావూ. ...?" అని నీవు ప్రశ్నించొచ్చు! అందుకు నా దగ్గర రెండు జవాబులున్నాయ్.

'ప్రేమ' అనేది మెదడులోని వివిధ భాగాలలో అవలి వ్యక్తికి సంబంధించిన వివిధ గొప్ప అంశాలకుగానూ కలిగే ప్రేరణలకు మనసు లోతుల్లో అసంకల్పితంగా జనించే ప్రక్రియ!

వీళ్ళను ప్రేమించాలీ.....వీళ్ళను కూడదు అని మడిగట్టుకుని ఆచరించేది 'సంప్రదాయం' కావొచ్చునేమోగానీ ఖచ్చితంగా



'ప్రేమ'మాత్రం కాదు!

రెండో విషయానికొస్తే -

అసలు ఆనాడు, ఏ బాధ్యతలూ గుర్తించని దశలో భవిష్యత్‌ను నేను దర్శించగలిగివుంటే - అంటే నిన్ను ప్రేమిస్తున్నానూ అని ధైర్యంగా చెప్పి నీ చేతినందుకోగలిగే స్థాయినుండి కేవలం ఆర్థిక కారణాలవల్ల అధఃపాతాళానికి (విధి వైపరీత్యంతో) నెట్టబడి నీ ప్రేమకై ఆర్తిగా అల్లాడిపోయే స్థితికి చేరుకోవడం కనీసం నే ఊహించగలిగుంటే - ఆనాడే అంటే మొగ్గలా వున్నపుడే నా మనసులో మొలకెత్తిన ప్రతి చిన్న ఆలోచననూ బలవంతాన అయినా త్రుంచేయగలిగివుండేవాడినేమో?! కానీ యిప్పుడది గొప్పగా వికసించివుందేమో దానిని నా మది నుంచి వేరుచేయడం అంతసులభం కాదు....కాదు - అసంభవ విషయమైపోయింది నాకు!

ప్రేమకు నేను పూర్తిగా బానిసనైపోయాననీ.....నిన్ను నా తలపులనుండి తొలగించుకోలేకపోవడమే నాలో పెద్ద బలహీనతగా పరిణమించిందని ఆలస్యంగా గ్రహించాను.

స్థబ్దతనిండిన నిస్తేజమైన నా నిరాశామయపు అంధకార భవిష్యదాకాశంలో ఒకేఒక్క ఆశానక్షత్రం నిన్నుగురించిన ఆలోచన. అది మిణుకుమిణుకుమని మాత్రమే ప్రకాశిస్తున్నా.....ఆ కాస్త వెలుగులోనే నా జీవితపయనం అనుకున్నవిధంగా కొనసాగాలని అందుకు అంతరాయాన్నేబరుస్తోన్న నిరుద్యోగాన్నెలాగైనా జయించాలనే తపనతో విక్రమార్కునిలో వున్న పట్టుదలనూ, ఘజనీ మహ్మద్‌లో వున్న వుత్సాహాన్నీ నాలో నింపుకునే ప్రయత్నంచేస్తున్నాను.

స్థూలంగా చెప్పాలంటే నా భవితకు స్ఫూర్తివి నీవు!

నా ఈ సుదీర్ఘలేఖ ద్వారా నా పరిస్థితిని నీకు తెలియజేస్తున్నది - నీవు నా పట్ల జాలిని చూపుతావనో.....సానుభూతిని ప్రకటిస్తావనో.....తద్వారా నీ ప్రేమను పొందాలనో కాదు.....ఎందుకంటే ఆ మూడూ నా కయిష్టంగా మరి?!

ఊహలకంటే వాస్తవం ఎల్లప్పుడూ విరుద్ధంగానే ఐమీన్ చేదుగానేవుంటుంది! కనుక -

నా వాస్తవ పరిస్థితి తెలుసుకుంటే నాపట్ల స్పష్టమైన అవగాహన నేర్పరచుకుని దానిప్రకారం ఆలోచించుకునే వీలు చిక్కుతుంది. ఫలితంగా తీసుకున్న నిర్ణయాలు భవిష్యత్‌లో నిన్ను ఏవిధంగానూ బాధించలేవ్!

ఇలాంటి స్థితిలో నా ప్రేమను నీకు నివేదించవలసిరావడం నా దురదృష్టం. అలాగని యింకా వుపేక్షిస్తే తొందర్లోనే నీవు మరొకరి స్వంతం కావడంద్వారా నా ఈ ఆలోచనలకు కూడ నేను దూరం కావలసొస్తుంది. అదీ మరింత దురదృష్టకరం!

ఈ లేఖ ద్వారా నే ఆశిస్తున్నదేమంటే - నా అభిప్రాయాలతో నీవు ఏకీభవిస్తేగనుక - నీ పెళ్ళిప్రయత్నాలను సంవత్సరకాలంపాటూ వాయిదావేసుకోరాదూ అన్న నా కోరికను తీర్చడం!

ఆఖరి ప్రయత్నంగా ఈ సంవత్సర కాలంలోనైనా ఉద్యోగానికై తీవ్రకృషిని సల్పి విజయవంతమైతే నీ చేయందుకోగల నైతికస్థాయికి ఎదుగుతాను. ఫలితంగా నా జీవితలక్ష్యాన్ని ఛేదించగలుగుతాను.

'ప్రేమ' అంటే త్యాగమని నిర్వచిస్తారందరూ. కానీ అదేవిటీ.....?

నా 'ప్రేమ'లో నిండా స్వార్థమే కనిపిస్తోంది నాకు?! - క్షంతవ్యుణ్ణి!

చివరిగా నే కోరేదేమంటే -

నా అభిప్రాయాలతో నీవు ఏకీభవించినట్లైతే నాలుగు సంవత్సరాలుగా ఈ అగ్నిని గుండెలో దాచుకున్న నన్ను ఆదర్శంగా (ఈ విషయంలో మాత్రమే) తీసుకొని ఈ విషయాలను నీ గుండె గదిలోనే శాశ్వతంగా సమాధిచేసెయ్. భూమ్యాకాశాల సాక్షిగా యికపై నీకెలాంటి యిబ్బందినీ కలిగించను.

ఇంతటితో ముగిస్తూ నీ...అభిలాష్!

పి. ఎస్. నీ పేరుకుముందు 'అపురూప' అనే పదాన్ని చేర్చుకోవాలనే ఆలోచనే ఎప్పుడూ రాలేదా నీకు?

* * * * * *

ఆ విధంగా లేఖను పూర్తిచేసి లావణ్యకు అందించాక నాపట్ల ఆమె ముఖావాన్నీ మౌనాన్నీ గమనించి ఆమె విషయంలో మొదటిసారిగా తప్పుగా ప్రవర్తించానని తెలుసుకున్నాను. అందుకు పరిహారంగా ఆమె వ్యక్తిత్వ ప్రశాంతతకు ఆపైన అయినా భంగం వాటిల్లనీయరాదన్న ఉద్దేశ్యంతో ఆమెకు తెలియజేయకుండా ఉద్యోగాన్వేషణార్థంకూడ సుదూరతీరాల కేగిపోయాన్నేను.

ఆ నేపథ్యంలో -

ఒంటరితనా న్ననుభవిస్తూ మనోవేదనతో క్రుగ్గుతోన్న నన్ను నీ స్నేహితు



### గోవింద గోపికలు

గోవింద తనతోపాటు జూహీచావ్లాను, దివ్యభారతిని బుక్ చేసుకుంటున్నా డట చిత్రాల్లో. తన స్వంత చిత్రంలో దివ్యభారతిని హీరోయిన్‌గా బుక్‌చేయటమే కాకుండా నిర్మాతలందరికీ రికమెండ్ చేస్తున్నాడు. మళ్లీ ఏమనుకున్నాడో ఏమో... దివ్యను కాదని జూహీకి ఆ అవకాశం కల్పిస్తున్నాడు. ఈ విధంగా గోవింద తన కిష్టమైన గోపికలందరికీ అవకాశం కల్పిస్తూ అందర్నీ ఆనందపరుస్తున్నాడు

నిగా చేసుకోవాలనే కాంక్షతో అంతవరకూ నే వ్రాసిన కథలన్నింటినీ సమీక్షిస్తూ ఓ కలం స్నేహితురాలిగా నీవు వ్రాసిన లేఖ - బీడువారిన భువిపై కురిసిన తొలకరిజల్లులా - ఎడారివాసికి వినిపించిన కోయిల కూతలా - నా మనోక్లేశాన్ని దూరంచేస్తూ ఆహ్లాదాన్ని కలిగించింది!

అలా ఆరంభమైన మన కలం స్నేహం పిల్లకాలువలో పుట్టి నిర్ఝరఝరీ ప్రవాహంలా కొనసాగుతోన్న నేటి తరుణంలో -

నీవు అత్యంతశ్రద్ధతో నా సాధారణ యిష్టాలైన ఇన్‌స్టెంట్ కాఫీ దగ్గర్నుంచి తిలక్ కవిత్వం వరకూ ప్రతి చిన్న విషయాన్నీ నా లేఖలనుంచే సేకరించుకుని నన్ను గాఢంగా ప్రేమిస్తున్నానంటూ వ్రాసిన నీ లేఖలోని అభిమానం నాకు గొప్ప ఆనందపు అనుభూతిని కలిగిస్తున్నా - ఆ మనసును లావణ్య నుంచి నీవైపుకు డైవర్షన్ చేయించలేకపోతోంది!

ప్రేమంటే యిదేనేమో?! అయితే-

ప్రేమించబడటంలోని అనుభూతి మాత్రం అమృతప్రాయమని యిప్పుడే తెలిసింది నాకు!

మరి - నా లావణ్య ఆ అమృతాన్నెందుకు కాలదన్నుకున్నట్లూ?!

ఏమో-ఆ విషయం వదిలేసినా-

నీవు నాపట్ల పెంచుకున్న అనురాగాన్ని కాదనడంద్వారా నేనూ యిప్పుడా అమృతాన్ని కాలదన్నుకుంటున్నట్లే!

అందుకు కాదుగానీ తద్వారా నిన్నెంతటి డిజప్పాయింట్‌మెంట్‌కు గురిచేస్తున్నానో అనే ఆలోచనే నన్నెక్కువగా కోసేస్తోంది. అందుకే ఆ విషయంలో నా అశక్తతను వెల్లడి చేయడానికే నా కథంతా విపులంగా వ్రాస్తున్నా....నీవు తప్పక అర్థంచేసుకోగలవ్....నాకు తెలుసు!

చివరిగా చిన్నకోరిక -

నన్ను మనస్ఫూర్తిగా క్షమించగలిగితేనే -

క్షమించు నేస్తం!

సదానీఅభిమానాన్నాశించే నీ....అభిలాష్.

* * * * * *

అంతటితో లేఖను పూర్తిచేసి కవర్‌లో వుంచి చిన్నారి 'అజయ్'ను పిలిచి బయట పోస్ట్‌బాక్స్‌లో వేసిరమ్మని యిచ్చి తేలిగ్గా నిట్టూర్చాను.

* * * * * *

మార్చినెల ముగింపుకు రావడాన, కొత్తమూలాన బ్యాంకులో పనిభారం అధికమై ఆ ఒత్తిడిలో మునిగిపోయాన్నేను. ఆ నేపథ్యంలో పదిరోజులు గడిచిపోయాయ్.....!

పదకొండోరోజు పోస్ట్‌లో అందిన కవర్‌ను లంచ్ అవర్లో విలాసంగా కూర్చొని విప్పి చదవడం మొదలుపెట్టాను...!

* * * * * *

అభిలాష్‌గారికి...




**కాళ్లు**

రాముడు స్కూలు నుంచి ఉత్సాహంగా వచ్చాడు. చంకలో కొత్త పుస్తకాన్ని చూసి తండ్రి అడిగాడు, ఏం పుస్తకమని?

“నాకు పరీక్షలో ఫస్టు మార్కు వచ్చింది. బహుమానం ఇచ్చారు.” అన్నాడు రాముడు.

“ఏం ప్రశ్న వేశారు మాస్టారు?”

“ఉష్ణపక్షికి ఎన్నికాళ్లు? అని అడిగారు. మూడుకాళ్లు అని చెప్పాను.”

“ఉష్ణపక్షికి రెండేగా కాళ్లు?”

“అవును, నాకా సంగతి తరవాత తెలిసింది. అందరూ నాలుగు కాళ్లన్నారు. నేను మూడు కాళ్లన్నాను. నాలుగు కంటే మూడు ఎక్కువ రైటుగా!” అన్నాడు రాముడు.

నమస్సుమాంజలి! నేను గుర్తున్నానా? ఉండే వుంటాన్లెండి! మీకు పామిస్ట్రీ బాగా తెలుసుననుకుంటున్నారు కదూ? అందుకే నా చేతిని చూడకుండానే 'నేను ప్రపంచంలోనే అత్యంత అదృష్టవంతురాలినై విలసిల్లుతానని' చెప్పగలిగారుకదూ? కానీ అది శుద్ధ తప్పని తేలిపోయింది! ఈ ప్రపంచంలోనే అత్యంత దురదృష్టవంతురాళ్ళ వరుసలో ముందుగా వుంటాన్నేను. ఎందుకంటే -

కాళ్ళు పారాణి ఆరకమునుపే-నా మెళ్ళో పడిన మాంగల్యానికి విలువ తెలియకమునుపే - అందుకు సాక్షీభూతమై నిలచిన అగ్నిహోమం ఆరకమునుపే -

ఈ లోకంతోగానీ నాతోగానీ యిక ఏ విధమైన సంబంధాలూ అవసరం లేనట్లూ ఈ ప్రపంచంలో నన్నో పతి లేని సతిగా ఒంటరిని చేసి మిగిలిస్తూ నా భర్త తానొక్కరే పరలోకాలకు హడావిడిగా పయనమై వెళ్ళిపోవడం నా దురదృష్టం కదూ?

.................

ఏమిటదీ....మీ కన్రెప్పల్లో వ్యాపిస్తున్నది గుండె తడేకదూ...?

మీలో - పైకి కనిపించేది మెటీరియలిజం.....గుండెపొరల్లో దాగిందిమాత్రం అసాధారణసున్నితత్వం....కదూ?

ఈ రోజు తారీఖెంత? ఇంత సులభంగా మిమ్మల్ని ఫూల్‌ను చేయగలననుకోలేదు.... ఫ్!

నా ప్రియాభిలాషా....(నా కిష్టమైన కోరిక - మీరే మరి)

చాలమంది మగాళ్ళు యుక్తవయసు రాగానే ప్రేమలో పడుతుంటారు. దానిని నెగ్గించుకోవడానికై “నీకోసం కొండమీది కోతినైనా సరే పట్టితెస్తా” వంటి అసంబద్ధ వాక్యాల దగ్గర్నుంచీ “నీవు కాదంటే ప్రాణాలు విడుస్తాను” అనడం వరకూ ఎన్నో రకాలుగా తమ ప్రేమ విజయానికై అసహజ ప్రవర్తనలతో విసిగిస్తుంటారు! కానీ -

అవన్నీ తాము ప్రేమించిన అమ్మాయిలు తమ స్వంతమయ్యేవరకే!

ఒకవేళ ఆ అమ్మాయిలు వారి

## దొంగ దొరికాడు

వెచ్చాల కొట్టుకి వెళ్ళిన తులసమ్మ ఉన్నట్టుండి గావు కేకెట్టింది దాంతో ఆమె వెనుక నిలుచో నున్న దృఢకాయుడు పరుగు లంకించు కున్నాడు అది చూసి అక్కడున్న ఓ బీట్ కానిస్టేబుల్ వెంబడించి, చివరికా దృఢకాయుడ్ని పట్టుకున్నాడు. అతని వద్ద ఒక కత్తి దొరికింది అతడు పోలీసులకు దొరకకుండా చాలా కాలంగా తప్పించుకు తిరుగుతూన్న పేరు మోసిన గజదొంగ గంగూలీ!

"అమ్మా! మీరు గనక ఇందాక అలా




కేకెట్టక పోయి ఉంటే, ఘారువేషంలో వచ్చిన ఈ గజదొంగ ఆ కొట్టును లూటీ చేసేవాడే! ఇంతకీ, మీరితన్ని ఎలా గుర్తు పట్టారు?" అని అడిగాడు కానిస్టేబుల్ కుతూహలంతో.

"అదంతా నాకేం తెలుసయ్యా! ఆ కొట్టతను కందిపప్పు ధర ఇరవైరూపాయ లనేసరికి నాకు తెలియకుండానే గాభరాగా అరిచేశాను," అందామె అమాయకంగా చూస్తూ.

- జి వి.జి.

ప్రేమను తిరస్కరిస్తే ప్రాణాలను అంతవరకు విడవగలిగిన ఆ ప్రేమే వారి ప్రాణాలనుసైతం తీయగల ద్వేషంగా మారిపోతుంది కూడ! అందుకు ఉదాహరణే ఈమధ్యకాలంలో బొంబాయిలో పదహారేళ్ళ విద్యార్థిని 'సంగీతాపాటిల్'ను పట్టపగలే ఆమెను ప్రేమించిన 'హరీష్‌పటేల్' అనే విద్యార్థి పెట్రోల్‌పోసి పరీక్షహాల్లోనే పాశవికంగా తన ప్రేమనామె అంగీకరించలేదని హత్యచేయడం! ఇలా ఎందుకు జరుగుతుందంటే వారు భావించినట్లుగా తమ మనసుల్లో ఏర్పడిన భావం పవిత్ర అనుబంధమైన 'ప్రేమ' తాలూకుది కాకపోవడం వల్ల! అది

ఆకర్షణో....ఇష్టమో... తాత్కాలిక కామపుకోరికో....లేక మరొకటో అన్నది వారు స్పష్టంగా నిర్ధారించుకోలేకపోవడంవల్ల! అలాంటి వ్యక్తుల 'ప్రేమ'నే 'అమెచ్యూర్ లవ్'గా అభివర్ణించొచ్చు.

అయితే నా విషయంలో అలాంటి సాధారణ భావాల కతీతుడైన అద్భుత వ్యక్తి నా ప్రేమకై తహతహలాడటం నా అదృష్టమేమో. 'యండమూరి' నవలా నాయకుడిలా 'నా ప్రేమలోని నిజాయితీ విలువెంత?' అని ప్రశ్నించుకుని వింధ్య పర్వతాలకెళ్ళి ఘోరతపస్సుచేసి అతీత శక్తులను సాధించలేకపోయినా -

నా ప్రేమలోని ప్రేమ శాతమెంతా అని తర్కించుకోవడంలోనే రెండు సంవత్సరాలు గడపగలిగారూ అంటే 'ప్రేమ'కు సంబంధించి అరుదైన వ్యక్తిత్వాన్ని మీరు స్వంతం చేసుకున్నట్లే!

ఆ అతీతశక్తులకంటే మీ నిగ్రహశక్తి నా దృష్టిలో ఖచ్చితంగా గొప్పదే!

నేను మొదట్లో వివరించిన వాటిలో రెండవది భరించగలను! అంటే -

నేను మీ ప్రేమను తృణీకరిస్తే, మీరు నాపట్ల అంతవరకూ ఏర్పరచుకున్న ప్రేమను 'హరీష్‌పటేల్'లా ద్వేషంగా మార్చుకున్నా!

కానీ -

నువ్వే నా ప్రపంచం అని నన్ను గాఢంగా నమ్మించి మీ ప్రేమపూరిత సంభాషణలతోనూ ప్రవర్తనతోనూ నన్ను 'ఎవరెస్ట్' ఎక్కించి ఆపై నేను మీ స్వంతమయ్యాక ఏ క్షణంలోనైనా ఆ ప్రేమ స్థాయికుతగ్గి నాపట్ల మీరు ప్రవర్తించినా -

'ఎవరెస్టు శిఖరం' నుంచి 'బంగాళాఖాతం' లోనికి జారిపోతాన్నేను!

స్పష్టంగా చెప్పాలంటే 'హిపోక్రసీ'ను భరించలేను నేను!

మీరు మీ నిరుద్యోగానికి బాధపడుతూనో....నే అంగీకరించకపోవచ్చునేమో ననే అపనమ్మకంతోనో మీ ప్రేమను నాలుగు సంవత్సరాలకుపైగా గుండెగదిలో అణచిపెట్టుకోగలిగినంతమాత్రాన మీ 'ప్రేమ' పవిత్రతను నే అంచనా వేయగలిగేదెలా....?

అందుకే -

మొదటి ప్రపంచయుద్ధంలో అత్యంత పేరు గడించిన ప్రముఖ గూఢచారిణి 'మాతాహరి' వంటి నా స్నేహితురాలి ద్వారా (అదే మీ కలం స్నేహితురాలు) చిన్ననాటకం ఆడేను. ఫలితంగా -

కళ్ళకు రెండు అరచేతులనూ అడ్డు పెట్టుకునిగానీ చూడలేనంతటి ధగధగాయమానశోభితమై 'కోహినూర్'ను మించిన ప్రభతో భాసిస్తోన్న మీ 'ప్రేమ' అనే వజ్రపుకాంతిని నా గుప్పెడు గుండెకే పరిమితం చేయాలన్న కాంక్షతో అల్లాడిపోతున్నా న్నేను!

మీ కోసం నా పెళ్లి ప్రయత్నాలు ఒక్క సంవత్సరం పాటు వాయిదా వేసుకోమని కదూ మీరు కోరారు?! మీ కోసం ఒక్క సంవత్సరమేకాదు-వంద 'కాస్మిక్ ఇయర్'లైనా సరే వేచి ఉంటాన్నేను!

చివరగా-

నా 'ప్రేమ' పరీక్షలతో మిమ్మల్ని ఏ కొంచెం బాధించినా- క్షంతవ్యురాలిని!

మీ (లేఖ)రాకకోసం'చకోరం'లానిరీక్షించే..

మీ... 'అపురూప' (లావణ్య)!

పి.ఎస్.: ఇకనైనా మీరు మీ పెసిమిజం నుండి బయటపడండి సార్... మరి మీ 'ప్రేమ లేఖ' నిండా నింపింది అదేగా?!

* * * * * *

..ప్రతిరోజు లాగే ఈ రాత్రి కూడ నే నిద్రకు దూరమయ్యాను...!

కాకపోతే చిన్నతేడా-

దుఃఖంతో ఇన్ని రోజులూ-నిజమైన ఆనందంతో ఈ రోజూ... అంతే!

'దుఃఖార్తి ప్రభవం సుఖం' అంటే ఇదేనేమో?! ●

# నిత్య జీవితంలో పండ్లు వాడుక!

రకరకాల పండ్లు అంటే ఇష్టముండని వారు ఉండరు కాని ఒక్కొక్క పండుకి ఒక్కొక్కతరహా గుణాలు మనిషికి ఉన్నట్లే ఉంటాయి. అలాగే విటమిన్స్ ఇత్యాది లక్షణాలుంటాయి. ఒకసారి పరిశీలిద్దామా!



**చక్రకేళీ అరటిపండు:** దీనిలో తెల్ల చక్రకేళీ ఎర్రచక్రకేళీ అని రకాలుంటాయి. అరటిపండ్లలో రాజువంటిది. ఖరీదు ఎక్కువే! సువాసనగా, మంచి రుచిగా ఉంటుంది. ఈ పండులో స్పెషాలిటీ ఏమిటంటే తొక్కపారేస్తాము. కాని అందులో అంటే ఆ తొక్క దళసరిగా ఉండటంవల్ల అసలు విటమిన్లు తొక్కగుజ్జులో ఉన్నాయి. దీన్ని తింటే మేహశాంతి, చలువ చేస్తుంది. పెరుగన్నంతో అరటిపండు లేందే అసలు తినలేని వ్యక్తులుకూడా ఉన్నారు. డైలీ చక్రకేళీ తినడంవల్ల స్కిన్ పాలిష్‌గా ఉంటుంది.

**కమలాపండు:** ఈ శీతాకాలం సీజన్‌లో విపరీతంగా చిన్న పెద్ద సైజుల్లో వస్తాయి. ఎక్స్‌డెర్మిన్‌ని అంటి ఎండో డెర్మిన్ అతికి ఉండటం ప్రత్యేకత ఆరెంజ్ కలర్



ముత్యాల తొనలతో చాలా రుచిగా ఉంటుంది. కాని చలువచేసే గుణంవల్ల జలుబుకూడా చేస్తుంది. మందు మిరియాలు నమిలేస్తే సమస్యలేదు కమలాఫలాలు ఎన్ని తిన్నా వాటి రుచి అద్భుతమే!! బత్తాయి, నిమ్మ, నారింజ వీటన్నింటికంటే మంచి రుచికరమైనది

**చెరకు :** నార్త్‌లో చెరుకు రసం మగ్ రూపాయి చొప్పున అమ్ముతారు అందులో నిమ్మరసం ఉప్పచేరిస్తే మరింత రుచి! మన ప్రాంతంలో చెరకు గెడలుగా కొరుక్కుతినడం అలవాటు దానివల్ల ఎళ్ళుకూడా గట్టిపడతాయి దీనిలో బంగారు తీగెచెరకు, మొగలినామ చెరకు, ఎర్రచెరకు, నల్లచెరకు, అడవిచెరకు మొదలగు జాతులు కలవు. వేసవిలో ఎక్కువగా వస్తాయి గుండెల్లో మంట - ఆకలి దప్పికలు లాంటివి తగ్గుతాయి భోజనానంతరం ఈ రసం సేవిస్తే జీర్ణశక్తి బాగా ఉంటుంది. నిల్వ ఉంచిన చెరకు రసాన్ని వాడితే త్రిదోషాలు ప్రకోపిస్తాయి.

**పంపరపనస పండు:** ఇది కోలా



గుండ్రంగా పెద్దగా ఉండి పైన గరుకుచర్మము కల్గి ఉండి ఉంటుంది లోపలి పింక్ కలర్ పెద్దసైజుతొనలు ఉంటాయి కొన్నింటిలో ఎర్రవి, తెల్లవికూడా ఉంటాయి. పులుపుతీపి రుచులు కల్గి ఉంటుంది

**ఉసిరికాయ:** ఇది పైత్యాన్ని హరింపచేస్తుంది. ఎండపెట్టి వగరుగా చేసి వాడుతారు. కళ్ళకు మంచి చలువచేస్తుంది. త్రిదోషాల్ని హరింపచేయడమేగాక సర్వవిధ పైత్యరోగాలమీద వాడుకోవచ్చు. కడుపులో త్రిప్పటమూ, అజీర్ణాన్ని పోగొడుతుంది దీని తైలం కూడా - ఆమ్లా హేర్ఆయిల్ చాలా మంచిది. దీన్ని నిల్వపచ్చడిగా పెట్టి ప్రతి నిత్యం మొదటగా నిమ్మకాయంత తింటే చాలా మంచిది

**ఖర్జూరపుకాయ:** మేహశాంతిని కలుగచేసి రక్తపుష్టినిస్తుంది ఇందులో పండువి, ఎండువి దొరుకుతాయి ఎండువి నీళ్ళల్లో నానవేసి పసిపిల్లలకు వడదెబ్బ తగలకుండా ఆ నీరు వాడుతారు. గుండెకు బలం వాత శరీరానికి మంచి మేలు చేస్తుంది



**బొప్పాయిపండు:** వాత తత్వం గలది. పచ్చికాయతో కూరలు పులుసులు వండవచ్చు పండుకాయలో ఎ విటమిన్ అధికం గనుక కళ్ళకు మంచిది

**దబ్బపండు:** దీనిలో నారదబ్బ - పుల్లదబ్బ రెండురకాలు - సి విటమిన్ ఉంటుంది ఉప్పులో ఊరేసి నిల్వపచ్చడి పెడతారు. కడుపులో బల్ల, జ్వరాలకు మంచిది

**పనసకాయ:** దీని కూర మంచి రుచి - వేడిచేస్తుంది మేధస్సును వృద్ధి చేస్తుంది. మంచి బలం - తొనలు రుచిగా ఉండటమేగాక ఆకలిపుట్టిస్తాయి గింజలతో వేపటంచేస్తారు

## కూరలు వాటి గుణాలు!

**తియ్యవంకాయ:** ఇది రుచికరమైనది - మంచి ఆకలి పుట్టిస్తుంది కాని





పైత్యగుణం వల్ల దీన్ని ధనియాల కారంతో వండితే మంచిది.

**బెండకాయ:** దీని ముక్కలు జిగురుగా శ్లేష్మతత్వాన్ని కల్గిఉంటాయి. కావి కూరగా వేపుడుగా వాడటం వల్ల అరుచి పోగొడుతుంది.

**చింతకాయ:** తినడానికి పుల్లగా రుచిగా ఉండటమేగాక నిల్వపచ్చడి పథ్యానికి ఎంతో మంచిది. వాతాన్ని పోగొట్టే గుణం ఉన్నది. చింతపండు పులుసు కూరల్లో - పులుసుల్లో వాడుకోవచ్చు. చింతపులుసు తిన్నవారికి చింతలుండవనే సామెతకూడా ఉన్నది

**కంద:** నీటికంద - పొట్టికంద - అంటే • దురదలేని తియ్యకంద ఎక్కువ తినడానికి ఇష్టపడతాము. వాత కఫ క్రిమి రోగాలమీద - ఉష్ణాన్ని పెంచడానికి వాడుతారు. ఆకల్ని వృద్ధిచేస్తుంధి.

**కొబ్బరి:** దీనిలో విటమిన్ల శాతము అధికము. పచ్చడిగాను ఇతర కూరలతో పప్పులతో కలిపి - స్వీట్స్ తయారీలో ముఖ్యపాత్ర వహిస్తాయి

**కందిపప్పు:** ఇది శరీరానికి మంచి పుష్టినిస్తుంది ఆకుకూరలతోను కట్టుచారు పప్పుపులుసుగా వాడుతారు.

***గజనిమ్మ:*** చేదుపులుపు, వగరు రుచులు కలిగి - చలువ - పైత్యహారి ఆకలి పుట్టిస్తుంది



**దోసకాయ:** దీనిని కూరగాను, పచ్చడిగాను వాడుతారు. ఎక్కువ వాడితే జలుబుచేస్తుంది. లేతదోసకాయలో పైత్యరోగాలు తగ్గి మంచి బలాన్ని ఇస్తుంది.

**దానిమ్మపండు:** ఇది వాత పిత్త కఫ రోగాల మీద బాగా పనిచేస్తుంది. త్రిదోష హరమైనది. మంచి ఆకల్ని కలుగచేస్తుంది. శ్లేష్మ తత్వము కలిగినవారికి మంచిదికాదు. ఇది రక్తం పట్టడానికి ఎక్కువగా తింటారు

**కరక్కాయ:** త్రిఫలాల్లో ఇది ఒకటి. దీన్ని పురాణ విషజ్వరాలు - శ్లేష్మాన్ని తగ్గించడానికి, గొంతు బొంగురు తగ్గడానికి కొంరి



చూర్ణంతో కలిసి తింటే తేనెతో తిన్నా ఆరోగ్యానికి మంచిది

**ఏలకులు:** సువాసన ద్రవ్యాల క్రింద



తాంబూలం - విందులలోను - వంటకాలలోను జీర్ణశక్తికి బాగా తోడ్పడుతుంది. వికారాది గుణాలు తగ్గుతాయి.

**కస్తూరి:** ఒంటికి వేడి పుట్టిస్తుంది. పిల్లల్లో జలుబువారికి బాలింతలకు వాడుతారు. దీన్ని అనేక మందుల్లో అనుపానంగా వాడతారు

**చింతచిగురు:** పుల్లగా రుచిగా ఉండి పొత్తికడుపులో అజీర్తి తగ్గించి - వాతము దురద - కఫము - వ్రణములు - నీరసము పోగొట్టి మేధస్సును పెంచును

**పెసలు:** ఇది నానబెట్టి తింటే వేడి శాంతిని కల్గచేస్తాయి. పెసరట్లు, పునుగులు



పచ్చళ్ళు ఇత్యాది రకాలు తయారుచేసి తినవచ్చును

**శ్రీఫల:** మారేడుచెట్టు - దీని కషాయము ఒంటికి చలువ జఠరదీప్తి కల్గిస్తుంది. కషాయము గుండెదడమీద వాడుతారు

**కొత్తిమీర:** కూరల్లో, పులుసుల్లో - పచ్చడిగాను - నిల్వ ఊరగాయగాను పెట్టవచ్చు. పైత్యం తగ్గిస్తుంది. ఆకలి పుట్టించే గుణం - వాతాన్ని తగ్గించి - మేహశాంతి కల్గిస్తుంది.

**కరివేపాకు:** పచ్చడి జీర్ణశక్తిని పెంపొందించి విషవాయువును పోగొడుతుంది. ఆకులు నమిలి తింటే రక్తవిరోచనాలు కడుతాయి. దీని చెక్క గంధము కురుపులు మచ్చలు తగ్గిస్తుంది

**తులసి:** ఆకురసం - జలుబును తగ్గించి కంఠరోగాలను క్రిమిసంహారిగాను ఆకలి కలుగచేయడానికి ఉపకరిస్తుంది. ఇంటిలో ఉండటం మంచిది. ప్రతిరోజు 4, 5 దళాలు నమిలితే త్రిదోషాలు హరిస్తాయి.

**కర్పూరము:** పంటి నొప్పులకు - ఉబ్బసానికి నూనెతో కలిపి వాడుతారు. మేహ, వాత నొప్పులకు, కొబ్బరినూనెలో కలిపి వాడుతారు. దేవుని పూజా సమయంలో ప్రత్యేకత కల్గి ఉన్నది

-కె. వాణీప్రభాకరి



సీరియల్



# నేత్రధనుస్సు

## సాతవాహన

ఇంతవరకూ సాగినకథ-11: డేగర్ మాజీ సి.బి.ఐ ఆఫీసర్ యశ్వంత్ కుమార్ కూతురు మనోజను కాల్చిచంపి ఆమెన్ని కిడ్నాప్ చేస్తుంది. ఈ సంఘటనపై ఇన్‌స్పెక్టర్ కార్తికేయ దర్యాప్తు ప్రారంభిస్తాడు. గతంలోని సి.బి.ఐ. ఆఫీసర్ల ఆచూకీపై దర్యాప్తు చేస్తున్న ఫైలును అందజేయుమని ముఠా నాయకుడు చిదానందం యశ్వంత్‌ను బలవంత పెడతాడు. బాధల్లో వున్న నయనతారకు ధైర్యం చెప్పేందుకు పూర్ణామేడమ్ రాగా అనాథశరణాలయం వారికోల్పోవడం చిదానందం కొడుకు ముద్దుకు బుద్ధిచెప్పిన విషయం జ్ఞప్తికి వస్తుంది. ముద్దు నయనతారపై పగబడతాడు.

(గత సంచిక తరువాయి)

**అది నిర్మానుష్యంగా వున్న పెద్ద ఆడిటోరియం.**

**నయనతార నెమ్మదిగా ఆ ఆడిటోరియంలో అడుగు పెట్టింది. ఆమె చేతుల్లో చిలక తనకిచ్చిన ఇన్విటేషన్ కార్డుంది**

ఆడిటోరియంలో ఎంతమాత్రం ఎండడి లేకపోవడం, తనని లోనికి ఆహ్వానించడానికెవ్వరూ రాకపోవడం నయనతారకు చిత్రంగా తోచింది.

ఆమె ఆ ఆడిటోరియంలోకి అడుగు పెడుతూనే ఆమె వెనక తలుపులు నిశ్శబ్దంగా మూసుకు పోయాయి. ఎంత నిశ్శబ్దంగా మూసుకు పోయినా చివర్లో క్లిక్‌మన్న శబ్దం వినిపించింది. నయనతార వులిక్కిపడి వెనక్కి తిరిగింది

మళ్ళీ ఎలాంటి శబ్దమూ వినిపించలేదు.

నిశ్శబ్దం!

అంతా 'నిశ్శబ్దం'

"హలో!" గట్టిగా పిలిచింది.

ఆమె పిలుపు ఆ ఆడిటోరియంలో బిగ్గరగా ప్రతిధ్వనించింది. నయనతార అప్రయత్నంగా ఒకడుగు వెనక్కి వేసింది.

"హలో ఎవరూ లేరా" మరోసారి బిగ్గరగా పిలిచింది

మరోసారి ఆమె కంఠం ఆ ఆడిటోరియంలో పలుమార్లు ప్రతిధ్వనించింది ఆ ప్రతిధ్వని ఆమె చెవులకు భయంకరంగా వినిపించింది

తానేదో ట్రాప్‌లోకి అడుగు పెట్టినట్టు నయనతారకు స్పష్టంగా తెలిసి పోయింది. ఆ మరుక్షణం ఆమె మొహం పాలిపోయింది. ఆడిటోరియంలో ఎవరూ లేరని అర్థమై పోవడంతో గిరుక్కున వెనుతిరిగి తలుపు దగ్గరికి పరిగెత్తింది

తలుపు మూసుకుపోయి వుంది తనిందాక విన్న క్లిక్‌మన్న శబ్దమేమిటో ఆమెకు ఆ క్షణంలో అవగతమైంది.

తలుపు దబదబా బాదుతూ తెంచ డానికి ప్రయత్నించింది

అయితే ఆటోమేటిక్ లాక్ సిస్టం కావడంతో ఆ తలుపు తెరచుకోలేదు

నయనతార నుదుట చెమటలు పట్టనారంభించాయి.

కంగారుగా మరోసారి తలుపులు దబదబా బాదింది.

అకస్మాత్తుగా వెనకనుంచి సన్నని చిరునవ్వు వినిపించింది

అంతే!

నయనతార గిరుక్కున వెనక్కి తిరిగింది.

నెమ్మదిగా తన వైపు అడుగుల చప్పుడు వినిపించనారంభించింది

ఆ అడుగుల చప్పుడు వింటూనే ఆ వ్యక్తి ఎవరో ఆమెకర్థమైపోయింది.

"నువ్వా!" అప్రయత్నంగా అంది

ముద్దు పకపకా నవ్వాడు

"నయనతారా! నా గుండెను మీటే సితారా! నా గుప్పిట్లో చిక్కిపోయావ్ ఇక నిన్ను నేనెలా మీటుతానో చూడు." అన్నాడు

నయనతార గొంతు తడారి పోయినట్టయింది

"నీకు... నీకేం కావాలి?" రొప్పుతూ అడిగింది.

"నువ్వు." చాలా సింపుల్‌గా సమాధానం చెప్పాడు ముద్దు.

నయనతార రివ్వున వెనక్కి తిరిగి మరోసారి తలుపు తెరవడానికి ప్రయత్నించింది.

"ఆ తలుపు తెరచుకోదు." వెకిలిగా నవ్వుతూ చెప్పాడు ముద్దు. "అదే కాదు, ఈ ఆడిటోరియంలో ఏ తలుపు కూడా

తెరచుకోదు. ఈ ఆడిటోరియంని కేవలం నీ ఒక్కదాని కోసమే బుక్ చేశాను. తప్పు తప్పు- నీ కోసం కాదు, మనకోసం బుక్ చేశాను".

"నోర్ముయ్". గిరుక్కున అతనికేసి తిరుగుతూ సివంగిలా గర్జించింది నయనతార.

ముద్దు వెంటనే మరోసారి బిగ్గరగా నవ్వాడు.

ఆమె గర్జనతోపాటు అతని వికటాట్ట హాసం కూడా ఆ ఆడిటోరియంలో వికృతంగా ప్రతిధ్వనించింది

"అలా బెదిరిపోకే లేడిపిల్లా! గుడ్డివైనా నీ కళ్ళు బయంతో అలా రెపరెపలాడి పోతుంటే నా గుండె బాధతో టపటపలాడి పోతుందే నా కోడిపిల్లా! నీకేమి భయంలేదు. నేను నిన్నేదో చెయ్యాలనిక్కడికి రప్పించలేదు జస్ట్. నీతో మాట్లాడి ఒప్పిద్దామనే ఇక్కడికి రప్పించాను నువ్వు నా మాట వింటే నిన్నేమీ చెయ్యను ప్రామిస్," అన్నాడతను

"నీకేం కావాలి?" మరోసారి ప్రశ్నించింది నయనతార.

"చెప్పానుగా నువ్వని మొన్న స్త్రీల శరణాలయంలో మా అప్పచేత చెప్పుతో కొట్టించినప్పుడే నా బుర్ర తుప్పు వదిలించేశావ్. ఆ సంత గోల వసంత వెంటబడి నేనెంత తప్పు చేశానో అప్పుడు



## “డెంటల్ హెల్త్ క్విజ్” (13)

1. పశువుల్లో ఎక్కువగాను, మనుష్యుల్లో తక్కువగాను వచ్చే వ్యాధి
[ఎ] టిబి [బి] కుష్ఠు [సి] ఆక్టినోమైకోసిస్
2 ‘ఆక్టినోమైకోసిస్’ వ్యాధికి గురియైన దవుడలను యిలా పిలుస్తారు
[ఎ] కొయ్యదవుడలు [బి] జబ్బు దవుడలు [సి] ఫంగసు దవుడలు
3. 1844వ సంవత్సరంలో మొట్టమొదటిసారిగా మత్తుమందు (యినస్థ వేషన్) వుపయోగించి పన్నుతీసిన, ఇంగ్లండులోని హార్ట్‌ఫోర్డ్‌కు చెందిన దంతవైద్యుడు.
[ఎ] చార్జ్ లివింగ్‌టన్ [బి] డా స్మిత్ [సి] డా హోరేస్‌వెల్స్
4 ఒకే పల్ప్‌కుహరాన్ని కలిగివుండే “కవలపల్లు”ను యిలా పిలుస్తారు
[ఎ] ట్విన్‌టీత్ [బి] జెమినేషన్ [సి] డబుల్ టీత్
5. నాలుకను ముందుకుచాపడానికి ఉపయోగపడే కండరం
[ఎ] జినియోగ్లాసస్ [బి] టంగ్ మజిల్ [సి] మజిల్ ఆఫ్ మాస్టికేషన్
6 నాలుక ఉపరితలంమీద దేశపటం మాదిరిగా, నున్నగా, ఎర్రగా వుండే మచ్చలు గల నాలుకను యిలా పిలుస్తారు.
[ఎ] రెడ్ టంగ్ [బి] మేప్ టంగ్ [సి] జాగ్రాఫిక్ టంగ్
7 ఈ విటమిన్‌లోపిస్తే, పళ్లు రాకపోవచ్చు.
[ఎ] విటమిన్-డి [బి] విటమిన్-ఎ [సి] విటమిన్-కె
8 ఒకరోజులో స్రవించే లాలాజలం
[ఎ] 2.0-2 5 లీటర్లు [బి] 1 0-1 5 లీటర్లు [సి] 3 0 లీటర్లు
9. పెరోటిడ్ లాలాజల గ్రంధి నోటిలోనికి తెరుచుకొనివుండే ప్రదేశం
[ఎ] పై-కొరుకుడు పన్నువద్ద [బి] పై-రెండవ విసురుడు దంతంవద్ద
[సి] పై-చీల్చేపన్ను వద్ద
10. క్రిందిదవుడలో, ‘మెంటల్ ఫోరామినా’ అనే రంధ్రం వుండే చోటు
[ఎ] విసురుడు దంతాలక్రింద [బి] చీల్చేపల్ల క్రింద
[సి] ప్రీ-మోలార్స్ క్రింద

- డా. కె.ఎల్.వి. ప్రసాద్

జవాబులు: 1 [సి] 4 [బి] 7 [ఎ] 10. [సి]
2 [ఎ] 5 [ఎ] 8. [బి]
3 [సి] 6 [సి] 9 [బి]

తెలిసింది. నిన్ను చూసినప్పట్నుంచీ నా గుండె టప్పు టప్పుమంటూ డప్పు వాయిస్తోంది. ఈ ప్రేమ బాధ ఎక్కువైతే టుప్పుమంటూ పగిలిపోతుంది. అందుకే నిన్నొకటి అడగాలనుకున్నాను”

“ఏమిటది?”

“పెళ్ళి! నన్ను పెళ్ళాడవే బుల్బీ!”

“షటప్ యూ స్కౌండ్రల్”.

“నన్ను షటప్ప చేయడం అంత సులభం కాదు బుల్బీ. మర్యాదగా పెళ్ళికొప్పేసుకో. మరో గంటలో ఇక్కడికే పురోహితుడ్ని రప్పించి నిశ్శబ్దంగా వున్న ఈ ఆడిటోరియంలోనే బాజాబజంత్రీల్తో పెళ్ళిపందిరిగా మార్చేస్తాను కాదూ కూడదంటావా, నిన్నెలా ఒప్పించవచ్చో నాకూ తెలుసు”

నయనతార గొంతు పూర్తిగా తడారిపోయింది అతని బెదిరింపేమిటో ఆమెకు కొద్ది కొద్దిగా అర్థమవుతోంది. ఆమె భయాన్ని నిజం చేస్తూ అతనే అన్నాడు-

“మరేంలేదు చాలా సింపుల్ చాలా రోజుల్నుంచి డ్రామా ఆడక ఈ ఆడిటోరియం బోసిపోయింది నువ్వు పెళ్ళికి ఒప్పుకోకపోతే ఆ లోపం నేను తీర్చేస్తాను. ఈ ఆడిటోరియంలో నేనాడబోతున్న ఆ డ్రామా పేరేంటో తెలుసా?- ద్రౌపదీ వస్త్రాపహరణం నిన్నిక్కడ కాపాడగలిగే శ్రీకృష్ణ పరమాత్ముడెవరూ లేదు కాబట్టి ఆ డ్రామాకు సరికొత్త ముగింపు కూడా వుంటుంది ఆ ముగింపేమిటో తెలుసా? మానభంగం”, గట్టిగా నవ్వాడు ముద్దు.

నయనతార గుండె శరవేగంగా కొట్టుకుంటోంది.

ముద్దు ఇంకా చెప్పుకు పోయాడు-

“అప్పుడు నీ పరిస్థితి కుక్కలు చింపిన- కాదు కాదు, కుక్కలు కాదు- కుక్క చింపిన విస్తరవుతుంది నిన్ను కాట్న కుక్కలా నేను కొరుక్కు తింటాను ఆ తర్వాత విధిలేక నువ్వు నన్నే పెళ్ళి చేసుకోవలసి వుంటుంది ఎలా వుంది ఈ ముద్దు ఐడియా? ముద్దు ముద్దుగా వుంది కదూ?”

నయనతార రివ్వున అక్కడ్నించి ముందుకు పరిగెత్తబోయింది అయితే ఆడిటోరియంలో వున్న కుర్చీ కాళ్ళకు అడ్డుపడి కెవ్వునరుస్తూ కింద పడిపోయింది

ముద్దు గట్టిగా నవ్వుతూ పిశాచంలా ఆమెను సమీపించాడు

“చెప్పు మైడియర్ నయనతారా! నీ అంతట నువ్వు మర్యాదగా నన్ను పెళ్ళి చేసుకుంటావా, లేక చేసుకునేలా చెయ్యమంటావా? ఆ రెండిట్లో నీకేది కావాలో నువ్వే నిర్ణయించుకో”, అంటూ ఆమె మీదికొచ్చాడు.

అతని అడుగుల చప్పుడు తన పైపొస్తున్నట్టుగా వినిపించింది

నయనతార ఆ సమయంలో కూడా ధైర్యం కోల్పోలేదు. చేతికందిన కుర్చీ ఒకటి పైకెత్తి అతనిపైకి బలంగా విసిరేసింది అయితే ఆ కుర్చీ అతన్ని తాకలేదు. పెద్దగా శబ్దం చేస్తూ పడిపోయింది.

ముద్దు మరింత గట్టిగా నవ్వుతూ నయనతారను సమీపించేశాడు.

నయనతార మెడ మీద అతని వూపిరి వెచ్చగా తగిలింది.

# నేత్రధనుస్సు

ఆ మరుక్షణం ఆమె పడగెత్తిన కాలనాగులా లేచి అతని చెంప ఛెళ్ళుమనిపించబోయింది. అయితే అతని చెంపను తాకేలోపలే ఆమె అరచేయి అతని చేతిలో చిక్కుకుపోయింది.

"నాకు పెళ్ళి కావాలి బుజ్జీ, చేసుకుంటావా?" వెటకారంగా అడిగాడు.

సరిగ్గా అదే సమయంలో...

"నీకు పెళ్ళి కావాలంటే నేను చేస్తాను. నన్నడగరా దద్దమ్మా", అనే మాటలు వినిపించాయి.

ముద్దు అదిరిపడి గిరుక్కున వెనక్కి తిరిగి చూశాడు.

ఎదురుగా కనిపించిన యశ్వంత్‌ని చూస్తూనే అతని మొహంలో కత్తి వేటుకి నెత్తురు చుక్కలేదు

యశ్వంత్ గొంతు వినిపించడంతో నయనతార వదనం ప్రకాశవంతంగా వెలిగిపోయింది.

"యశ్వంత్!" అనరుస్తూ ఆ గొంతు వినిపించిన వైపు పరుగెత్తుకెళ్ళి అతని చేతుల్లో వాలిపోయింది.

ముద్దు చప్పున ఒకడుగు ముందుకేయబోయాడు.

"అక్కడే ఆగు", హెచ్చరించాడు యశ్వంత్.

ముద్దు చటుక్కు నాగిపోయాడు

యశ్వంత్ నయనతారను వెనక్కితోసి తాను ముందుకొచ్చాడు.

"ఎవర్నువ్వు?" విస్మయంగా అడిగాడు ముద్దు.

"నీ మొగుడ్ని- పెళ్ళి కావాలన్నావ్‌గా! అందుకే వచ్చాను", మరో అడుగు ముందుకేస్తూ అన్నాడు యశ్వంత్.

"ఇక్కడికెలా వచ్చావ్?"

"నీ జిత్తులమారి మొహాన్ని టాంక్‌బండ్ మీద .తచ్చాడుతుండగా నిన్ననే నేను చూశాను. అప్పుడే నాకనుమానం వచ్చింది. అందుకే నయనతార కంటే ముందే నీ పెళ్ళి జరిపించడానికి నేనొచ్చాను".

ముద్దు అకస్మాత్తుగా అతని మీదికి లంఘించాడు.

ఆ మరుక్షణం ఇద్దరూ ఒకరి గొంతొకరు పట్టుకుని ఒకేసారి కింద పడ్డారు.

ముద్దు తన శక్తినంతా చేతి వేళ్ళలో కేంద్రీకరించి యశ్వంత్ గొంతు నొక్కేయడానికి ప్రయత్నిస్తున్నాడు. అతని చేతుల్లో అంత బలం వుండడం యశ్వంత్‌కు ఆశ్చర్యం కలిగించింది. తను అంతకంటే బలంగా అతని గొంతు నొక్కనారంభించాడు. ఒకర్నొకరు చక్రబంధంలో ఇరికించుకుని చాలాసేపు వాళ్ళు అలా నేలమీద పడుండిపోయారు

ముద్దుకు కళ్ళూ నాలుకా వెళ్ళుకొస్తున్నాయ్.

యశ్వంత్ చేతుల్లో వున్న బలానికతను తట్టుకోలేక పోతున్నాడు. అతని చేతుల్లో శక్తి కూడా క్రమంగా హరించుకుపోతోంది

ఈలోగా నయనతార చేతులు కట్టుకుని నిలబడిపోలేదు తన చేతులకేమైనా ఆయుధం దొరుకుతుందేమోనని ఆ హాలంతా వెదకనారంభించింది. అయితే ఆమె చేతులకు కుర్చీలు తప్పిస్తే ఆ ఆడిటోరియంలో ఏమీ తగల్లేదు.

అయినా నయనతార నిరుత్సాహ పడలేదు. ఈ కుర్చీలు లాభంలేదు ఆ మదాంధుడ్ని ఎదిరించడానికి అంతకన్నా బలమైన ఆయుధం కావాలి.

నయనతార అలా తడుముకుంటూనే ముందుకెళ్ళి పోయింది. ఆమె చేతులకు డయాస్ తగిలింది. ఆమె నెమ్మదిగా మెట్లెక్కి డయాస్ మీదికి చేరుకుంది.

డయాస్ కవతల రెండు తలుపులున్నాయి. ఒక దారి గ్రీన్ రూంలోకి వెళ్తుంది. ఇంకోదారి స్టోర్ రూంలో కెళ్తుంది.

నయనతార చేతికి స్టోర్ రూం తలుపు తగిలింది.

ఆమె తోస్తూనే ఆ తలుపు నిశ్శబ్దంగా తెరుచుకుంది. నయనతార ఆ గదిలోకి అడుగు పెట్టింది.

ఆ గది నిండా నాటకాలకు పనికొచ్చే రకరకాల సామాను లున్నాయి. స్టేజీ బ్యాగ్రౌండుకు పనికొచ్చే రకరకాల సీనరీలూ, వాటిని కట్టడానికి తాళ్ళూ, కొన్ని మైక్ సెట్లూ వున్నాయి. మరో వైపు పౌరాణిక నాటకాలకు పనికొచ్చే కాస్ట్యూమ్స్ నీట్‌గా పేర్చి వున్నాయి. రకరకాల కిరీటాలూ, గదలూ, ఖడ్గాలూ, విల్లంబులూ కూడా వున్నాయి

నయనతార చేతికి విల్లంబులు తగలడంతో ఆమె అకస్మాత్తుగా ఆగిపోయింది. తన చేతికి తగిలిన వస్తువు లేమిటో అర్థం చేసుకుంటూనే ఆమె మొహం దేదీప్యమానంగా ప్రకాశించింది.

తక్షణం ఆ విల్లంబులు చేతిలోకి



# నేత్రధనుస్సు

తీసుకుంది

బయట ఆడిటోరియంలో ముద్దూ యశ్వంత్ ఇంకా పెనుగులాడుతున్నారు.

ముద్దుకి ఆ సమయానికే మిడిగుడ్లు పడిపోయాయి. మరికొద్ది క్షణాలు ఎదిరి చేతుల్లో తన పీక అలాగే చిక్కుకుపోతే తన పెళ్ళి బాజాలు నరకంలో మోగడం తప్పనిసరని అతని కర్థమై పోయింది. ఆ స్థితిలో కూడా అతని బుర్ర శరవేగంగా పని చేస్తోంది

తప్పించుకోవాలి.

ఎలాగైనా సరే ఇతని కబంధ హస్తాల్లోంచి తప్పించుకుని ప్రాణాలు కాపాడుకోవాలి. ఇక ఎంతో ఎంతో సేపు తను అతని పీక నొక్కలేడు.

ఆ ఆలోచన వస్తూనే ముద్దు చప్పున యశ్వంత్ గొంతు విడిచి పెట్టేశాడు. అతని చేతులు ఏదైనా ఆయుధం కోసం నేలమీద పారాడాయి. తన చేతులకేదీ అందలేదు. అతి కష్టం మీద చెయ్యి తన ప్యాంటు జేబులోకి పోనిచ్చాడు

వెంటనే చేతికి తగిలిందా వస్తువు

లైటర్.

సిగరెట్ లైటర్.

అది చేతికి తగుల్తూనే అతనికి పోతున్న ప్రాణాలు తిరిగొచ్చినట్టనిపించింది. అతి ప్రయత్నం మీద దాన్ని బయటికి లాగి ఛక్‌మంటూ వెలిగించాడు. వెంటనే లైటర్ పైకెత్తి యశ్వంత్ మొహం మీదికి తెచ్చాడు.

ఆ మరుక్షణం యశ్వంత్ మెడ మొహం కాలిపోనారంభించాయి.

మొదట ఆ జ్వాల తన మెడ పక్కన కాల్చేస్తున్నా యశ్వంత్ లెక్క చెయ్యలేదు. పళ్ళు బిగువున ముద్దునలా బంధించే వుంచాడు. అతని పీక ఇంకా తన చేతుల్లోనే వుంది.

అయితే ముద్దు అంతటితో వదిలిపెట్టలేదు.

లైటర్ నేరుగా అతని మొహం మీదికే తెచ్చాడు.

ఆ పోరాటంలో యశ్వంత్ నుదుటి మీద, పడుతున్న ముంగురులు కొన్ని ఆ జ్వాలలో పడి మలమలా మాడిపోయాయి. ఆ తర్వాత అతని చెంపలు రెండూ కాలిపోయాయి.

ముద్దు లైటర్ని అతని కళ్ళ వైపు జరపడానికి ప్రయత్నించాడు.

యశ్వంత్ సకాలంలో ముద్దు పీక వదిలిపెట్టి అతని చెయ్యి పట్టుకోలేక పోయివుంటే తన కళ్ళని పోగొట్టుకుని వుండేవాడు.

అతని చెయ్యి తన చేతిని వొడిసి పట్టుకున్నప్పటికీ గొంతు మీద వత్తిడి సడలి పోవడంతో ముద్దు వూపిరి పీల్చుకునేందుకు వ్యవధి చిక్కింది. ఆ మరుక్షణం ఒక్కసారి గుండెనిండా గాలి పీల్చుకున్నాడు. వూపిరితిత్తుల్లోకి ఆక్సిజన్ జొరబడ్డంతో అతని శక్తి మళ్ళీ తిరిగొచ్చింది. ఆ వెంటనే మొండి బలంతో యశ్వంత్‌ని తన మీద నుంచి పక్కకు పొర్లించ గలిగాడు. లైటర్ నేల మీద పడిపోయింది

వాళ్ళిద్దరూ ఒకేసారి స్ప్రింగ్స్‌లా లేచి నిలబడ్డారు. ఒకరి కళ్ళలో కొకరు ప్రమాదకరంగా చూసుకున్నారు.

### శస్త్ర చికిత్స

విషాహారాన్ని జీర్ణించుకున్న
నా రక్తంలోని
సామరస్యం ప్లాస్మా
ఎండిపోతోంది!

చీలిపోయిన
తెల్లకణాలూ-ఎర్రకణాలూ
సహజీవన ద్వారాలకు
చిచ్చుపెడుతున్నాయి!

అనునయాల టానిక్కుతో
సహనం చేసే వమనాలు తగ్గవు
బెదరింపుల సూదిమందుకు
గుండె మంటలు చల్లారవు
మదగజాలు లొంగవు!

అందుకే.....
ఇప్పుడు అవసరం
శస్త్ర వైద్యం-కొత్త రక్తం!

- వేమూరి వెంకటేశ్వరశర్మ

యశ్వంత్ ఛార్జ్ చేస్తూ ముద్దు మీదకి రాబోయాడు.

అయితే ముద్దు తక్షణం పక్కకి జరిగిపోయి అతని కాలికి తన కాలు అడ్డు పెట్టాడు. యశ్వంత్ దబ్బున ముందుకు పడ్డాడు. కళ్ళముందు నక్షత్రాలు మెరిశాయి. మొహం అదిరింది. పెదవులు చిట్లాయి.

ఒకసారి తల విదిలించి లేచి నిలబడబోయాడు.

ఈలోగా ముద్దు తన చేతికందిన కుర్చీ పైకెత్తి అతని తల మీద బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు యశ్వంత్ గట్టిగా మూలిగాడు.

ముద్దు మరోసారి కుర్చీతో అతని తలమీద కొట్టాడు.

ఆ వెంటనే యశ్వంత్ నేలకు కరిచిపెట్టుకు నుండిపోయాడు. అతని మొహమంతా బొబ్బలెక్కి పోయింది. ముక్కులోంచి, నోట్లోంచి రక్తం కారిపోతోంది.

తల మీద తగిలిన దెబ్బకు అతనికి స్పృహ పోయింది.

ముద్దు ఒకసారి అతన్ని క్రూరంగా చూశాడు. ఆ తర్వాత నెమ్మదిగా కిందికి వంగి నేలమీద పడున్న లైటర్ని చేతిలోకి తీసుకుని మళ్ళీ వెలిగించాడు. యశ్వంత్ పక్కనే మోకాళ్ళ మీద కూలబడి పళ్ళు పటపటా కొరుకుతూ అతని జుట్టు పట్టుకుని తల పైకెత్తాడు. రక్తసిక్తమై వున్న యశ్వంత్ మొహం కసి కసిగా చూస్తూ లైటర్ మళ్ళీ అతని మొహం మీద పెట్టాడు.

సరిగ్గా అదే సమయంలో ఓ బాణం రివ్వున అతని తల మీదనుంచి అవతలికి దూసుకెళ్ళి పోయింది. ఆ మరుక్షణం మరో బాణం... అంతలోనే మరో బాణం...!

ముద్దు అదిరిపడి తల పైకెత్తి చూశాడు.

ఎదురుగా నయనతార.

ఒక చేతిలో విల్లుతో మరో చేతిలో బాణంతో అపర సత్యభామలా నిలబడి వుంది.




**పిల్లికళ్ళు**

కూతురు - అమ్మా! అక్కయ్యవి పిల్లి కళ్ళల్లే వుందే. చీకట్లోకూడా బలేగా చూడగలదు.

అమ్మ - ఏం? ఎందుకని?

కూతురు - నిన్న రాత్రి నేను అక్కయ్యా, బావా దొడ్లోకూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాం. కటిక చీకటిగా వుంది అంతా. అక్కయ్యకి ఎల్లా కనిపించిందో మరి "ఏమండీ! ఇవ్వాళ మీరు గడ్డం గీచుకోలేదేం?" అని అడిగింది. విచిత్రంగా లేదూ!

ముద్దు కళ్ళు పెద్దవై పోయాయి.

"వద్దు, బాణం వెయ్యొద్దు," అంటూనే అతను మొహానికి రెండు చేతులూ అడ్డు పెట్టుకున్నాడు.

"నీచుడా!" నయనతార కంఠం ఆ అడిటోరియంలో ఖంగుమంది. "నీలాంటి నరకాసురు లెదురైనప్పుడు సంహరించడానికి అలనాటి సత్యభామలే కాదు, ఈ నాటి నయనతారలు కూడా వున్నారు. కాచుకో," అంటూనే మరో బాణం విడిచింది.

ఈ సారి కూడా ఆ బాణం ముద్దు తల మీద నుంచి అవతలికి దూసుకెళ్ళింది.

ముద్దు కంగారుగా లేచి నిలబడ్డాడు.

"వద్దు," అంటూ ముందుకు రాబోయాడు.

ఆ తొందరపాటులో అతని బూటు నేల మీద శబ్దం చేసింది.

ఈలోగా డయాస్ మీదుంచిన తూణీరంలోంచి మరో బాణం అందుకున్న నయనతార అతని బూటుశబ్దం వినిపించిన వైపు సూటిగా బాణం విడిచింది.

ముద్దు బాధతో కెవ్వునరిచాడు.

ఈ సారి ఆమె బాణం వృధా పోలేదు. సూటిగా వెళ్ళి అతని కాల్లో గుచ్చుకుంది. రక్తం ధారాపాతంగా కారిపోనారంభించింది.

నయనతార మరో బాణం విడిచింది. ఈసారది అతని రెండో కాల్లో దిగబడింది.

ముద్దు మరో సారి కెవ్వున కేకపెట్టాడు.

ఆ శబ్దాన్ని బట్టి నయనతార సూటిగా అతని మొహంకేసి బాణం గురిపెట్టింది.

"నో...!" కంగారుగా అరిచాడు ముద్దు.

ఇంతలో నేల మీద పడున్న యశ్వంత్ శరీరంలో చలనం వచ్చింది. ఒకసారి బాధగా తల విదిలించి అతను నెమ్మదిగా లేచి కూర్చున్నాడు.

వెంటనే ఎదురుగా చేతుల్లో విల్లంబులతో నిలబడివున్న నయనతారను చూస్తూనే ఒక్కసారిగా నిర్ఘాంత పోయాడు. ఆ మరుక్షణం ఆమె ఆవేశంలో ఏం చేయబోతోందో గ్రహించి కంగారుగా వెళ్ళి ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"వద్దు నీ చేతుల్లో చావడానిక్కూడా వాడు అనర్హుడు. ప్రమాదం తప్పింది అంతేచాలు. మనం వెళ్దాం పద," అన్నాడు.

నయనతార నెమ్మదిగా విల్లంబులు దించేయడంతో గానీ ముద్దు మళ్ళీ వూపిరి పీల్చుకోలేక పోయాడు.

యశ్వంత్ నయనతార చెయ్యి పట్టుకుని అక్కడ్నుంచి పోబోయే ముందు పిడికిలి బిగించి ముద్దు మొహం మీద బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు ముద్దు కళ్ళు తిరిగి నేలమీద పడిపోయాడు.

* * * * * *

చిదానందం ముద్దు మొహం మీద ఫెడీమని కొట్టాడు.

దెబ్బకు పైకప్పు ఎగిరిపోయేలా బిగ్గరగా కేకపెట్టాడు ముద్దు.

"అప్పా, వూరవతల దిబ్బా, నీయబ్బా! నిన్ను పాడెమీద దొబ్బా! ఆ గుడ్డిది బాణాల్తో నన్ను హడల గొట్టింది. దాని ప్రియుడు ముష్టిఘాతాల్తో నన్ను చావగొట్టాడు. ఇప్పుడేమో నువ్వు కూడా నన్నేకుతావా!" ఏడుపు గొంతుతో అరిచాడు.

"ఏకడం కాదురా నాయీ! నిన్నుదా పాతరేసి పాతిపూడ్చాలి. బలవంతముగా తెచ్చుమీ అని వుంటే నేనుదా దాన్ని తెచ్చి నీకు పెండిలిదా చేసివుంటు. నీకు రేపసీనుదా ఎవదు పూర్ఛుమనినాడు?" గద్దించాడు చిదానందం.

"ఆ గుడ్డిదాన్ని చేసుకోవడానికి నాకంత మంచి అయిడియా వస్తే నన్నిలా చావబాదడం,నీకేవన్నా బావుందా అప్పా?" వాపోయాడు ముద్దు.

"యామి? యామంటివి? నల్లా అయిడియానా? నీ పాడు మొహానికిదా నల్లా అయిడియానూ వచ్చి పూడ్చునా?"

"నన్నేం చెయ్యమంటావ్? చివరి క్షణంలో ఆ నక్షత్రకాయగారు అడ్డొచ్చి నా ప్లానంతా నాశనం చేశాడు."

కొడుకు ఏడుపు మొహం చూసి చిదానందానికి మొట్ట మొదటి సారిగా జాలేసింది.

"నీవుదా ఏడవాకుమీ! నేరం వచ్చిపూర్చునాక ఆ పెణ్ణునిదా దెబ్బ తీయు ఛాన్సు మనకు కూడా వచ్చును. అంతదాకా నీవు నిదానముగా వుండుమీ," అని అభయమిస్తున్న వాడిలా కొడుకును ఓదార్చాడు.

"అప్పా, నా బంగారు కుప్పా! నీకు నామీదెంత ప్రేమ?" అంటూ తండ్రి నడుం పట్టుకుని భోరుమన్నాడు ముద్దు.

* * * * * *

"నువ్వు గొప్ప వ్యక్తిత్వం వున్నదానివే అనుకున్నాను. వీర నారివి కూడా అని ఇప్పుడే తెలుసుకున్నాను." నయనతార చెయ్యి తన చేతిలోకి తీసుకుంటూ ప్రేమగా అన్నాడు యశ్వంత్.

అతని మొహం మీదా మెడమీదా బ్యాండేజిస్ వున్నాయి.

"మగవాడి దౌర్జన్యమంతా అతడి తనకు లొంగినంత వరకే. తనకు ఎదురు నిలిచి పోరాడే ఆడదాన్ని ఏ మగాడూ గెలవలేడు." చెప్పింది నయనతార.

"అవునూ, నీకు అర్చెరీ వచ్చున్న సంగతి నాకింతవరకూ తెలీదే!" కొంచెం

ఆశ్చర్యంగా అన్నాడు యశ్వంత్.

నయనతార నవ్వేసింది.

"నాకలాంటి విద్యలేం రావు. చేతికేదో ఆయుధం దొరికింది. శబ్దాన్ని బట్టి ప్రయోగించానంతే," అంది.

"లేదు నయనా! నువ్వు మామూలు ఆడపిల్లవి కావు. నీలో అద్భుతమైన ధైర్య సాహసాలూ, మేథాశక్తి దాగివున్నాయి. బహుశా నీ స్థానంలో మరో ఆడపిల్ల వుంటే అంత సాహసం చేసి వుండేది కాదేమో! నువ్వు నిజంగా మార్షల్ ఆర్ట్స్ నేర్చుకుంటే నేను చాలా సంతోషిస్తాను."

"మార్షల్ ఆర్ట్సా! అవి నాకెందుకు?"

"నువ్వు చెప్పింది నువ్వే మర్చిపోతున్నావు. ఆడపిల్ల మగాడికి లొంగి పడుండే రోజులు పోయాయి. మార్షల్ ఆర్ట్స్ ఒక విధంగా మగాడికంటే ఆడపిల్లకే ఎక్కువ పనికొస్తాయని నిన్న జరిగిన సంఘటన ద్వారానే తెలుసుకున్నాను," అన్నాడతను.

పోనిద్దురూ! ముందు మీరి గాయాలనుంచి కోలుకోండి, ఆ తర్వాత మార్షల్ ఆర్ట్స్ సంగతి ఆలోచిద్దాం," తేలిగ్గా అనేస్తూ లేచినిలబడిందామె.

"మీరు రెస్టు తీసుకోండి. నేను మళ్ళీ వస్తాను." అంటూ అక్కడ్నించి పోబోయింది.

యశ్వంత్ చప్పున ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"హేయ్, ఏమిటిది?" ఆమె మృదువుగా చెయ్యి విడిపించుకోబోయింది. అయితే యశ్వంత్ ఆమె చెయ్యి విడిచిపెట్టలేదు.

"నా కోరిక ఒకటి తీర్చకుండానే వెళ్తానంటున్నావ్," అన్నాడతను.

"కోరికా? అదేమిటి?"

అతను మౌనంగా జేబులోంచి ఆటోగ్రాఫ్ పుస్తకం తీశాడు.

"ఆటోగ్రాఫ్ ప్లీజ్!" కొంటెగా అడిగాడు.

నయనతార సీరియస్‌గా ఏదో అనబోయి ఫక్కున నవ్వేసింది.

యశ్వంత్ కూడా ఆమె నవ్వులో జతకలిపాడు.

"ఒక్క షరతుమీదై ఆటోగ్రాఫ్ ఇస్తాను," అందామె.

"ఏమిటా షరతు?" వుత్సాహంగా అడిగాడతను.

"నా ఆటోగ్రాఫ్ పక్కన మీ ఆటోగ్రాఫ్ కూడా వుంటుందంటేనే నేను ఆటోగ్రాఫిస్తాను."

"నా ఆటోగ్రాఫా! అదెందుకు?" కొంచెం విస్మయంగా అడిగాడు.

నయనతార మొహం సిగ్గుతో ఎర్రబడింది

"ఇక నుంచీ మన జీవితాలు వేరుకావు. మనం ఏం చేసినా కలిసే చేస్తాం," అంది

ఆమె చెబుతున్న దేమిటో అర్థమవుతూనే యశ్వంత్ మొహం ఆనందంతో వెలిగిపోయింది.

"నయనా!" అంటూ ఆమెను తనదగ్గరికి లాక్కున్నాడు. "నేను.. నేను చాలా అదృష్టవంతుణ్ని," అంటూ ఆమెను ముద్దు పెట్టుకోబోయాడు

నయనతార చప్పున అతని పెదవులకు తన అరచేయి అడ్డుపెట్టింది.

"బాబోయ్ డేంజర్! మీకు ఆటోగ్రాఫ్ కావాలా వద్దా?"

"కావాలి," పసిపిల్లాడిలా అన్నాడతను.

"అయితే దూరం జరగండి," ఆదేశిస్తున్నట్టుగా అంది.

అతను బుద్ధిగా దూరం జరిగాడు.

నయనతార ఆటోగ్రాఫ్ పుస్తకం అందుకుని అందులో సంతకం పెట్టింది. యశ్వంత్ ఆ పక్కనే తనూ సంతకం చేశాడు.

ఆ క్షణంలోనే తమ జీవితాలు ఒకటై పోయాయి.

★ ★ ★ ★ ★ ★

గతం గురించి ఆలోచిస్తున్న నయనతారకు కన్నీళ్ళు జలజలా జారిపోతున్నాయి.

ఆరోజే అతను తనని తండ్రికి పరిచయం చేశాడు.

వెంటనే ముహూర్తం నిర్ణయించడం, తామిద్దరి పెళ్ళి జరిగిపోవడం అంతా కలలోలా జరిగింది.

తమ మొదటిరాత్రి యశ్వంత్ తనతో అన్న మాటలు ఆమెకి స్పష్టంగా గుర్తున్నాయి.

"పెళ్ళికి ముందు నువ్వు ఆ ముద్దుగాడి చేతుల్లోంచి ఓ సారి నన్ను కాపాడావు. పెళ్ళయ్యాక నన్నెప్పుడు కాపాడతావ్?" కొంటెగా అడిగాడు.

## అమెరికాలో భారతీయ ప్రతిభ

భారతీయ సంతతికి చెందిన అమెరికన్ న్యూక్లియర్ ఫిజిసిస్ట్, రోదసీ వ్యవస్థల ఇంజనీర్, నిర్వహణ విషయాల నిపుణుడు అయిన డాక్టర్ శివ సుబ్రమణ్యా అమెరికన్ సైన్యానికి కమ్యూనికేషన్ల రంగంలో అందజేసిన విశిష్ట సేవలకు గాను అమెరికన్ సాయుధ బలగాల తరఫున అందజేసే అత్యంత ప్రతిష్టాత్మక మైన అవార్డు "మెడల్ ఆఫ్ మెరిట్ ను అందుకున్నారు వాషింగ్టన్ నగరంలో యిటీవల జరిగిన ఒక కార్యక్రమంలో ఆయనకు ఈ అవార్డు అందజేయ బడింది

అమెరికాలో ఈ అవార్డును అందుకున్న మొదటి దక్షిణ ఆసియా సంతతి వ్యక్తి, డాక్టర్ శివ సుబ్రమణ్యా కావడం గమనార్హమైన విశేషం సైనిక బలగాల కమ్యూనికేషన్లు ఎలక్ట్రానిక్స్ అసోసియేషన్ అధ్యక్షునిగా వున్న రిటైర్డ్ జనరల్ జాన్ ఎక్ హాన్ డాక్టర్ శివ సుబ్రమణ్యాకు ఈ అవార్డును బహూకరించారు

డాక్టర్ సుబ్రమణ్యా అమెరికాలోని అగ్రశ్రేణి కమాండ్, కంట్రోల్, కమ్యూనికేషన్స్ నిపుణులలో ఒకరుగా పేరు పొందారు అమెరికా రక్షణ విభాగానికి ఎలెక్ట్రానిక్స్‌కి సంబంధించిన అనేక ముఖ్య కార్యక్రమాలలో ఆయన సహకరించారు పెక్కు ఎయిరోస్పేస్, రక్షణ కార్యక్రమాలకు ఆయన అధ్యక్షుడు లేదా ఉపాధ్యక్షుడుగా వున్నారు

కర్ణాటకలోని చిక్‌మగలూర్‌లో జన్మించిన సుబ్రమణ్యా 1956లో మైసూర్ యూనివర్శిటీ నుంచి అండర్ గ్రాడ్యుయేట్ డిగ్రీని పొందారు 1962లో ఆయన కర్ణాటక విశ్వవిద్యాలయం నుంచి ఫిజిక్స్, ఎలెక్ట్రానిక్స్‌లో ఎం ఎస్ సి డిగ్రీని అందుకున్నారు రెండేళ్ల తర్వాత ఆయన క్లార్క్ యూనివర్శిటీలో న్యూక్లియర్ ఫిజిక్స్‌లో పిహెచ్ డి చేయడానికి అమెరికా వెళ్లారు డొమింగ్యుయోజ్‌లోని కాలిఫోర్నియా స్టేట్ యూనివర్శిటీ నుంచి ఆయన ఎం బి ఎ డిగ్రీ కూడా పొందారు. అప్లయిడ్ సైన్సెస్, మేనేజ్‌మెంట్ రంగాలలో సుబ్రమణ్యాకు 12కి పైగా డిగ్రీలు, లేదా డిప్లొమాలు వున్నాయి

"పెళ్ళయ్యాక కాపాడ్డమేమిటి?" అర్థం కానట్టుగా అడిగింది నయనతార.

"విరహాగ్నిలో కాలిపోతున్నాను. నన్ను నీ దగ్గరికి తీసుకుని కాపాడవా?" అన్నాడతను.

ఆ మాట గుర్తు కొస్తూనే ఆ దుఃఖంలో కూడా ఆమెకు నవ్వొచ్చింది.

తమ పెళ్ళయ్యాక పూర్ణా మేడమ్ తమని ఓ చిత్రమైన చోటికి తీసుకెళ్ళింది.

కొండమీద చిన్న గుడి అది. ఆ గుడిలో శివపార్వతులున్నారు. గుడి ఎదురుగా ఓ పెద్ద మర్రి చెట్టుంది పసుపు కుంకుమలో ఆ మర్రిచెట్టంతా ఎర్రగా వుంది. దాని కొమ్మలకు కొన్ని వేల మంగళ సూత్రాలు వేలాడుతున్నాయి.

"ఇది గౌరీదేవి చెట్టు.' చెప్పింది పూర్ణా మేడమ్ "ఈ చెట్టుకు పసుపు కుంకుమలు సమర్పించి దీనికొమ్మకు ముత్తయిదువలు మంగళసూత్రం కడతారు. అలా చేస్తే గౌరీదేవి ఆ ముత్తయిదువ మంగళసూత్రాన్ని కాపాడుతుంది "

పూర్ణా మేడమ్ చెప్పినట్టుగానే తనూ ఆ చెట్టుకు పసుపుకుంకుమలు సమర్పించి దాని కొమ్మకు మంగళసూత్రం కట్టింది.

నయనతారకు ఆ సంఘటన గుర్తుకు రాగానే దిగ్గున లేచి నిలబడింది.

ఆ తర్వాత గాలివానకు కొట్టుకు పోతున్నదాన్లా ఇంట్లోంచి బయటికి నడిచింది.

* * * * * *

ఆ మర్రిచెట్టు కొమ్మలు విరజాపుకొని సమున్నతంగా గంభీరంగా నిలబడివుంది దాని కొమ్మలకు మంగళసూత్రాలు వేలాడుతున్నాయి.

నయనతార ఆ చెట్టు ముందు నిలబడివుంది.

ఆమె గొంతులోంచి ఒక్క మాట కూడా వెలువడలేదు.

అయినా ఆమె గుండెలోని ఆక్రోశాన్ని వింటున్నట్టుగా ఆ మర్రిచెట్టు పైకొమ్మలు గాలికి అటూ ఇటూ ఆడుతున్నాయి.

(ఇంకావుంది)

# ఈవారం లో మీ యోగం

25-1-1991 శుక్రవారం మొదలు 31-1-1991 గురువారం వరకు

**మేషం:** మీరు పత్రికాధిపతులా? చేసే యత్నాలు శుభకరం. అనుకూలదాయకం, లాభప్రదం, శత్రుపక్షమున్నగి గమనించి మెల గండి. ముందువెనుకలు ఆలోచించవలె. ధనలోపంలేదు. వ్యాపారానుకూల్యతగ లదు. స్త్రీలకు: కొందరకు అధికయోగం.

**వృషభం:** వారం సామాన్యం. వ్యాపా రమందు శ్రమింపక తీన్పదు. వృత్తి రీత్యా శ్రద్ధాసక్తులు. పూర్వీకుల ఆస్తిని గూర్చిన చర్చలు, గడబిడలు, అధికశ్రమా నంతరంగాని ఏదో మేలు చేకూరదని గ్రహి స్తారు. శుభకార్యాలు వెనుకకు జరిగిపో వుట వింటారు. ఇకవేంకావాలి? స్త్రీలకు: అభివృద్ధికరమైన మార్పు రానున్నది, అది వృత్తిరీత్యానే.

**మిథునం:** ధనలోపంరాదు. వ్యాపా రరీత్యా అనుకూలం. కార్యకలాపమందు, గృహనిర్మాణమందు, రాజకీయ వ్యవహారా లందు ఒడిదుడుకులు రాకుండా మాచు కోవాలి. సభామర్యాద, కొందరకు నూతన వ్యాపారవృద్ధి, సమీపంలో మేలు జరుగను న్నదని, రాజకీయంగా అభివృద్ధి గలదని గ్రహిస్తారు. స్త్రీలకు: కార్యసిద్ధి, వృత్తి పెంపు.

**కర్కాటకం:** సభా మర్యాదయున్నా పోటీవారితో యిబ్బందులు రాకపోవు. ఆదాయం వృద్ధినందినా అధిక వ్యయం కూడా గలదని గ్రహించాలి వాహనం కొనుగోలు చేయవచ్చును, అయితేనేం? అప్పుచేయరాదు. అదిరోత. మూర్ఖుల సాంగత్యం తగదుకూడ. స్త్రీలకు: వృత్తి యందు పెంపు, సభామర్యాద, కృషి లోపం రానీయకండి.

**సింహం:** పెద్దబరువు నెత్తికెక్కిందిగదా! అది ఎలాదించుకొంటారో చూడాలి. బహు రీతులశ్రమకరమని గ్రహించాలి. గురుడు అనుకూలుడుగాడు. ఎంత శ్రమిస్తే ఏమి ప్రయోజనం. ముందడుగు వేయటానికి యింకా కొంతకాలం పడుతుంది. గ్రహించి ఓర్మితో మెలగండి. స్త్రీలకు: లాభప్రద వారం అని అనుకోరాదు.

**కన్య:** అధికారవృద్ధి, శుభదాయక దినాలు. నూతన మిత్రసహాయమున్నది. ధన లోపంరాదు. వ్యాపారం అనుకూలించు సమయం. అధికారుల వలన మేలుచేకూ రుట నిశ్చయం. వ్యాపారమందు అభివృద్ధి కరమైన మార్పు రానున్నది. గ్రహించాలి. బహుయోగదాయకం, చిత్రరంగానుకూలత. స్త్రీలకు: కార్యసిద్ధి అధికారపెంపు.

**తుల:** సభామర్యాదయున్నది. రాజకీ యమందు మేలున్నది. కళాసాహితీరం గాన అనుకూలతయున్నది. ధనలోపంలేదు. మేలు కోరినవారు యింటికి రానున్నారు. సుఖశాంతులుంటాయి. అయితేనేం? ఆరో గ్యరీత్యా జాగ్రత్త, స్త్రీలకు: అధికలాభ యుతం.

**వృశ్చికం:** అధికారమందు వృద్ధి. కొంద రకు ప్రయాణం అవసరం, ఒకవేళ విదేశా లకు కొందరు వెళ్లగలరు. చిత్ర నిర్మాణ మందు ప్రతిభ రాణిస్తుంది. ఆదాయవృద్ధి. అపూర్వ వస్తు సేకరణకు అస్కారవారం. తృతీయ శని మీ వృత్తియందు వృద్ధిదా యకుడు. స్త్రీలకు: వృత్తియందు మేలు.

**ధనుస్సు:** సమయానికి ఆదుకొనువారు లేరు. ధనలోపంరాదు. 'శని' ధన విష యంగా అనుకూలుడే, కార్యరంగాన ఒడి దుడుకులు రాక తప్పవు. ప్రచారంగాన ప్రసిద్ధి ఏర్పడుతుంది. రాజకీయ వాదులకు ఏమంత మేలుగావు. అధికారమందు వృద్ధి, ఆదాయ వృద్ధి, సుఖశాంతులు. స్త్రీలకు: అభివృద్ధికరమైన మార్పు రావచ్చు.

**మకరం:** ధనలోపం లేదుగాని, అధిక వ్యయం చెప్ప దగిన వారం. ఒకవేళ డబ్బు పోగొట్టుకోవచ్చు. ఇంట దొంగతనం జరు గవచ్చు. కొన్ని పరిస్థితులందు యిబ్బంది జరుగవచ్చు. ఏమి చెప్పి ఏమిలాభం, జరు గదగినది జరుగక తీరదు. స్త్రీలకు: కార్య సిద్ధి, అభిమానులవలన మేలు.

**కుంభం:** ఏ విషయమైనా బహు చాక చక్యంతో చేయగల నేర్పు, కూర్పు గల వారు. అయితేనేం? 6వ రాశి 'గురుని స్థితి' ఏమంత మేలు. ఇంకా కొంతకాలం ఆగకతప్పదు. మరి ఈవారమో యిబ్బంది లేదు. సభా మర్యాద, రాజకీయమందు మేలుజరుగుట గమనించారుగా! ఇక ప్రజా సేవయే ధ్యేయం. స్త్రీలకు: రాజ్యభాగ్య స్థానాలందు యోగమున్నది.

**మీనం:** మిత్ర సమాగమం. ఆదాయవృద్ధి, ఐశ్వర్య వృద్ధి, రాజకీయంగా అనుకూలత. బంధు సమాగమం. విదేశయానం. ఒక్క టేమిటి సర్వవిధాలా మేలే. పదిమం దిలో ప్రతిష్ఠ శుభదాయకం, సుఖదాయకం. గ్రహించాలి. స్త్రీలకు: వస్తు వాహన సేక రణ, దూరప్రాంతాలకు వెళ్లెడి అవకాశం, ధనలబ్ధి, మరేంకావాలి?

విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి



# 1954లో విడుదలైన గుబ్బికర్ణాటకవారి

# కాళహస్తి మహాత్మ్యం

(రచన: తోలేటి, దర్శకత్వం: హెచ్. ఎల్. ఎన్. సింహ, విజయా రిలీజ్, నటీనటులు: లింగమూర్తి, ఋష్యేంద్రమణి, రాజసులోచన, మాలతి, కుమారి, రాజ్‌కుమార్, పద్మనాభం.)

ది12-11-1954లో విడుదలైన గుబ్బి కర్ణాటక వారి 'కాళహస్తి మహాత్మ్యం' చిత్రం– ఆస్తికుడనబడే ప్రతి వానికి ఎన్నిసార్లు చూసినా తనివి తీరదు. ఈశ్వరునిచే కిరాతకుడుగా మోక్ష మందుట కనుజ్ఞ వడసి, అర్జునుడు మరుజన్మలో బోయలకు దొరికి, బోయవాడుగా పెరిగి, వారిచే భార్యా సమేతముగా వెలివేయబడి, కాళహస్తి చేరి బోయ "తిన్నడై" కాళహస్తీశ్వరుని సేవించి, ఈశ్వరానుగ్రహమునకు పాత్రుడై మహాభక్తుడై వెలిశాడు. పురాణ కథగా పరిశీలించినా, చిత్రరూపంగా పరిశీలించినా ఆ మహాభక్తుని గాధ మరువ రానిది. మూల కథలో లేని కొత్త పాత్రలు చిత్రించి, చిత్ర కథా గమనానికి, చిత్ర విజయానికి తోడ్పాటు చేసుకున్నారు.

మూల కథలో మహాభక్తుడైన శివ బ్రాహ్మణుని పాత్రను చిత్రంలో 'కైలాస నాథ శాస్త్రి'గా సృష్టించారు ఆ పాత్ర మూలముగా ముఖ్యంగా చింతామణి, శ్రీహరి పాత్రలు– కాశీ, గౌరి పాత్రలు సృష్టించుటకు వీలేర్పడింది

తోలేటి వారి పాటలూ– మాటలూ బాగానే వున్నాయి. ఫొటోగ్రఫీ చక్కగా వుంది. ఘంటసాల వారి పాటలు– సుదర్శనం గారి సంగీతము వీనుల విందుగా వున్నాయి డైరెక్షన్ బావుంది

బోయ తిన్నయ్యకి 'పంచాక్షరి' మంత్రం చెప్పబోయే ముందు– "ఇక్కడ సాలీడు– పాము– ఏనుగు– ఒకే సారి మోక్షాన్ని పొందాయి" అని చెప్పె సందర్భంలో – ఆ విధంగా జరగడం కూడా చూపించివుంటే – ప్రేక్షకులు మరింత సంతోషం పొందేవారు.

కైలాసనాథ శాస్త్రిగా లింగమూర్తి, కాశీగా పద్మనాభం, నీలగా మాలతి, గౌరీగా– కుమారి తమతమ పాత్రలకు న్యాయం చేకూర్చారు.

తిన్నయ్యగా రాజకుమార్ ఆఖరి ఘట్టంలో అద్భుతంగా నటించాడు

(ఫై సమీక్ష "ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక" ది 1-12-54 సంచికలో ప్రచురింప బడింది.)

సేకరణ : ఛీశెట్టి

# అలనాటి మేటి చిత్రాలు - 13

# భారతదేశం పార్టీ గురించి

# ఎన్.టి.ఆర్. వివరణ



*(గత సంచిక తరువాయి)*

"ఒకప్పుడు అనుకున్నాం. ప్రతిపక్షాలం దరి సమైక్యతతో భారతదేశం పార్టీని- నేషనల్ ఫ్రంట్ ద్వారా సాధించాలను కున్నాం-కాని . ..దీని విషయం ..కాలం



నిర్ణయించాలి. అంతేగాని. .యిప్పటికి ఏ ఆలోచనా లేదు" అన్నారు- పద్మశ్రీ ఎన్టీ ఆర్.

"నాదేశం" పత్రిక పెడ్తానన్నారు. దాని గురించి వివరాలు చెప్తారా?

## "నాదేశం"పత్రిక గురించి-

"తెలుగుదేశం"-పార్టీ ఆధ్వర్యంలో వెలువడుతుంది "నాదేశం"పత్రిక. "ప్రధాన సంపాదకుని"గా నేనుంటాను. ఎడిటోరియల్ బోర్డు వుంటుంది. "మహానాడు" మహోత్సవాలనాటికి ప్రథమ సంచిక వెలువడుతుంది.

** ** ** ** **

1968 జనవరి 26 న 'పద్మశ్రీ' బిరుదు పొందిన 'సూర్యతేజస్వి'- శ్రీ రామారావు-హీరోగా- 'మనదేశం' చిత్రంతో రంగప్రవేశం చేశారు.

హీరోగా- 'తెలుగుదేశం' పార్టీని స్థాపించారు. హీరోగా-'ముఖ్యమంత్రి' అయ్యారు.

తొమ్మిది నెలల్లో 'తెలుగుతేజానికి' జగద్విఖ్యాతిని తెచ్చి నేషనల్ ఫ్రంట్ కు ఛైర్మన్ అయి "హీరోలకు హీరో"అయ్యారు.

"సర్! మీరు అత్యున్నత భారత రాష్ట్రపతి పదవిని అలంకరించవచ్చని దేశంలో కొన్నిచోట్ల చర్చనీయాంశంగా వుంది దీనిపై మీ వ్యాఖ్యానం ఏమిటి?"

## నాదేశ ప్రజలకు అంకిత

"పదవుల్ని అపేక్షించడంగాని, పదవి కోసంగాని మనసును తాకట్టుపెట్టడం గాని-నా ఆచారం కాదు. జీవిత శేషానికి మిగిలింది- సేవావిధానమే. నేను భారతదేశానికి, నాదేశ ప్రజలకు అంకితం. అది నా జీవన విధానం. భగవత్ నిర్దేశం. విధి ధ్యేయం. కృషి మాత్రం నాది- అంకితం- దైవస్వరూపులైన ప్రజలది - "దేవానాం

'నటరత్న'తో ఆంధ్రపత్రిక
సినీస్పెషల్ రిపోర్టర్ శ్రీ ధీశెట్టి
జరిపిన ప్రత్యేక ఇంటర్వ్యూ



మనుష్య..."

ఎంత గొప్ప వాక్కు! నిశ్చలమైన ఆయన మనోసముద్రంలో పవిత్రమైన భావాలు... ఎన్నో...! ఉన్నతమైన ఆశయాలు... ఎన్నెన్నో!! అంకితమైన ఆదర్శాలు... మరెన్నో!!!

** ** ** ** ** **

"దాదాపు 40 ఏళ్ల సినీ జీవితం లోనూ-7 ఏళ్ల రాజకీయ జీవితంలోనూ-మీరెన్నో అనుభవాలను చవిచూసి వుంటారు. ప్రతి వ్యక్తికి 'జీవితాశయం' అంటూ ఒక టుంటుంది! మరి మీ జీవితాశయం ఏది టో చెప్తారా?"-

ప్రశాంత వదనంతో శ్రీ రామారావు ఇలా చెప్పారు.

## జీవితాశయము...!

"నా జీవితాశయం-ఒక మహత్కార్యం సంతరించుకున్నది అదే - నా జీవితానికి ప్రత్యేకత కావాలన్నది - అంకితమైన భావంతో వున్నాను అహర్నిశం జరిగే యీ 'నిర్విరామకృషి'- అదే- నాజీవితానికి నేను కోరుకునే పరమార్థం."అన్నారా పుణ్యపురుషుడు.

** ** ** ** **

వేలాది మెట్లెక్కినా-వేయిస్తంభాల గుడిని దర్శించినా- దేవదేవుల రూపాలు వేలవేలున్నా-దిగ్దిగంతాలకు విన్పించే లెక్కకు మిక్కిలి జేగంటలు మ్రోగించినా- పవిత్ర, జల, పుష్ప, సుగంధ, అగరు ధూపాల అర్చనలున్నా దైవదర్శన "పరిపూర్ణత"కు వెలుగుతోన్న "జ్యోతి" ఒక్కటే... మూలం.

అలాగే- 'నటరత్న' ఎన్ని విలక్షణ-విభిన్న పాత్రలు పోషించినా- ఎన్ని అత్యున్నత పదవులు అలంకరించినా- మరెన్ని గౌరవ పురస్కారాలందుకున్నా- దేనికీ సాటిరాని మానవత్వ మహోన్నతకు

భూతి పొందాను.

** ** ** ** ** **

రాజులు పోవచ్చు... రాజ్యాలు పోవచ్చు... కాలం మారవచ్చు. కాల గతులు మారవచ్చు....

కాని.... మారనిది-మాసిపోనిది-మట్టి కానిది 'చరిత్ర'.

ఆ చరిత్రలో-... నాటికీ-నేటికీ-ఏ నాటికీ 'ఆరాధనామూర్తి'గా నిలిచి పోయే 'కళామూర్తి' శ్రీ నందమూరి తారకరామారావుగారిది ఓ సువర్ణ చరిత్ర!

**అందుకే ఆయన ఓ "యుగపురుషుడు"**

**అందుకే ఆయన ఓ"మనుషుల్లో దేవుడు"**

**అందుకే ఆయన ఓ"అవతారపురుషుడు"**

**(అయిపోయింది)**





అయనలోని "పవిత్రమైన మనస్సు"ఒక్క టే...ప్రధానం.

** ** ** ** ** **

ఇంటర్వ్యూ ముగిసింది!

ఆ మహాపురుషునికి-కృతజ్ఞతలు చెప్పి పైకిలేచాను.

చిర్నవ్వుతో దీవించారాయన.

తపోనిష్ఠాగరిష్ఠుడైన ఒక మహాజ్ఞానిని చూసినట్టూ, కోటిదీపాల కాంతితో, వేయి ప్రభలతో వెలుగుతోన్న వైకుంఠమూర్తిని దర్శించినట్టు- అరమోడ్పు కన్నులతో వున్న 'తథాగతు'ని తిలకించినట్టూ-అను



# సిరులెన్ని ఉన్నా...

మధుర



ఏమిటీ ఏంత శోకం ఈలపాట పాడుకుంటూ లోనికడుగు పెట్టిన లక్ష్మణ్‌కి ఇంటి వాతావరణంలో ఏదో మార్పు కొట్టొచ్చినట్లు కన్పించింది. ఇల్లంతా నీట్‌గా సర్దబడి వుంది. ఇంట్లో కాస్త్రంత హడావిడే కన్పించింది.

'బావా, బావా! ఏం తెచ్చావు?' అని అల్లరిగా అడిగే మరదలు పిల్ల 'ఉమ' జాడ ఎక్కడా లేదు. 'నీకు రోజూ ఏవేవో తేవాలంటే నాకొచ్చే జీతం చాలదు- నేను అరిపోతాను. ప్రస్తుతానికిదుంచు...' అంటూ నెత్తిన మొట్టగానే అమ్మయ్య నీవు నవ్వుతున్నావు అది చాలు అంటూ వంటింట్లోకి తుర్రుమని కాఫీ కప్పుతో ప్రత్యక్షమయ్యే ఉమ ఆ రోజు కన్పించక పోవటం ఏదో వెలితిగా అన్పించింది లక్ష్మణ్‌కి.

"హాయ్! టైమ్‌కి వచ్చేసావు.... వాళ్ళు వచ్చే టైమ్ అయ్యింది. త్వరగా స్నానం అదీ కానివ్వు". విజయ హడావుడి పెట్టేస్తూ అంది.

"ఇంతకీ ఎవరే వాళ్ళు?"

"అవన్నీ తర్వాత. అవతల టైమ్...." బాత్‌రూంలోకి తోసి తలుపేసింది విజయ. సవాలక్ష ఆలోచనలతో స్నానం కానిచ్చి సిద్ధంగా వున్న డ్రెస్ వేసుకుని వంట గదిలోకి దారితీశాడు. అక్కడ తల్లి ఏవేవో తయారు చేస్తూ హడావుడి పడుతోంది. ఈ హడావుడి దేనికో అర్థం కాలేదు లక్ష్మణ్‌కి.

"వచ్చావా లక్ష్మణ్! మీ నాన్నగారు ఎప్పుడనగా బజారుకెళ్ళారో పళ్ళూ అవీ తీసుకొస్తానని.... ఇంతవరకూ రాలేదు. అవతల వాళ్ళు వచ్చే టైమ్ కూడా అయ్యింది". నుదుట పట్టిన చెమట తుడుచుకుంటూ అంది శ్రీలక్ష్మి

"అమ్మా! ఇంతకీ నా మొహాన్న కాస్త కాఫీ నీళ్ళు పోసేదేమన్నా ఉందా? ఈ మహాతల్లి ఉమాదేవి ఎక్కడికి దయచేసింది?!" విసుగ్గాఅన్నాడు లక్ష్మణ్.

"ఏమే విజ్జీ! అన్నయ్యకి కాస్త కాఫీ ఇవ్వకూడదు?" విసుక్కుంది శ్రీలక్ష్మి.

"అమ్మా! అన్నయ్యా వదినా మనింటికి వస్తున్నట్టుగా కబురు పంపారా ఏమిటి?"

"ఇంకా చాలామందే వస్తున్నారు. నువ్వు ఎక్కడికీ పోకు. మీ నాన్నగారు వచ్చినట్టున్నారుండు..." బయటకు దారితీసింది శ్రీలక్ష్మి.

"ఉమ కన్పించదేం!?" కాఫీ సిప్ చేస్తూ విజయనడిగాడు లక్ష్మణ్.

"నేను కాలేజీ నుండి వచ్చేసరికే ఉమ కన్పించలేదు. అమ్మనడిగితే బైట జేరింది. శుభకార్యం గదా అందుకని పక్కింట్లో కూర్చోమన్నాను" అంది

"ఇంతలో కారు చప్పుడు విని వాళ్ళంతా వచ్చేసినట్టున్నారు. పద పద విజయ హడావుడి పడిపోతూ ముందు హాల్లోకి పరిగెత్తింది.

"విజయకి పెళ్ళిచూపులు కాబోలు అనుకుంటూ.." ముందుకి దారితీశాడు లక్ష్మణ్.

* * * * *

ఆ ఇంటి యజమాని గోపాలం. ఆయన భార్య శ్రీలక్ష్మి. ముచ్చటయిన ముగ్గురు పిల్లలు గల మధ్యతరగతి కుటుంబం. పెద్దబ్బాయి రఘు ఇంజనీరింగ్ చదువుతుండగానే మంచి సంబంధం వచ్చింది. అమ్మాయి 'అంజలి' అందగత్తె గాకున్నా ఆస్తిపాస్తులు, ఆడంబరాలు పుష్కళంగా వున్నాయి. పైగా అబ్బాయికి ఫారిన్ ఛాన్స్. అబ్బాయి భవిష్యత్ దృష్ట్యా రఘుకి వీళ్ళు వాళ్ళకి అప్పగించేశారు. పెళ్ళవగానే ఫారిన్ వెళ్ళిపోయారు రఘు, అంజలి.

ఇక రెండవవాడు లక్ష్మణ్ బ్యాంకులో క్యాషియర్‌గా జాబ్ చేస్తున్నాడు. ఒక్కగానొక్క కూతురు విజయ బంగారు బొమ్మ బి. యస్ సి సెకెండియర్ చదువుతోంది గోపాలం గవర్నమెంట్ వుద్యోగం చేసి ఈ మధ్యే రిటైర్ అయ్యారు



అయినా ఆయన ఖాళీగా కూర్చోకుండా ఏదో ఒక పని చేస్తూనే వుంటారు.

ఇంక ఉమ గోపాలం చెల్లెలి కూతురు. తల్లి పనిపోగానే అంధ్ర దేశాలంట పోతే మేనమామ పంచన చేరింది. సకల సుగుణాలరాశి, వినయ విధేయతలు ఆ అమ్మాయికి పెట్టని ఆభరణాలు ఉమని ఆ ఇంట్లో అందరూ ప్రేమిస్తారు. ఉమ ఆ ఇంటి క్షేమాన్ని నిద్రలో కూడా కోరుకుంటుంది.

ఇక ప్రస్తుతంలోకి వద్దామా!

★ ★ ★ ★ ★

"ఏమే విజ్జీ! చదువు బాగా సాగుతోందా? ని చదువు పూర్తయితే నిన్ను కూడా అమెరికా తీసుకెళ్ళిపోదాం అని మీ వదిన అంటోంది. కదూ అంజూ!" అన్నాడు రఘు అంజలి నవ్వి అత్తగార్ని ఆరోగ్య కుశల ప్రశ్నలూ అడిగింది. ఆ తర్వాత-

"వీరు మా చిన్నాన్నగారు కలకత్తాలో వుంటున్నారు. పెద్ద బిజినెస్ మాగ్నెట్. ఈవిడ మా పిన్ని రత్న. వాళ్ళ ఏకైక పుత్రికామణి 'సుప్రియ' బి. యస్. సి. చదువుతోంది" అని పరిచయం చేసింది అంజలి.

"మా అత్తగారు, మావగారు. ఈయన మా మరిది లక్ష్మణ్. బ్యాంక్‌లో జాబ్. మా ఆడబడుచు విజయ- డిగ్రీ సెకెండియర్ చదువుతోంది" పరిచయ కార్యక్రమాలయ్యాయి.

"అమ్మాయి లక్షణంగా వుంది" 



ఆప్యాయంగా అంది శ్రీలక్ష్మి.

విజయ అన్నగారి వైపు చూసి కన్ను గీటింది. సుప్రియ అందరి ప్రపోజల్ ప్రకారం లక్ష్మణ్ పక్కనే కుర్చీలో కూర్చుంది.

"అమ్మాయి డాక్టర్ చదవాలని పట్టుబడుతోంది. ఒక్కతే అమ్మాయి. ఎక్కడికీ పంపలేము. మా అమ్మాయి ఎప్పుడూ మా కళ్ళ ముందే వుండాలని వాళ్ళ డాడీ కోరిక. అందుకే మంచి కుర్రాడి కోసం అన్వేషణ, అదృష్టం కొద్దీ అంజలి ఇండియా రావడంతో మీ రెండవ అబ్బాయి పెళ్ళికున్నాడని, మంచి కుర్రాడని- సుప్రియ అబ్బాయి ఫోటో చూసి ఇష్టపడింది. చూశారా ఇద్దరూ ఎంత ముచ్చటగా వున్నారో...." అంది రత్నావళి

"అవునవును. ఈడూ జోడూ బాగానే కలిసింది " అంది శ్రీలక్ష్మి సంబరంగా.

"మా ఆస్తిపాస్తులన్నీ పెళ్ళినాడే అమ్మాయికి చెందేలా రాసేస్తాం. మీ అబ్బాయి పై చదువులు చదవాలంటే చదవచ్చు. లేదా వాళ్ళ మామగారితో బిజినెస్ చెయ్యవచ్చు అన్నీ నచ్చితే ముహూర్తాలు పెట్టేసుకుందాం. ఎక్కువ టైమ్.. ఆలస్యం అమృతం విషం అన్నారు పెద్దలు ." రత్నావళి చెప్పిందంతా నాదస్వరం విన్న నాగుపాములా శ్రద్ధగా వింది శ్రీలక్ష్మి.

అంజలి మామగారితో అంది....

"ఎంత లేదన్నా మన లక్ష్మణ్ రెండు కోట్ల రూపాయల ఆస్తికి వారసుడు. మంచి వరుడు కావాలన్నదే వాళ్ళ కోరిక. మన లక్ష్మణ్ అదృష్టవంతుడు. సుప్రియ చాలా కుదురయిన పిల్ల"

గోపాలం కళ్ళు సంతోషంతో మెరుస్తున్నాయి. తను ఎంత అదృష్టవంతుడు. కొడుకులిద్దరూ కోటీశ్వరులు. ఏ తండ్రికి మాత్రం కొడుకుల వున్నతిని చూస్తే సంతోషం కాదూ. విజయకి కూడా మంచి సంబంధం చూసి రెండు పెళ్ళిళ్ళూ ఒక్కసారే చేసేయాలి... ఉమ... ఉమ గుర్తుకు రాగానే గోపాలం మనస్సు కలుక్కుమంది... ముఖం వెల వెలబోయింది ఒక్క క్షణం. అంతలోనే సర్దుకున్నాడు. తల్లీ తండ్రీ లేని పిల్ల. మంచి సంబంధం చూసి పెళ్ళి చేయాలి.

"లక్కీ ఫెలో!" ఆప్యాయంగా తమ్ముడి భుజం తట్టాడు రఘు.

టిఫిన్స్ కార్యక్రమం పూర్తయ్యింది. లక్ష్మణ్ ఏదో జోక్ చెబుతూంటే పడి పడీ నవ్వుతోంది సుప్రియ. విజయ వాళ్ళిద్దర్నీ గమనిస్తోంది. ఇందరి సంతోషంలో పాలుపంచుకోలేని వ్యక్తి మౌనంగా కిటికీ రెక్కలగుండా చూస్తోంది నిస్పృహగా.

"నిశ్చయతాంబూలాలు ఫలానా రోజు అనుకుంటే ఆ రోజు అన్నయ్య గారింట్లో ఏర్పాటు చేస్తాము. ఒక్క అమ్మాయి- అన్నీ ఘనంగా జరగాలి" ఆర్భాటంగా అన్నాడు కాబోయే వియ్యంకుడు.

"ఏంరా లక్ష్మణ్! నీకు ఎప్పుడు వీలవుతుంది రెండు రోజులు కలిసివస్తే బాగుంటుంది". అడిగారు గోపాలం.

"నాన్నా! పెళ్ళవ్వగానే నేను మా మామగారి వెంట కలకత్తాయో, దుబాయో వెళ్ళిపోవాలి కదా?" అడిగాడు లక్ష్మణ్. .

"నీ భార్య ఎక్కడుంటే అక్కడకు వెళతావు". నవ్వుతూ అన్నారు గోపాలం.

"అంటే మిమ్మల్నందర్నీ వదిలి వీళ్ళతో వెళ్ళిపోవాలా?"





## దీపికకు రాజేష్ సిఫార్సు

గతంలో సూపర్ స్టార్‌గా నిలిచిన రాజేష్‌ఖన్నా-డింపుల్ కపాడియా (విడాకులివ్వలేదట!), టీనామునీమ్, అంజు మహేంద్రులతో సంబంధాలు పెట్టుకున్నాడు. ఇప్పుడు టి.వి. సీత దీపికతో సంబంధాలు పెంచుకుంటున్నాడట. అంతేకాదు...ఎవరైనా నిర్మాతలు తనను బుక్ చేసుకునేందుకు వస్తే దీపికను రికమండ్ చేస్తున్నాడు. కాని నిర్మాతలు వీళ్ళిద్దరిని బుక్ చేయటానికి సాహసించలేకపోతున్నారు మరి దీపికతో వున్న 'సంబంధం' ఎలాంటిదో!? ష్...!

**"ఏంటి లక్ష్మణ్! చిన్న పిల్లాడిలా" మందలింపుగా అంది తల్లి.**

"క్షమించండి. నేను వాళ్ళ పెంపుడు కుక్కలా వెంట వెళ్ళలేను నాన్నగారూ".

**"అన్నయ్య అమెరికా వెళ్ళాడు. అయితే మాత్రం ప్రతి ఏడాదీ వచ్చి మనల్ని చూట్టంలా మీ సుఖాన్నేరా మేము కోరుకునేది". నచ్చ చెపుతూ అంది శ్రీలక్ష్మి.**

"బిడ్డల సుఖాన్ని కోరుకోవటం ఇలాగా. వాళ్ళని దూరంగా విసరి వేయడం. ఎవరో ముక్కూ మొహం తెలీని వాళ్ళు ముచ్చటపడితే ఇచ్చేయటం. నో.."

"ఏరా! ఏం మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా!" కోపంగా అరిచాడు గోపాలం. తండ్రిని శాంతపరుస్తూ అన్నాడు రఘు.

**"లక్ష్మణ్! నీ భవిష్యత్ బాగుండాలని అమ్మా నాన్నగారి కోరిక. నీవు వాళ్ళని బాధ పెట్టడం భావ్యం కాదు ఇంకా టైమ్ వుంది. బాగా ఆలోచించు. ఎన్ని ఏళ్ళు కష్టపడితే మాత్రం కారు కొనగలవా! ఎంత సంపాదిస్తే మాత్రం కోట్లకి అధిపతివి కాగలవా? బాగా ఆలోచించు. బంగారంలాంటి ఛాన్సు...."**

"అన్నయ్యా! మీ అందర్నీ బాధ పెడితే నన్ను క్షమించండి. తండ్రి మాట జవదాట లేని శ్రీరామచంద్రుడు -మా అన్నయ్యా అయినా ఆయన అడుగు జాడల్లో నడిచిన లక్ష్మణుడిని కాను నేను. నేను ఎవ్వరికీ బానిసను కాలేను..." చేతులు జోడించాడు లక్ష్మణ్

**"అంటే నేను బానిసగా బ్రతుకుతున్నానా! అదేగా నీ అభిప్రాయం..."**

"అన్నయ్యా ఒక్కసారి ఆలోచించు నీకే అర్థమవుతుంది. పెళ్ళి కాగానే వదిన వెంట ఆడపిల్లలా వెళ్ళిపోయావు. అమెరికా అనగానే వదిన వెంట కుక్క పిల్లలా వెళ్ళిపోయావు రెండేళ్ళకోసారి వస్తావు. . ఎయిర్‌పోర్ట్‌లో దిగంగానే మావగారి కారు రెడీగా వుంటుంది. ముందుగా 'అమ్మా, నాన్న, తమ్ముడు, చెల్లినీ' చూడాలని నీ మనస్సు ఆక్రోశిస్తుంది. కానీ నీ భార్యతో అనలేవు ఆమె వెంట వెళ్ళి వారం రోజులు పోయాక నీవు తెచ్చిన ఖరీదైన ఫారిన్ వస్తువుల్లో ఎవరి క్కావలసినవి వాళ్ళు ఏరేసుకున్నాక, వాళ్ళకి పనికిరానివి మూట కట్టుకుని 'వదిన' ఊ- అంటే అపుడు నీ ఇంటికి సారీ! మా ఇంటికి వస్తావు. రాంగానే 'అమ్మా! అని అమ్మ చేతిని పట్టుకున్నపుడు నీ కళ్ళలో రాలటానికి సిద్ధమై రాలలేని నీ కన్నీళ్ళని చూస్తే నాకర్థమవుతోందన్నయ్యా! నీవు ఎంత సుఖాన్ని, ఎంత ప్రేమనీ పోగొట్టుకొన్నావో.. "

**"అన్నయ్యా! కోట్లు అప్పనంగా వస్తున్నాయని, ఈ ప్రేమలూ, ఆప్యాయతలు నేను వదులుకోలేను అన్నయ్యా!" లక్ష్మణ్ గొంతులో స్థిరత్వం.**

**"లక్ష్మణ్! మీ అన్నయ్య ఏదో పెద్ద త్యాగం చేసేసినట్లు... ఎంతో నష్టపోయినట్లు చెబుతావేం. అయినా పాతాళంలో వున్న వాళ్ళకి అందలం ఎక్కించటం మాదే తప్పు. అమ్మా, నాన్నా అంటూ కూర్చుంటే మీ అన్నయ్య లైఫ్ ఎలా వుండేదో తెలుసా! అయినా అవన్నీ ఎందుగ్గానీ నీ సంగతి చెప్పు" అంది అంజలి**

"వదినా! అన్నయ్య ఏం పోగొట్టుకున్నాడో అన్నయ్యకి తెలుసు. వదినా! మీ అమ్మలాగే మా అమ్మా నవమాసాలు మోసి కన్నది. ఎంత అల్లరి చేసినా ముద్దుగా భావించి మురిసిపోయింది. స్కూల్‌కి వెళ్ళనని మారాం చేస్తే మా నాన్న ఎత్తుకుని స్కూల్లో దించి మాస్టారితో మా వాడ్ని కొట్టకండి అని చెప్పేవారు. మేము ఆలస్యంగా ఇంటికొస్తే ఎంత హడావుడి మా ఇంట్లో ముగ్గుర్నీ దగ్గరకు తీసుకుని కన్నీళ్ళు పెట్టుకునేవారు మా కోసం, మా భవిష్యత్ బాగుండాలన్న తపనతో రెక్కలు ముక్కలు చేసుకుని పార్ట్ టైమ్ జాబ్ కూడా చేసేవారు మా నాన్న మిమ్మల్ని వదలి నిముషం కూడా వుండలేని నాన్నగారు అన్నయ్యను మీకు ఇచ్చేసారు. వాడి సుఖం కోరి. రెండోసారి కూడా ఎందుకంటే మా సుఖం కోసమట ఇదేం న్యాయం. మీరంతా చెప్పండి? " ఆవేశంగా మాట్లాడుతున్న లక్ష్మన్ మాటల్ని అందరూ తెల్ల మొహాలేసుకొని చూస్తున్నారు.

'విజ్జీ! ఉమని తీసుకురా!" విజయతో అన్నాడు లక్ష్మణ్

రానని మొరాయిస్తున్న ఉమని లాక్కు వచ్చింది విజయ

# రచయిత్రి జవాబులు



కె. మాధవరావు, కాకినాడ, ఎల్ నారాయణ– కోదాడ, రామకృష్ణశాస్త్రి– నాగపూర్

ప్రః ఇది స్త్రీ రచయితలు అటెంప్ట్ చేసే సబ్జక్టు కాదేమో!

జ. విషయ పరిజ్ఞానానికి ఆడమగ తేడా లేదు

టి. ప్రమీల, శ్రీలక్ష్మి– గుంటూరు
భట్టిప్రోలు సూర్యనారాయణమూర్తి– గుడివాడ

ప్ర. విదేశీ శక్తులు శ్రిలంకలో చేరితే మనకేం నష్టం?

జ. మనకు చాలా నష్టం ఎలా అంటే– మన ఇంటిపక్క ఇల్లు తగలబడుతోంది వాళ్లిళ్లేకదా అని మనం వూరుకుంటున్నామా! చొరవ తీసుకొని ఆ మంట లార్పటానికి అన్ని విధాలా ప్రయత్నిస్తాం ఎందుకంటే ఆ మంటలు మనింటి మీదిక్కూడా వ్యాపించక మానవు అందుకని ఒక పొరుగింటి విషయంలోనే మనం ఇంత ఆదుర్దా జాగ్రత్తలు తీసుకుంటున్నప్పుడు– ఓ దేశం విషయంలో ఇంకెంత జాగరూకత అవసరం? సరైన సమయంలో ఈ నిర్ణయం తీసుకోవడం వలన ఉత్తరోత్తరా మనకు రక్షణ ఖర్చు తగ్గడమేగాక– శ్రిలంక నుండి శత్రు బాధలుండవు.

ఎస్. శ్రీనివాసమూర్తి– జీడిమెట్ల

ప్రః ఒక నవల వ్రాయడానికి (సాగర మథనం లాంటి) విషయ పరిజ్ఞత, అవగాహన అవసరం అంటారా?

జ. సమకాలీన జీవితాన్ని గురించో, సమాజం గురించో పాఠకులకి తెలియ చెప్పడం ఎంత అవసరమో తమపై ప్రభావం ఉండగల రాజకీయ సమస్య గురించో, భౌగోళిక సమస్య గురించో, పాఠకుడికి ఒక స్పష్టమైన అవగాహన ఇస్తే కాలక్షేపంతో పాటు, కొంత విజ్ఞానం కూడా అందజేసినట్టుంటుంది. ఇది నవలా రచయిత బాధ్యతై ఉండాలని నా ఉద్దేశం. ○

"సుప్రియా! ఉమ మా మరదలు పిల్ల మీకు కోట్లు, కార్లు, భవంతులు చాలా చాలా వున్నాయి కానీ దీనికి కనీసం తల దాచుకోను ఇంత నీడ కూడా లేదు మేము పొమ్మంటే పోదు. మెడపట్టి గెంటినా మళ్లీ వచ్చి ఇక్కడే తల దాచుకుంటుంది అంత ప్రేమ మేమంటే. అన్నీ వున్న నీకు వరుడు దొరకడం కష్టం కాదు కానీ నన్నే ప్రేమించినపుడు నా స్వార్థం కోసం నేను పారిపోతే ఈ అభాగ్యురాలు జీవితం మీద విరక్తితో ఆత్మహత్య చేసుకుంటుంది నా తల్లిదండ్రులనూ, నా బంగారు చెల్లి అనురాగాన్నీ, ఈ పిచ్చిదాని ఆరాధననూ వదలుకొని నేను మీ వెంట రాలేను. నన్ను క్షమించండి. మీ మనస్సు నొప్పిస్తే సారీ!"

అందరూ లేచి నిల్చున్నారు అంజలి మొహం అవమానంతో ఎర్రబడింది.

"ఎంత ఎదిగిపోయావురా! ఆల్ ది

## సిరులెన్ని ఉన్నా...

బెస్ట్... వెళ్లేలోగా మళ్లీ కలుస్తాను. ఎందుకంటే నేను భార్యకి అమ్ముడయి పోయానుగా.." లక్ష్మణ్‌కి మాత్రమే వినిపించేలా అని, రుసరుసలాడుతున్న భార్యని అనుసరించాడు రఘు.

తమ మాట కాదన్నందుకు విచారించాలో, తమ మీద కొడుక్కున్న ప్రేమకు పొంగిపోవాలో అర్థం గాని పరిస్థితిలో అతిథుల్ని సాగనంపటానికి బయటికి నడిచారు గోపాలం దంపతులు

"అన్నయ్యా! నీవు కూడా దూరం అయిపోతావేమోనని భయం వేసింది. అంతా ఉమాదేవిగారి దయ వస్తానుండండి". బయటికి దారితీసింది సంతోషంగా విజయ

'ఉమా! ."

"ఊ "

"బావా, బావా! ఏం తెచ్చావు? అని నీవు అడక్కపోతే ఈ వేళ నాకు పిచ్చెత్తినట్టుంది తెలుసా!" కొంటె నవ్వుతో అన్నాడు లక్ష్మణ్

"ఇంక అడగనుగా కొండంత ప్రేమని మూట కట్టుకుని నాకోసం దాచావు ఇంకేం కావాలి నాకు" . ఉమ కళ్లలో మెరుస్తున్న కన్నీళ్లు క్రిందికి జారుతుండగా వాటిని మధ్యలోనే లక్ష్మణ్ పెదవులు ఆపు చేసాయి

"ఏయ్ పిచ్చీ! నీవు ఈ ఇంటి మహారాణివి. మమ్మల్ని జాగ్రత్తగా కాపాడుకోగల చల్లని తల్లివి. మా ఇంటి మహాలక్ష్మివి గోపాలంగారి చిన్న కోడలివి.. మరి నీ కళ్లల్లో కన్నీళ్లు కాదు వుండాల్సింద కాంతిపుంజాలు. కరుణా కటాక్షాలు " తల నిమురుతూ అంటున్న లక్ష్మణ్ కళ్లలోకి ఆరాధనగా, పరమశివుడ్ని మెప్పించి తన వాడ్ని చేసుకొన్న పార్వతిలా చూసింది ఉమాదేవి ○

# హలో! డాక్టర్ నేనేం చేయాలి?



డా. కొత్త రవీంద్రబాబు

**ఆర్., మాదన్న పేట:**

అంగం చిన్నది సెక్స్‌హోర్మోన్ల ఇంజక్షన్ చేయించుకోనా? మీ అడ్రస్ చెబుతారా?

డాక్టర్‌గారికి చూపించుకోకుండా ఇంజక్షన్ వాడవద్దు.

నా అడ్రసు దేవీనర్సింగ్‌హోం, తెనాలి.

**పి.సుమతి, గుంటూరు:**

పసరు తిత్తిలో రాళ్లున్నాయి అపరేషన్ అంటే భయంగా వుంది.

నిర్భయంగా ఆపరేషన్ చేయించుకోండి.

**ఎస్. బాషా, ఏలూరు:**

వేసెక్టమీ చేయించుకున్నాను. సెక్స్ కోరిక తగ్గింది. ఆపరేషన్ వలన అలా జరిగింది.

వేసెక్టమీ తరువాత సెక్స్ కోరిక తగ్గిందనుకోవడం కేవలం మీ అపోహమాత్రమే.

డ్యూరావిన్ గొట్టం రాత్రి భోజనం తర్వాత పదిహేను రోజులు వాడండి.

**ఎస్.ఆర్., చీరాల:**

వయసు 28 సంవత్సరాలు, నెమ్ముకు మందువాడాక అరికాళ్లు మంటలు శీఘ్రస్ఖలనంతో బాధపడుతున్నాను. వివాహం చేసుకోవాలంటే భయంగా వుంది.

న్యూరోబియాన్ ఇంజక్షన్లు రోజా పదిహేను రోజులు చేయించుకోండి. జీవిట్ గొట్టాలు రోజా రాత్రి భోజనం తర్వాత రెండు నెలలు వేసుకోండి. భయపడకుండా వివాహం చేసుకోండి.

**ఎస్.వి.ఆర్.కె. కంకిపాడు:**

లావు కావాలి. జుట్టు రాలగూడదు. వయస్సు 21 సంవత్సరములు.

జీవిట్ గొట్టం, ఒరాబోలిన్ బిళ్ల రోజా రాత్రి భోజనానంతరం మూడు నెలల పాటు వాడండి

క్లినిక్ షాంపూతో వారానికి రెండు సార్లు తలంటుకుంటుండండి.

**ఎస్. రావు, భీమునిపట్నం:**

వర్తమాన రచయితలలో మీరెవరి నధిమానిస్తారు.

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పి చాలా మంది రచయిత మిత్రుల మనసు నొప్పించలేను.

**గోవింద్, అనంతపూర్:**

సెక్స్ హోర్మోను తక్కువగా వుంటే ఇంజక్షన్ చేయించుకోవచ్చా?

డాక్టర్‌గారి సలహాతోనే ఆ పని చేయండి.

**డి. శ్రీకాంత్, చీరాల:**

వయసు 17సంవత్సరములు. చేతుల మీద గుండెలమీద మొటిమల లాగా వస్తున్నాయి. గిల్లితే తెల్లగా వస్తున్నది.

నెకోసబ్బుతో రోజా రెండు పూటలా స్నానం చేయండి. ఎస్కేబియాల్ మందు రాసుకుని ఒక రోజల్లా వంటిమీద మందు పూత వుండనిచ్చి తర్వాత స్నానం చేయండి. లెడర్ మైసిన్ మూడువందల మిల్లీగ్రాముల గొట్టం రోజు రెండుసార్లు పదిరోజులపాటు వాడండి.

**కె.ఎల్.నారాయణ, మచిలీపట్నం:**

వయసు 16 సంవత్సరములు. తెల్ల వెంట్రుకలు వస్తున్నాయి. తలలో చుండ్రు వున్నది. పొట్ట తగ్గాలి.

ఆహారంలో కొవ్వు పదార్థం తగ్గించి వ[illegible]నండి. ఏస్కజిన్ గొట్టం రాత్రి భోజనానంతరం రెండు నెలలు వాడండి. వారానికి రెండుసార్లు క్లినిక్‌షాంపూతో తలంటుకోండి. ఆందోళన వల్ల అనారోగ్యం వల్ల వంశపారంపర్య లక్షణంగా జుట్టు నెరుస్తుంది.

**బాషా, మైలవరం:**

మీసాలు రాలేదు. బాధగా వుంది.

మీసాలు రానంత మాత్రాన బాధపడవలసిన అవసరంలేదు. మీసాలు లేకుండానే సంసారం చేస్తూ సంతానం కలిగినవాళ్లు చాలామంది వుంటారు.

**పి.ఎస్. మూర్తి, కడియం:**

వేశ్యతో కలిశాను. అప్పటి నుంచి అంగం నుండి చీమువస్తున్నది.

నోరిలెట్ నాలుగువందల మిల్లీగ్రాముల బిళ్లలు రెండు వేసుకోండి. తగ్గిపోతుంది.

**జి. వరదరాజులు, గుంతకల్:**

వయసు 20 సంవత్సరములు. మొటిమలు వచ్చి తగ్గుతూ నల్లమచ్చలు ఏర్పడ్డాయి. మీరు యిచ్చే సలహాలు చాలా అద్భుతంగా వున్నాయి.

జవాబు :- సున్నిపిండి ఏమిటో తెలియదన్నారు. బియ్యం, ఉలవలు, సెనగలు, పెసలు పిండివట్టించి ఆ పిండితో ముఖం రుద్దుకుంటే మంచిది. సబ్బు వాడడం మంచిదిగాదు. ⚪



## సీరియల్

# ప్రణయవల్లరి

## యర్రసుంట్ల వరలక్ష్మీదేవి




**ఇంతవరకూ సాగినకథ-18:** నాటకాల పిచ్చి వున్న రామకృష్ణ-గణపతి స్నేహితులు లా చదివేందుకు అలహాబాద్ వెళ్లిన రామకృష్ణకు సిన్హా-రబీన్ స్నేహితులవుతారు టి.బి. సోకిన నవనీతకు రామకృష్ణ వైద్యం చేయిస్తూ, ఆ కుటుంబానికి సన్నిహితుడవుతాడు రామకృష్ణ నవనీతను పెండ్లి చేసుకోవాలన్న తన నిర్ణయాన్ని గణపతికి తెలియజేస్తాడు. నవనీత టి.బి నుంచి కోలుకుంటు న్నదని తెలిసిన రామకృష్ణ ఆనందిస్తాడు. సిన్హా కుటుంబం రామకృష్ణ -యింటికి వస్తుంది. సిన్హా చెల్లెలు-నీల-రామకృష్ణపై మనసు పడుతుంది.

*(గతసంచిక తరువాయి)*

ఆసరికి రామకృష్ణ మంచం మీద కూర్చుని దేనికోసమో చూస్తున్నాడు. నీల రాగానే "ఎవరు?" అని అడిగేడు అర్ధనిమీలిత నేత్రాలతో చూస్తూ.

"నేనే-నా బాగును మీ గదిలో మర చేను-దానికోసం" అని తడబడుతు మెల్లగ చెప్పింది.

రామకృష్ణ అదేమి వినిపించుకున్నట్టు లేదు.

"చాలసేపయింది దాహంగ వుంది - మంచినీళ్లు కనిపించడంలేదు. నువ్వెప్పుడొచ్చేవు? సరాసరి ఇక్కడకు రావడం మంచిపని చేసేవు-నీళ్ళివ్వు."

నీల టేబిలు మీదున్న కూజా వంచి చూసింది. అందులో నీళ్లు లేవు.

"మీ గదిలో నీళ్లు లేవు-నా గదిలో ఉన్నాయి తెద్దునా?"

"పద నేను వస్తాను-నువ్వు తెస్తే ఆలస్య మవుతుంది" అని మెల్లగా లేచేడు.

నీల ఆశ్చర్యంగా రామకృష్ణవైపు చూచింది. ముందు కొంత సంకోచపడింది. అంతలో ఆమె కాంక్ష ఆమెను పురికొల్పింది.

"అయితే పదండి" అని తన బ్యాగును తీసుకొని రామకృష్ణ చేతిని అందుకుని మెల్లగ నడుస్తు తన గదిని చేరింది. లోనకు వెళ్ళి తలుపుల్ని వేసేసింది.

రామకృష్ణ వెళ్లి మంచం మీద కూర్చు న్నాడు. నీల బాగులోని కిల్లీని తను వేసుకొని, కూజాలోని నీళ్లను గ్లాసులో పోసి రామకృష్ణకు అందించింది. రామకృష్ణ నీళ్లను త్రాగి గ్లాసును తిరిగిచ్చేసేడు. ఆ గ్లాసును టేబిలు మీద పెట్టి రామకృష్ణ వద్దకు వచ్చి నించుంది నీల. ఆ నీలం దీపం కాంతిలో రామకృష్ణ చేతిని జాచి నీల చేతిని అందుకుని -"నవనీ! నాకోసం వచ్చేవా? నీకు నామీద ఎంత ప్రేమ" అన్నాడు.

నీల మెల్లగ అతడి ప్రక్కన కూర్చుంది.

"ముద్దు పేరుతో పిలవడమేనా-మరేం వద్దా?" అంది వణుకుతున్న గొంతుతో మెల్లగా.

"నువ్వు కావాలి" అని రామకృష్ణ నీలను తన కౌగిలిలోకి తీసుకున్నాడు. ఇద్దరు గట్టు తెగిన వాగులా ఉద్వేగంతో ఒకర్ని ఒకరు పెనవేసుకున్నారు.

## 26

ప్రొద్దున్న ఆరున్నరయింది. మేడమీద ఎవ్వరు నిద్రలేవలేదు. పని మనిషి వచ్చి మేడ తుడుస్తూంది. అవతలనున్న వరండ తుడుస్తు తెరచున్న కిటికీలోంచి కూతూహలానికి నీల గదిలోకి చూచింది గతుక్కుమంది. ఆ పెద్ద మంచం పైన రామకృష్ణ, నీల ఒకరి కౌగిలిలో ఒకరు గాఢంగా నిద్రపోతున్నారు భుజాల వరకు దుప్పటి కప్పి ఉంది పైన ఫాను జోరుగ తిరుగుతూంది.

మరక్కడుండలేక త్వరగా మేడదిగి క్రిందికి వచ్చేసింది. ఏం చేయడమో దాని కేమి తోచడం లేదు. అలానిర్ఘాంతపోయి మేడదిగువున హాల్లో నిల్చున్న పని మనిషిని చూచి, ఆ ప్రక్కనుండి వెళ్తున్న శాంతాదేవి చూచి-

"ఏమే రంగమ్మా-ఏమిటలా బొమ్మలా నిల్చుండిపోయేవు. తుడుపులయిపోయేయా?" అని అడిగింది.

"ఏంలేదు అమ్మగారు" అని నసుగుతు అంది. కాని దాని కడుపులో ఆ రహస్యం దాగడం లేదు. చెప్పెయ్యాలని ఉబలాటంగ ఉంది.

"ఏమిటే ఆ నణుగుడు-ఏం జరిగింది?" ఏదో అయిందన్న సంశయం కల్గి శాంతాదేవి రంగమ్మను గుచ్చి గుచ్చి చూస్తు అడిగింది.

"మీరొకసారి మీ గదిలోకి రండి అమ్మ గారు-చెప్తా" అని రంగమ్మ శాంతాదేవి గది వైపుకు నడిచింది. శాంతాదేవి ఆందోళనతో రంగమ్మ ననుసరించింది తన గదిలోకి.

"ఇప్పుడు చెప్పు-ఏమయిందో"

"అమ్మగారు-మరీను-మన ఇంటికి రాయ పూరు నుండి వచ్చిన ఆ చిన్నమ్మగారి గదిలో మీ అబ్బాయిగారు ఆ చిన్నమ్మగార్ని పట్టుకుని పడుకున్నారండి" అని సిగ్గుపడుతు చెప్పేసింది.

"ఆ! ఎంతపని జరిగింది! మరి వాళ్లంత నిద్ర లేవలేదా?"

"లేదండి-రోజు చూస్తున్నాగా ఏడయితే-

గాని ఎవ్వరు లేవరండి."

"సరే-నువ్వు నోరుమూసుకొని నీ పని చూసుకో. మరి మేడమీదకు పోకు-ఈ విషయం మరెవ్వరికేనా చెప్పేవుసుమా-జాగ్రత్త!" అని హెచ్చరించి త్వరగా నడుచు కుంటు తన అన్న గదిలోకి వెళ్లింది. నరసింహం భార్య ఆసరికి పెరటిలో ఉంది. నరసింహం కుర్చీలో కూర్చుని కాఫీ త్రాగుతు న్నాడు. చెల్లలుని చూచి ఆశ్చర్యపోయాడు.

"ఏమమ్మా శాంతా-ఏమయింది? అంత ఆందోళనగా ఉన్నావు."

"కొంపమునిగింది అన్నయ్యా-ఏమని చెప్పను-మన రామం చేయరాని పని చేసాడు" అని కంట తడి పెట్టుకుంది.

"ఏమమ్మా-ఏంచేసేడు? త్వరగా చెప్పు" అని ఆందోళనతో తన కాఫీ కప్పును టేబిలు మీద పెట్టేసి, లేచి ఆమె ముందుకు వచ్చేడు.

"ఇలారా-చూద్దువుగాని" అని శాంతా దేవి మేడ మెట్ల వైపుకి కదిలింది.

అదే సమయానికి సత్యేజిత్ సిన్హా భార్య ఆ రెండు పడక గదుల మధ్య నున్న బాత్ రూములోకి వెళ్లింది, తెలివొచ్చి పడక నుండి లేచి. బాత్ రూము తలుపు నీలున్న గది వైపుది కొస్త తెరచుకునుంటే, దగ్గరకువెళ్లి తలుపును లాగి గడియ పెట్టబోయింది.

తలుపు దగ్గరకు వెళ్లి ఆ లోన దృశ్యం చూచి కర్రలా బిగుసుకుపోయింది. ఆఖరికి శక్తి తెచ్చుకుని మెల్లగ కదిలి తన గదిలోకి వెళ్లి భర్తను లేపి, తను చూసిన దృశ్యం గురించి చెప్పింది. నమ్మలేనట్లుగ సత్యజిత్ సిన్హా తలను విదిల్చి, మంచం మీద నుండి లేచి గబగబా నీల గదిలోకి వెళ్లి వాళ్లిద్దరు భార్యా భర్తల్లా అంటిపెట్టుకుని హాయిగా నిద్ర పోతుండడం చూచి నిర్ఘాంతపోయి కోపంతో ఊగిపోతు తన గదిలోకి వచ్చేసేరు.

"రోగ్స్-అందరి కండ్లు కప్పి ఎంతపని చేసేరు. రామకృష్ణ పెద్దమనిషనుకున్నాను



గాని ఇంత స్కాండ్రల్ అనుకోలేదు. నువ్వెళ్లి వాళ్లను లేపు ముందు. తరువాత సంగతి నేను చూసుకుంటా" అన్నాడు సత్యజిత్‌సిన్హా పండ్లు కొరుకుతు.

రమాదేవి భర్త భుజం మీద చెయ్యివేసి "చూడండి మీరు తొందరపడకండి. సావధానంగ మనం ఆలోచించాల్సిన ఉపద్రవమిది. మనం బురద పైన రాయి విసురుతే మన పైనే బురద తుళ్ళుతుంది, ఆలోచించండి. నేను నీలను లేపి వస్తాను" అని కదిలింది.

ఈలోగా శాంతాదేవి, నరసింహం వరండావైపునున్న కిటికీలోంచి మంచం మీదున్న వారిరువుర్నిచూచి, రామకృష్ణను పిలిచి లేపడమా లేదా అని సందిగ్ధంలో ఉండగ అటువైపున్న బాత్‌రూము తలుపు తెరచుకుంటుండం చూచి ఛటాలున కదిలి వరండాలోకి వచ్చేసేరు.

నీలకు పది నిముషాలు ముందుగానే తెలివి వచ్చింది. ఆమెకు మనస్సులో ఏ చింతా లేదు. పైగ ఎంతో ఉల్లాసంగ ఉంది. హీరోలాంటి రామకృష్ణను తన వాడిగ చేసుకోగల్గినందుకు.

నీల ఆలోచనలో పడింది. తను రామకృష్ణను నిద్ర నుండి లేపుతే రామకృష్ణలేచి పరిస్థితికి ఆశ్చర్యపోయి-"సారి నీల! త్రాగుడు మత్తులో ఏదో చెయ్యరాని పని చేసేను- నన్ను క్షమించు" అని మెల్లగ వెళ్లిపోతే, తరువాత మళ్లీ విముఖత చూపిస్తే ఆ రహస్యం, తమిద్దరి మధ్యన ఉండిపోయి తను ఏమి సంపూర్ణంగ సాధించలేనిదై పోతుంది. ఆఖరికి మనస్సుకు, దేహానికి ఆ కళంకమే మిగిలిపోతుంది. అందుకే ఈ కథ సుఖాంత మవాలంటే కొంత రసాభాసు జరగవల్సిందే. ఆ వలలో చిక్కుకుంటేగాని రామకృష్ణ తనను వివాహం చేసుకోడు. ఎలాగైన తనకు రామకృష్ణ భర్తగా కావాలి.

నీల గట్టిగ కండ్లు మూసుకుని రామకృష్ణకు మరింత చేరువగ జరిగి పడుకుంది. రమాదేవి గదిలోకి అడుగుపెట్టి ఆగిపోయి, దూరం నుంచే "నీలా!" అని కేకేసింది. నీల కదలలేదు కేక వినిపించిన. రమాదేవి కోపంతో-"నీలా, నీలా! లే - నువ్వు -నీ మొద్దు నిద్ర పాడుగాను" అని మరికాస్త గట్టిగా కేకవేసింది. నీల కదిలి, కప్పుకున్న పలుచటి దుప్పటిని మెడవరకు లాక్కుంటు మంచం మీద లేచి కూర్చుంది. తల తిప్పి ముందు తల్లిని చూచింది.

"సిగ్గు లేని దానా- ముందు బయట పడు" అని కోపంగ అని వెనుదిరిగి మధ్యనున్న బాత్‌రూమ్ ద్వారా తన గదిలోకి పోయింది రమాదేవి.

"పద శాంతా! వాళ్ల కంట ఎలాను పడ్డారు వీళ్లు. మనమిప్పుడు చేయగల్గింది

## ప్రణయపల్లవి

ఏమిలేదు. క్రిందకుపోయి ఆలోచిద్దాం పద" అన్నాడు నరసింహం.

"వాళ్లంతా కోపంతో అబ్బాయి నేమైనా చేస్తారేమో. రామాన్ని లేపి తీసుకొని పోతే బాగుంటుంది" అని శాంతాదేవి తల్లి హృదయం విలవిల లాడింది.

"మరేం ఫరవాలేదు-ఆడపిల్ల తండ్రి అంత ఘోరమేమి చెయ్యలేడు. పైగ ఇది రేప్ కేసేమికాదు. రామకృష్ణ అమ్మాయి గదిలో ఉన్నాడు. బలవంతమైతే రాత్రంత హాయిగ నిద్రపోరుగ" అని తన లాయరు బుర్రతో ఆలోచించి నరసింహం చెప్పేడు.

ఇద్దరు తిరిగి వచ్చేస్తుండగ సత్యజిత్ సిన్హా, కోపంగ తన గదిలోంచి మధ్యమున్న వరండాలోకి వచ్చేడు. వీళ్లను చూచి కోపంగ -"గొప్ప సంస్కారమున్న ఉన్నత కుటుంబీకులు! మోరల్సు చూస్తే వీధి తుడిచే వాళ్లు కూడ సిగ్గుపడతారు" ఇంకా ఏమో అనబోతుండగ రమాదేవి బలవంతంగ సిన్హాను గదిలోకి లాగుకుని పోయింది.

నరసింహం, శాంతాదేవి తలవంచుకుని మారు మాటలేక మేడ దిగివచ్చేసేరు.

నీల మంచం మీంచి లేచి బట్టలు కట్టుకోకుండానే, అలా మంచం మీద నుండే రామకృష్ణను కుదిపింది. రామకృష్ణ కదిలి కండ్లు తెరిచి ఓ క్షణంకు ఆ గది తన గది కాదని తట్టి, ప్రక్కకు తిరిగి నీలను చూచి అలా శిలా ప్రతిమలా ఉండిపోయాడు.

"త్వరగా లేచి బట్టల్ని వేసుకోండి-మీ గదిలోకి పొండి. ఇద్దరికి అనుకోకుండా బాగా నిద్రపట్టేసింది. బాత్‌రూమ్ తలుపును వేసుకోడం మరచిపోయేం. మా అమ్మ వచ్చి మనిద్దర్ని చూసి, నన్నులేపి కోపంతో ఇప్పుడే వెళ్లిపోయింది. ఈ పాటికి మా వాళ్లకు, మీ వాళ్లందరికి తెల్సిపోయుంటుంది. నా బ్రతుకు పాడయిపోయింది. నా వాళ్లందర్కి మరి నా ముఖం యెలా చూపగలను" అని ఏడుస్తున్న దానికి మళ్లే ముఖానికి రెండు చేతులు అడ్డుపెట్టుకుంది.

రామకృష్ణ యాంత్రికంగా మంచం దిగి, బట్టల్ని వేసుకొని నీలను చూస్తు, "నీల! ఐయామ్ వెరిసారి. నావల్ల పెద్ద పొరపాటు జరిగిపోయింది. ఆ మత్తులో నేనేం చేసింది నాకేమి తెలియలేదు. ఏదో భ్రమ-ఆలోచన లేని ఆవేశం నేను త్రాగడమే పెద్ద తప్పు. నాసిస్టమ్‌కి త్రాగుడేమి పడదు. మైకంలో నేనేమి చేస్తున్నది తెల్సుకోలేని పశువునైపోయాను. నన్ను క్షమించు" అన్నాడు.

"తప్పంతా మీది కాదు-నాది కొంత ఉంది. నేను ఆటంకపరుస్తే మీరలా ప్రవర్తించి ఉండకపోదురు కదా-కాని నాకు మీ మీదున్న ప్రేమ నన్ను బలహీనురాల్ని చేసేసింది. మీ ఆనందంతో నేను పాలు పంచుకున్నాను. ఆ తప్పులో భాగం నాకు వుంది" అంది దీనస్వరంతో.

"నీలా! నువ్వేమి చింతించకు. నీ జీవితాన్ని మలినం కానివ్వను. నిన్ను వివాహం చేసుకుని తప్పును ఒప్పు చేస్తాను. మీరంతా స్నానంచేసి ఫలహారం చేసుండండి. నేను, నా తల్లి, నా మేనమామ వచ్చి పెండ్లి గురించి మాట్లాడుతాం. నువ్వీలోగా మీ వాళ్లకు మనిద్దరి క్షమాపణలు చెప్పు, ధైర్యంగ ఉండు" అని చెప్పి గది తలుపుల్ని తీసుకుని తల వంచుకుని నడుచుకుంటు, తన గదిలోకి వెళ్లకుండ తొందరగ మెట్లు దిగి క్రిందభాగంలో నున్న ఆ మూడవ గదిలోకి వెళ్లి తలుపులు వేసుకున్నాడు.

రామకృష్ణ లేచింతరువాత ఏ సాకులు చెప్పి తప్పించుకుంటాడో విందామన్న ఆందోళనతో బాత్‌రూము తలుపు దగ్గర ప్రక్కగ నించున్న రమాదేవి ఆ మాటల్ని విని, తన గదిలోకిపోయి భర్తతో చెప్పింది అంతా.

"అబ్బాయి మంచివాడేనండి. తప్పునంత తన మీద వేసుకున్నాడు. మన అమ్మాయిని పెండ్లి చేసుకుంటానంటున్నాడు."

"ఆడబుద్ధి పోనిచ్చుకున్నావు కావు-పెండ్లి

### ఆహుతిమాత్రం-సంపూర్ణం

పూర్ణిమ- అని అంటారు...
పూర్ణిమ రోజునమాత్రం
చంద్రుణ్ణి పూర్ణంగా ఉంటాడని
అంటారు!
చంద్రుడు మాత్రం ఎప్పుడూ
గుండ్రంగానే ఉంటాడు.
చూచేవారి దృష్టి దోషం.
పూర్ణకుంభమని అంటారు...
కుంభంలోని నీరు పవిత్రమని
అంటారు! కానీ నీరుమాత్రం
ఎప్పుడూ పవిత్రమే.
నీటిని అపవిత్రం చేసేవారే-
అపవిత్రులు!
పూర్ణాహుతి- అనంటారు.
అదే యజ్ఞపు చివరి
భాగమంటారు.
యజ్ఞమెప్పటికైనా
అపూర్ణమే.
ఆహుతి మాత్రం
సంపూర్ణం!

-సిహెచ్. నాగేశ్వరరావు

అనేటప్పటికి తప్పు ఒప్పు అవుతుందా? కాముకుడు పెద్ద మనిషి అవుతాడా? పెండ్లి చేసుకోగానే అతడి గుణం, సద్గుణమయిపోతుందా? అతడు తొందరపాటు మనిషని తెలుస్తునే ఉంది. మన మధ్యప్రదేశ్ సంస్కృతి వేరు, వారి ఆంధ్ర సంస్కృతి వేరు. మన భోజన పద్ధతే వేరు. మన పిల్ల సర్దుకోపోగలదా?"

"ఇప్పుడేమనుకుని ప్రయోజనం లేదు. మీరిచ్చిన స్వేచ్ఛనే నీల అలా దుర్వినియోగ పర్చింది. ఎంతసేపు ఆ రామకృష్ణనే నిందిస్తారు గాని మీ సుపుత్రికను ఏమి అనరేమి అతడు తొందరపడొచ్చు, గాని అమ్మాయి కూడ అనుమతించబట్టేకదా అంతధైర్యంగా ఆ గదిలో గడపగల్గేడు. నా ఉద్దేశంలో ఇద్దరు తోడుదొంగలే."

"ఎందుకేనా మంచిది-నీల ఉద్దేశం కూడ కనుక్కో."

ఈ గొడవంత విని దేవేంద్రుడు తండ్రి గదిలోకి వచ్చేడు. సంగతంత తెల్సుకున్నాడు చిరుకోపం కల్గింది గంభీరంగ అన్నాడు

"అతిధులుగ మనల్ని ఆహ్వానించి రామకృష్ణ ఇంత ద్రోహంగ అతిథి మర్యాద చేస్తాడనుకోలేదు. మూడేళ్లుగ నాకు తెల్సిన రామకృష్ణకు, ఈ రామకృష్ణకు పోలికలే లేవు నేనే అతడి గుణాలను సరిగ అర్థం చేసుకోలేక మిమ్మల్నందర్ని ఈ రొంపిలోకి దించాను, అతడితో స్నేహం చేసి. పెద్దలు మీరిద్దరు బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి రండి ఏమైన ఈ సాయంత్రం బండికి మనమంతా రాయపూరుకు బయలుదేరాలి" అని తన గదిలోకి పోయేడు.

కాస్సేపయేక నీలతో మాట్లాడి రమాదేవి వచ్చింది-

"నీల పశ్చాత్తాపంతో ఏడుస్తున్నదండి. అందంత ఎలా జరిగిందో తన కిప్పుడంత అయోమయంగ ఉన్నదంటున్నదండి. రామకృష్ణంటే నీలకు ఇష్టమేనట. రామకృష్ణను తను పెండ్లాడతానంటున్నది. అబ్బాయి-అమ్మాయి ఇష్టపడితే మనం అభ్యంతరం చెప్పడం భావ్యంకాదు. మన పెద్దమ్మాయిని మహారాష్ట్రుడికిచ్చి వివాహం చేసేం కదా, ఈ రెండో అమ్మాయిని ఆంధ్రుడికిచ్చి చేస్తేనేం? నా ఉద్దేశంలో రామకృష్ణ చాల మంచివాడు. ఏదో యౌవ్వనోద్రేకంలో ఈ పొరపాటు చేసుండొచ్చుగాని అతనేమి వ్యసనపరుడుగ నాకు తోచడంలేదు. మనం ఈ మూడేళ్లు అప్పుడప్పుడు చూస్తున్నాంగ-అతని ప్రవర్తన ఎంతో గౌరవంగ ఉండేది కదండి. రామకృష్ణకి ఏలోటు లేదు-రూపంలోనైతేనేమి, చదువులోనైతేనేమి, ధనంలోనైతేనేమి, అతడు అన్ని విధాల యోగ్యుడనే నా భావన. అందుచేత మీరీ సంఘటనను మరచి, వారిద్దర్ని క్షమించి మరే గొడవ చేయకండి" అని భర్తకు నచ్చచెప్పింది.

సత్యజిత్ సిన్హా ఆలోచించి, సమాధానపడి శాంతించేడు. నీలకు బాగా తెల్సు తల్లి తండ్రులకు తన మీదున్న మమత, మమకారం, అందుచేత తనేమి భయంతో వణికిపోలేదు. పైగ రామకృష్ణను పొందినందుకు చాల ఉల్లాసంగ ఉంది లోన, పైన ఎంతో సిగ్గుగ కనబరుస్తు.

అందరి స్నానపానాదులయేక రామకృష్ణ నుండి కబురుకు వారు ఎదురుచూడ నారంభించేరు. కాని క్రింద జరుగుతున్న కుటుంబ పోరు వారికి తెలియదు.

రామకృష్ణ మేడ దిగిన గంటకు అందరు శాంతాదేవి గదిలో సమావేశమయ్యేరు తల్లి శాంతాదేవి శోకంతో, మేనత్త కన్నీళ్లతో, మేనమామ ఉగ్రనరసింహావతారంతో.

"అలహాబాదుకు వెళ్లేక నీ స్త్రీలోలత్వం పోయిందనుకున్నాను, గాని ఇన్నాళ్లు నివురు గప్పిన నిప్పులా నీలో రాజుకుంటునే ఉందని ఇప్పుడు తెల్సింది. ఇంతకీ నీకీదుర్బుద్ధి ఎలా పుట్టింది-ఎలా జరిగిందా సంఘటన? ఎలాగో ఆపాడు పనేదో చేసేవనుకో. తరువాత నీ గదిలోకొచ్చి పడుక్కోకుండ, అల్లుడులా ధైర్యంగా, హాయిగ ఆ గదిలో ఆ అమ్మాయితో పొద్దున్న ఏడుగంటలవరకు ఆ నిద్రేమిటిరా? నలుగురి కళ్లలోపడి నగుబాట్లు అవుతావన్న జ్ఞానంలేదు రామం?" అని మేనమామ కేకవేసేడు.

"వాడిదేంతప్పు-ఇన్నాళ్లు ఒక్కమాటేనా పడ్డాడా? ఆనంగనాచి లేదు నీల, తన తళుకు బెళుకులతో వాణ్ని లొంగదీసుకునుంటుంది. వయస్సున్నవాడు వలపులో పడ్డాడు. ఆ తండ్రికి ఇందులో పోతుంది. సాయంత్రం డిన్నర్‌కని వెళ్లేడు వాళ్లతో, అతడేదో మందు పెట్టేసుంటాడు" అని తల్లి కొడుకును వెనకేసుకొచ్చింది

"మన రాముడు అమాయకుడు ఇంత సంపదకు ఒక్కడే వారసుడు పైగ నిండుగ ఉన్నాడు. ఇట్లాంటి వాడు అల్లుడుగ దొరకొద్దు ఎన్ని తపస్సులు చేసిన. అందుకే ఈ విధంగ వాడిని వాళ్ల వశం చేసుకున్నారు" అని మేనత్త వ్యాఖ్యానించింది

"ఏ విధంగ ఇదంత జరిగిందన్నది ఇప్పుడు చర్చించి ప్రయోజనం లేదు. ఎందుకలా చేసేవు అని నిలదీసి ప్రశ్నించి, నిందించినా నేనేమి జవాబు చెప్పలేను. నా వల్ల ఆ అమ్మాయి పాడయిందన్నది వాస్తవం. అందుకు పరిహారంగానే నామెను పెండ్లాడుతాను. ఆ విధంగ నేనామెకు వస్తున్నప్పుడు మాటిచ్చేను కూడ. మీ రంతా దయచేసి నా కిందులో తోడ్పడి ఈ పెండ్లికి అనుమతించాలి" అని రామకృష్ణ వేడుకున్నాడు.

## నటన-మోడలింగ్

హిందీ చిత్రరంగంలోని ప్రముఖ నటీనటులు అటు సినిమాల్లో నటిస్తూనే యిటు అనేక రకాల ఉత్పత్తులకు మోడల్స్‌గా వ్యవహరిస్తున్నారు ఇలా మోడల్స్‌గా నటిస్తున్న నటీనటులు వాటిని ఉపయోగిస్తారా? అన్న అనుమానం రాకపోదు మోడల్స్‌గా నటించటం వరకే నట ఇలా నటించే వాళ్లలో భానుప్రియ, శ్రీదేవి, డింపుల్, దీపిక, వినోద్‌ఖన్నా తదితరులు వున్న విషయం పాఠకులకు విదితమే. చీరల అడ్వర్టైజ్‌మెంట్ నిమిత్తం మోడల్స్‌గా కనిపించే శ్రీదేవి, భానుప్రియ ఆ చీరెల ముఖం మళ్లీ చూడను కూడా చూడరట అలాగే హెయిర్ ఆయిల్స్ మోడల్‌గా నటించే దీపిక, డింపుల్ కపాడియాలు, సింథాల్ సబ్బుతో స్నానం చేస్తూ కనిపించే వినోద్‌ఖన్నాలు మళ్లీ వాటి జోలికి పోరు ఈ విషయమై ఒక నటీమణిని ప్రశ్నిస్తే -నేను డబ్బుకోసం నటిస్తున్నాను. సినిమాల్లో నటించినట్లు నేను జీవించను అని అంటోందంటే డబ్బుకోసం 'దేని'కైనా సిద్ధమే నని కదూ! మరిడబ్బు మహాత్మ్యం అలాంటిది

## ప్రణయవల్లరి

మరికాస్సేపు కోపాలు, తాపాలు, కేకలు, కన్నీళ్లు అయేక అందరు రామకృష్ణ నీలను వివాహం చేసుకుందుకు ఒప్పుకున్నారు. రాయ బారిగ నరసింహాన్ని మేడమీదకు పంపారు. ఆఖరిక్షణంలో తనూ వస్తానని రామకృష్ణ మేనమామనుఅనుసరించేడు. శాంతాదేవి ససేమిరా తను మేడమీదకు రానంది.

మేడ మీదున్న హాలులో అందరు సమావేశమయ్యారు. నీల కూడ వచ్చి కూర్చుంది. దేవేంద్రుడు తీక్షణంగ ఓసారి రమకృష్ణ ముఖంలోకి చూసి కూర్చున్నాడు రమాదేవి, సత్యజిత్ సిన్హా శాంతంగానే ఉన్నారు. నరసింహం మాట్లాడబోతుండగ రామకృష్ణ ఆగమని సంజ్ఞచేసి తను అన్నాడు-

"నిన్నరాత్రి, జరిగిన ఆ సంఘటనకు బాధ్యుణ్ణి నేనే గనుక మీ అందరికి నా క్షమాపణలు చెప్పకుంటున్నాను, క్షమించమని కోరుకుంటున్నాను."

ఎవ్వరు సమాధానమివ్వలేదు ఆఖరికి రమాదేవి అన్నది-"పొరబాటు చేయడం మానవ సహజం. దాని గురించి అంతగ బాధపడకు బాబు. ఈ దోష పరిహారమెలా చేయడమో ఇప్పుడు మనమాలోచించవల్సిన విషయం."

"అదే నేను చెప్తాను, మేమంత ఈ విషయమై చర్చించుకున్నాం మా రామకృష్ణ మీ అమ్మాయిని ప్రేమించాడని, ఆ అమ్మాయినే చేసుకుంటానంటున్నాడు. ఆఖరికి వాళ్లమ్మగారు ఒప్పకున్నారు. మా అందరికి ఈ వివాహం ఆమోదయోగ్యమే. అందుకే సిన్హాజీ! మీరు నిన్నరాత్రి సంఘటనను మరచి మీ అమ్మాయి నీలను నా మేనల్లుడు రామకృష్ణకిచ్చి త్వరలో వివాహం జరిపించమని ఈ ఇంటికి పెద్దగా మిమ్మల్ని కోరుతున్నాను" అని అందరి ముఖాలలోకి చూచేడు నరసింహం.

సిన్హా తన కూతురు వైపు చూచేడు ఉద్దేశం చెప్పమని. నీల రామకృష్ణ ముఖంలోకి చూచింది. అది గమనించిన రామకృష్ణ చిరునవ్వు నవ్వేడు. నీలకు కొండంత ధైర్యం కల్గింది. ఆనందంతో ఉప్పొంగిపోయింది, రామకృష్ణ తనకు తానుగ నీలను ఇష్టపడుతున్నందుకు.

"ఐలవ్ హిమ్ వెరీమచ్-నాకీ పెండ్లి ఇష్టమే" అంది నీల చిరునవ్వుతో రామకృష్ణను చూస్తూ.

"నరసింహంజీ! మీరు కోరినట్లే త్వరలో ముహూర్తం పెట్టించి మీకు రాస్తాను, మీరంత పెండ్లికి రావాలని నా ప్రార్థన" అన్నాడు సత్యజిత్ సిన్హా.

"రామకృష్ణ తల్లిగారు ఇవాళ మా అందరి పంక్తిన కూర్చుని భోజనం చేస్తే మాకెంతో తృప్తిగ వుంటుంది" అంది రమాదేవి.

"తప్పకుండా అలాగే చేస్తుంది, నా చెల్లెలుకు చెప్తా."

"నరసింహంజీ-మరో మాట మేమంతా ఈ సాయంత్రం రాయపూర్ ట్రైయిన్‌లో వెళ్లిపోతాం-నాకక్కడెన్నో పనులున్నాయి. మీరు కాస్త రిజిర్వేషను చేయించి పెట్టాలి-మరోలాగనుకోకండి."

"అదెంతమాట! అలాగే చేయిస్తాను, స్టేషనుకు మనిషిని పంపి" అని నరసింహం లేచేడు. సమావేశం సమాప్తమయిందని, తరువాత సత్యజిత్ సిన్హాతోను, దేవేంద్రుడితోను కరచాలనం చేసి మేడ దిగిపోయేడు.

రామకృష్ణ చెయ్యి చాపగ సత్యజిత్ సిన్హా ఆప్యాయంగ అందుకుని ఊపి వదిలేసేడు. దేవేంద్రసిన్హా లేవలేదు, చెయ్యి చాపలేదు. రామకృష్ణ స్నేహితుడి దగ్గరకు వెళ్లి-"దేవేన్! ప్లీజ్ డోంట్ జడ్జిమిరాంగ్- నేను అప్పుడు, ఇప్పుడు ఎప్పుడు నీకు తెల్సిన రామకృష్ణనే. ఏం నాతో బాంధవ్యం నీకిష్టంలేదా?" అని ప్రశాంతంగా అడిగేడు.

నీల తల్లి, తండ్రి ఆందోళనతో కొడుకు దేవేంద్రుడు వైపు చూచేరు. దేవేంద్రుడు తలెత్తి చెల్లెలు వైపు చూచేడు. ఆ సరికే నీల కండ్లు చెమ్మగిల్లేయి. ఆమె కన్నీళ్లను చూసి చలించిపోయి, దేవేంద్రుడు లేచి నించుని చిరునవ్వుతో రామకృష్ణ చేతిని అందుకుని అనురాగంతో స్నేహితుణ్ణి కౌగలించుకున్నాడు.

అందరూ హాయిగ నిట్టూర్చేరు.

## 27

ఆ సాయంత్రం వారంత ప్రయాణమై స్టేషనుకు వెళ్లినప్పుడు, అతిధులతో నరసింహం, రామకృష్ణ వెళ్లారు. శాంతాదేవి రాలేదు. ఆవిడకు భర్తపోయిన నాటి నుండి స్టేషనులకు, ఎయిరోడ్రములకు వెళ్లి వీడ్కోలు చెప్పడం లేగని నరసింహం సర్దిచెప్పేడు. శాంతాదేవికి పై రాష్ట్రానికి చెందిన యువతి తనకు కోడలిగ వచ్చి తనకు చేదోడుగ, వాదోడుగ నుండడం సుతరాము ఇష్టంలేదు. ఒక్కగానొక్క కొడుకు ఆ కొడుకు, కోడలే తనకు ఆసరాయై తన శేష జీవితాన్ని ఏ లోటు లేకుండా గడపాలని ఆమె అభిలాష.

"అట్లాంటిది-నా భాషా కాదు, నా తిండి కాదు, నా ఆచార వ్యవహారాలు అంతకన్న కావు ఆ పిల్ల నాతో ఎలా కల్సిపోగలదు?" అని వాపోయింది శాంతాదేవి.

"చూడమ్మా చెల్లీ-నువ్వు చెప్పింది నేను కాదనను. నువ్వు నీ కోడలు గురించి ఎన్నో కలలుగన్నావు, నాకు తెల్సు. కాని పరిస్థితులు ఇలా పరిణమించాయి. కానప్పుడు మనమేమి చెయ్యగలం. వాటికి అనుగుణంగ సర్దుకుపోవడం తప్ప? ఇలా జరుగుతుందని రామం ఊహించినట్లు లేదు. నా ఉద్దేశంలో వాడు చిరునవ్వుతో తిరుగుతున్నాడుగాని వాడి మనస్సులో ఏదో ఖేదం గూడు కట్టుకున్నట్లుంది."

"అయితే అన్నయ్య ఈ పెండ్లి అనివార్యమేనా, నువ్వు నీ లాయరు తెలివితేటలుపయోగించి ఈ పెండ్లి తప్పించలేవా?"

నరసింహం తలెత్తి గోడనున్న శ్రీకృష్ణుని చిరునవ్వును చిత్రపటంలో చూచి "తప్పించగలను-గాని రామకృష్ణ తను పెద్ద మనిషి వాగ్దానాన్ని ఆ అమ్మాయి నీలకిచ్చాడని, ఏ విధంగనైనా ఈ పెండ్లికి నేను, నువ్వు అనుమతించకపోయిన, పెండ్లిని చెడగొట్టిన తను మరెవ్వరికి దక్కకుండ కట్టుకున్న గుడ్డలతో దూరంగ ఎవ్వరికి తెలియని స్థలంకు పోతానని బెదిరించేడు గంభీరంగా. అందుకే వాడు కోరిన ప్రకారం పెండ్లి కానివ్వడమే మంచిది" అని సర్దిచెప్పేడు చెల్లెలి బాధను అర్థం చేసుకుని.

(ఇంకా వుంది)



# ట్రీట్‌మెంట్

చింతా రాంబాబు



ఆమెని చూశాకే బోసుబాబుకి మళ్లీ ఆడ వాళ్లమీద అభిమానం పుట్టుకొచ్చింది.

ఈ మధ్య చాలాకాలంగా వాళ్లకి దూరంగా ఉంటూ వచ్చాడు.

ఆడది కనిపిస్తే చాలు ఓ పాముని, జెర్రిని చూసినవాడిలా భయపడి దూరంగా పారిపోయేవాడు.

అలాగే ఆడది ఎదురైతే చాలు ఓ గజ్జికుక్కని చూసిన వాడిలా జుగుప్సతో మొహం తిప్పుకొనేవాడు.

అలాంటిది ఆమెని చూశాక అతనిలో ఎలాంటి వికారాలు కలుగకపోగా...

ఎలాగైనా ఆమెతో మాట్లాడాలని—

మాట్లాడి ఆమెను పేరుపెట్టి పిలిచేంత చనువు సంపాదించుకోవాలని తహతహలాడిపోతున్నాడు.

ఎలాంటి కష్టం నష్టం ఎదురైనా సరే ఆమె మనసులో తనకొక ప్రత్యేకమైన స్థానం సంపాదించాలని పట్టుదల పెరిగిపోయింది

ఆ స్థానం స్నేహితుడు కావచ్చు, ప్రేమికుడు కావచ్చుకాని ఆమెకు మాత్రం దగ్గరవ్వాలి

కళ్లు తెరిచినా, మూసినా బోసుబాబుకి ఇదే ఆలోచన.

ఆమెలోని అందం, ఆకర్షణ అతణ్ణి ప్రతీ క్షణం ఉత్తేజితుణ్ని చేస్తున్నాయి.

ఈ రెండిటిని మించి ఆమె కళ్లల్లో కొట్టవచ్చినట్టు కనిపించే నైర్మల్యం, పెదాలపై చెదరని చిరునవ్వు ఆమెకు మరింత శోభని చేకూర్చి అతన్ని మర్చిపోనివ్వడం లేదు.

బుజాన తెల్లని కోటుతో రోడ్డుమీద నడిచివెళ్తుంటే ఓ దేవతామూర్తి నడుస్తున్నదా అన్న భావం కలిగేది బోసుబాబులో.

ఆ నడకలోని హుందాకి, ఆమెలోని అందానికి ముగ్ధులై ఆమెకు ఎదురైన ప్రతీ వాళ్లు ఓ క్షణంసేపు ఆమెకేసి చూడవల్సిందే.

బోసుబాబైతే సభ్యతా సంస్కారాలు కూడా మర్చిపోయి, తదేక దృష్టితో చూసేవాడు. చూసిన ప్రతిసారి 'కుందనపు బొమ్మ' అనుకొనేవాడు.

అలాంటిది ఏ ప్రత్యేకతలేని తను ఆమె దగ్గర ఓ ప్రత్యేకత సంపాదించడం తనవల్ల అయ్యేపనేనా?

బోసుబాబుకి నీరసం ముంచుకొచ్చి టైపు చెయ్యడం ఆపుచేశాడు.

ఇలా రోజూ వచ్చి టైపు నేర్చుకోవడం అతనికి మహా విసుగ్గా ఉంది.

ఎవరికివాళ్లే ఓ మాట పలుకు లేకుండా కొంపలు మునిగిపోయినట్టు హడావుడిగా రావడం, కొట్టుకోవడం, వెళ్లిపోవడం పరమబోర్‌గా ఫీలవుతున్నాడు.

డిగ్రీలో ఇంకా రెండు సబ్జక్టులు మిగిలిపోవడంతో, ఇంట్లో ఖాళీగా కూర్చోవడం ఎందుకని, తండ్రి బలవంతంగా మూడ్నెల్లక్రితం ఈ ఇన్‌స్టిట్యూట్‌లో జాయిన్ చేయించాడు.

ఇందులో ఒక్కటే ఆనందం!

ఈ వంకతోనన్నా రోజూ ఆమెను చూడవచ్చునన్న ఉద్దేశంతో వస్తున్నాడు. లేకపోతే ఎప్పుడో మానేసేవాడు.

తన టైము ఉదయం ఎనిమిది తొమ్మిది మధ్య ఓ గంట!

అదే టైములో బుజాన తెల్లకోటుతో ఆమె ఎదురవుతూ ఉంటుంది.

తన ఉద్దేశం ప్రకారం మెడిసిన్ ఏ నాలుగో సంవత్సరమో అయిదో సంవత్సరమో చదువుతూ ఉండాలి.

ఎందుకంటే దాదాపు తనవయస్సే ఉంటుంది. ఆమెది కూడ.

అంట, ఇరవై రెండు, ఇరవై మూడు.

అలికిడికి వెనక్కి తిరిగాడు బోసుబాబు.

అప్పటికే అతని తర్వాత అమ్మాయి

నువ్వు లేస్తావా, ఛస్తావా అన్నట్లు వెనుక నిలబడి ఉంది.

దాంతో బోసుబాబు తనటైముకి అయిదు నిముషాలముందే మిషనుముందు నుండి లేచిపోయాడు.

మరుసటి రోజు బోసుబాబు ఇన్‌స్టిట్యూట్‌కి వస్తున్నప్పుడు రోజులా ఆమె ఎదురవ్వలేదు.

నిరుత్సాహంగా టైపు చేస్తూ కూర్చొన్నాడు.



ఏరోజు కారోజు ఆమెకు కొత్తగా కన్పించాలన్న తాపత్రయంతో ఓ రోజు వేసిన బట్టలు మరుసటి రోజు వెయ్యటం లేదు. పైగా ఈ రోజు మరింత అందంగా ముస్తాబై వచ్చాదు.

అంతా వృధా అయిపోయింది.

టైపు చెయ్యడం కూడా మానేసి దిగులుగా కూర్చుండిపోయాడు.

అదే సమయంలో చేతిలో ఏవో కాగితాలతో ఇన్‌స్టిట్యూట్‌లోకి ప్రవేశించింది ఆమె!

ఆమెని చూసిన బోసుబాబు క్షణం పాటు రెప్పవెయ్యటం మర్చిపోయాడు.

వెంటనే మనసులో ఎక్కడలేని సంతోషం, సంబరం చోటు చేసుకొన్నాయి.

అసలు ఆమె ఇక్కడికి ఎందుకు వచ్చినట్లు? అనుకొన్నాడు.

టైపు చెయ్యడం మాని అందరూ ఆమెనే చూస్తున్నారు.

ఆ కళ్లల్లో ఎవరికివాళ్లు ఆమె తమ దగ్గరికే వచ్చి మాట్లాడితే బాగుండునన్న కోరిక.

"ఎక్స్క్యూజ్‌మీ, ఈ లెటరు కాస్త టైపు చెయ్యగలరా?"

చూపరులకి ఆమె రూపమెంత కనువిందుగా ఉంటుందో కంఠం కూడా అంత వీనులవిందుగా ఉంది.

ఆమె అలా అడిగీ అడగడంతో బోసుబాబు ఒక్క ఉదుటున ముందుకు ఉరికాడు.

"నేను చేస్తానండీ" అంటూ ఆమె చేతిలోని కాగితాన్ని లాక్కున్నంత పని చేశాడు.

అప్పుడు ఆ ఇన్‌స్టిట్యూట్ ఓనర్ లేకపోవడంతో బోసుబాబు పని సులువై పోయింది.

ఆ క్షణంలో అందరూ తనవైపే ఈర్ష్యగా చూస్తున్నారనిపించింది బోసుబాబుకి.

అయినా లెక్క చెయ్యలేదు.

ఈ విధంగానన్నా తనామె దృష్టిలో పడాలి.

చేసిన మేలు మరువరాదన్నది లోకోక్తి.

తన ఈ చిన్న మేలు ఆమె మనసులో కలకాలం ఉండిపోవాలి.

అదే ధ్యేయంతో బోసుబాబు మిషనుముందు కూర్చొన్నాడు.

ఈ మూడేళ్లల్లో అతను నేర్చుకొన్నది అతి తక్కువ.

అయినా సాహసం చేసి కొట్టాడు.

టైపు చేసిన కాగితాన్ని తిరిగి యిచ్చేటప్పుడు ఆమె చేతి వేళ్ల అందాన్ని చూసి బోసుబాబు కళ్లు తిప్పుకోలేకపోయాడు.

ఏ చిత్రకారుడు వాటినంత అందంగా తిరిగి చిత్రీకరించలేడనిపించింది.

వేలికి ఉన్న బంగారపు ఉంగరం ఆమె శరీర ఛాయలో కలిసిపోయింది.

ఆర్తిగా ఆ చేతివేళ్లవైపు చూస్తూ కాగితాన్ని అందించేటప్పుడు అతనికి తెలియకుండానే మృదువుగా ఆ చేతివేళ్లని తాకాడు.

అంతే! బోసుబాబు చెంప 'ఛెళ్' మంది.

అతను ఆ షాక్‌నుండి తేరుకొనే లోపలే టైపు చేసిన కాగితాన్ని అతని మొహానకొట్టి ఆమె బయటికి వెళ్లిపోవడం కనిపించింది.

అంతా క్షణంలో జరిగిపోయింది.

ఆ తర్వాత బోసుబాబు మళ్లీ మామూలు మనిషి అవ్వడానికి వారం రోజులు పట్టింది.

ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్లటం కూడా మానేశాడు.

అతను తిరిగి పూర్వస్థితికి వచ్చేశాడు.

ఆడవాళ్లు కనిపిస్తే చాలు కోపగించుకొంటున్నాడు, అసహ్యించుకొంటున్నాడు.

మొత్తం ఆడజాతిమీదనే అతనిలో విపరీతమైన పగ, ద్వేషం రెండూ పెరిగిపోయాయి.

వాళ్లమీద ఎలా పగ తీర్చుకోవాలో తెలియక కక్షతో బుర్ర ఒక్కొక్కసారి వేడెక్కిపోతోంది.

తల్లిని, చెల్లిని కూడా విసుక్కోవటం ప్రారంభించాడు.

అసలు బోసుబాబు ఇలా తయారవడానికి అతనికి ఎదురైన ఒకటి, రెండు చేదు అనుభవాలే కారణం.

అప్పుడు బోసుబాబు ఇంటర్మీడియట్ రెండో సంవత్సరం చదువుతున్నాడు.

ఎకౌంట్స్‌లో మార్కులు తక్కువ రావడంతో తండ్రి ట్యూషన్ పెట్టించాడు.

అతనితోపాటు ఆ ట్యూషన్‌కి శారద అనే అమ్మాయి కూడా వస్తుండేది.

వచ్చే నలుగురయిదుగురు అమ్మాయిల్లోకి శారద అంటేనే అతను ఎక్కువ ఇష్టపడేవాడు.

అందుకు ఆ అమ్మాయిలోని తెలివి, కలుపుగోలు తనం!

ఇద్దరి మధ్య ఒకళ్లు నొకళ్లు తిట్టుకొని మందలించుకొనే చనువు కూడా ఏర్పడింది.

అలాంటిది ఓ రోజున కొత్తగా పెట్టుకొచ్చిన రిస్ట్‌వాచ్‌ని చూసి ముచ్చటపడి తీసి చూద్దామని ఆమె చేతిమీద చెయ్యివేశాడు.

అంతే! చెంప 'ఛెళ్' మంది.

'ఆడపిల్ల బుగ్గల్లాగ నీచెంపలెంత మృదువుగా ఉంటాయ్ బాబు' అన్న ఆమె అంత పెద్ద దెబ్బ ఎలా కొట్టగలిగిందో ఈనాటికీ అర్థంకాని విషయం.

నిజంగా అంత పెద్ద తప్పు చేశాడా?

ఆమెవద్ద ఉన్న చనువుకొద్దీ చెయ్యి పట్టుకొన్నాడే తప్పించి ఆ పట్టుకోవడంలో ఎలాంటి దురుద్దేశం లేదు.

మళ్లీ ట్యూషన్‌లో అందరి మధ్య తలెత్తుకు కూర్చోవడానికి అతనికి చాలా కాలం పట్టింది.

ఇలా బోసుబాబులో ఆడవాళ్లపట్ల వ్యతిరేకతకి, కోపానికి అంకురార్పణ శారద!

అలాగే డిగ్రీలో ఉండగా ఒకసారి ఫ్రెండుతో కలిసి సినిమాకి వెళ్లటం జరిగింది.

టిక్కట్లు తీసుకొని లోపలికి ప్రవేశించేసరికే సినిమా ప్రారంభమయింది.

ఒక్కసారిగా వెలుగులో నుండి లోపలికి వచ్చిన బోసుబాబుకి ఏమీ కనిపించడం లేదు.

అంతా చీకటి.

ఖాళీ సీట్లకోసం తడుముకొంటూ నడుస్తున్న బోసుబాబుకి తన చెయ్యి వెళ్లి ఎవరో మనిషి ఆకారానికి తగలడం మాత్రం తెలుసు.

అది ఆడో, మగో గూడా తెలియదు.

అంతే! ఆకారం ఒక్కసారి లేచి నిలబడి బోసుబాబు చెంప 'ఛెళ్' మనిపించింది.

"బ్రూట్! కళ్లు కనిపించడంలా? చెయ్యి ఎక్కడ తగిలిందో తెలుసా?

అప్పుడు తెలిసింది బోసుబాబుకి ఆ ఆకారం ఆడని!

పాపం! నిజంగానే బోసుబాబుకి ఏమీ కనిపించడం లేదు.

చెప్పినా వినిపించుకొనే స్థితిలో ఆమె లేదు.

హాలంతా ఓ అరగంటసేపు అల్లరి చేసి పాడేసింది.

సినిమా చూడటం మానేసి అంతా బోసుబాబు కేసి చూడటం ప్రారంభించారు.

అప్పటి బోసుబాబు పరిస్థితి వర్ణనా



శీతం.

వెళ్ళిపోదామనుకొన్న బోసుబాబు, ఫ్రెండు బలవంతంమీద అలాగే కుర్చీకి అంటుకు పోయి కూర్చున్నాడు.

అవమానంతో అతని మనసు భగభగా మండిపోతోంది.

లేచివెళ్లి ఆమెను కుర్చీలోంచి లాగి కింద పడెయ్యాలన్నంతగా మనసు రగిలి పోయింది.

తమాయించుకు కూర్చున్నాడు.

అంతలోనే హాల్లోకి ఎవరో నల్గురయి దుగురు మనుషులు రావడం వాళ్లు సర్దు కొని కూర్చొనేసరికి ఒకామె పక్కసీటు మగవాడి సీటు కావడం జరిగింది.

అప్పటికే అతను ఆ సీటులో కూర్చొని ఉన్నాడు.

అయినా వాళ్లు సర్దుకోలేదు.

మళ్లీ పక్కసీటు కూడా ఆడసీటు వచ్చేవరకూ మొత్తం లైను లైను డిస్టర్బ్ చేసిపారేశారు.

పాపం! అతను మారుమాట్లాడకుండా తలొంచుకొని వెళ్లి ఓ కొసన కూర్చు న్నాడు.

అసలే కోపంగా ఉన్న బోసుబాబుకి ఆ వచ్చిన ఆడవాళ్లపట్ల విపరీతమైన విహ్యా భావం కలిగింది.

పక్కసీటు మగవాడిసీటు అనే చూస్తు న్నారు కాని ఆ మగవాడు స్త్రీని తల్లిగా, సోదరిగా గౌరవించే మగవాడై ఉంటాడే మోనని ఎందుకు ఆలోచించరు?

మరి నిజంగా అలాంటి మగవాడే కూర్చొనుంటే, లేచి సీటు మారమన్న ప్పుడు అతను ఎంతహర్ట్ అవుతాడో ఆలోచించడానికికూడా ప్రయత్నించరు.

కక్షతో బోసుబాబు బుర్ర వేడెక్కిపో యింది.

సినిమా వదిలాక వద్దనుకొంటునే వస్తూ తనని చెంపదెబ్బ కొట్టినామె వైపు చూశాడు.

తనకన్నా పదేళ్లు పెద్దామె!

అయినా చెయ్యి తగిలింది ఓ మగవా డిది. అది చాలు చెంపదెబ్బ కొట్టడానికి!

ఆ తర్వాత ఓసారి బోసుబాబు సిటీ బస్సులో ప్రయాణం చేస్తున్నాడు.

సీట్లుఖాళీలేక కొంతమంది ఆడ,మగ కూడా నిలబడి ప్రయాణం చేస్తున్నారు.

ఆ నిలబడ్డ వాళ్లల్లో బోసుబాబు ఒకడు.

బస్సు మంచి స్పీడులో ఉండగా డ్రైవర్ ఎందుకో సడన్‌బ్రేక్ వేశాడు.

## రాష్ట్రపతిగా ఎన్టీఆర్?



కృష్ణా జిల్లాలోని, అవనిగడ్డ సమీపం లోని భావదేవరపల్లి గ్రామంలో మొన్న డిసెంబరు 28న జరిగిన పాత్రికే యుల సమావేశంలో ప్రముఖ జ్యోతిష్య శాస్త్రవేత్త శ్రీ పమిడి ఘంటం మాట్లాడుతూ, 1993వ సంవత్సరంలో శ్రీ ఎన్.టి. రామారావు రాష్ట్రపతి కాగలరని తన జోస్యంలో సవాలు విసి రారు. ఈ విషయం తాను అక్టోబరు 89లోనే చెప్పానని, ఆయన పునరుద్ఘా టించారు.

ఉత్తర, దక్షిణ భారతాలకు చెందిన మరి కొందరు జ్యోతిశ్శాస్త్రవేత్తలు కూడా యిదే విషయాన్ని యింతకు ముందు పలుమార్లు వక్కాణించారు.

ఆ కుదుపుకి జనం ముందుకి వెనక్కి పడిపోయారు.

ఆ పడటంలో సపోర్ట్‌కోసం బోసు బాబు చెయ్యి వెళ్లి సీటుకున్న ఇనుపరా డ్‌మీద పడింది.

అప్పటికే ఆరాడ్‌మీద ఓ ఆడచెయ్యి ఉంది. సరిగ్గా బోసుబాబు చెయ్యివెళ్లి ఆ చేతిమీద పడింది.

అప్పటికే రెండుసార్లు దెబ్బతినున్న భయంతో వణికి పోయాడు.

ఆమెకి సారీ చెప్దామని అనుకొం టుండగానే అతను భయపడినంత జరిగిపో యింది. క్షణంలో విసురుగా ఆ చెయ్యివచ్చి బోసుబాబు చెంపని తాకింది.

"వెధవరాస్కెల్! బస్సు ఎక్కిన దగ్గర్నుండి చూస్తున్నాను. ఏదో విధంగా నన్ను తాకాలనే నీ ప్రయత్నం. కావులిం చుకొన్నట్లే నిలబడ్డావ్! మొకానికి సిగ్గు లేదూ!"

వెంటనే వెంట వచ్చినామె కూడా అందుకొంది.

"దొంగసచ్చినోడా! ఇంటిదగ్గర నీకు అప్పలు, చెల్లెళ్లు ఎవరూ లేర్రా? వెళ్లి వాళ్లని కావులించుకో! మీదపడటానికి నాకూతురే దొరికిందా?" తిట్టడం ప్రారం భించింది.

అంతమందిలో వాళ్లిద్దరూ అలా అవ మానిస్తుంటే బోసుబాబు అలాగే నిర్లజ్జగా నిలబడిపోయాడు.

చెయ్యని నేరానికి శిక్ష అనుభవిస్తున్న ఓ నేరస్తుడిలా మౌనంగా ఉండిపోయాడు.

అది చూసి అతను కావాలనే చేశాడే మోనన్న ఉద్దేశంతో అక్కడున్న ఒకల్లిద్దరు మగవాళ్లు అతన్ని తన్నడానికి ఉద్యుక్తుల య్యారు కూడా.

అయినా బోసుబాబు తనని కానట్టే ఊరుకొన్నాడు.

అతని కళ్లు మనసు మాత్రం తనని చెంపదెబ్బ కొట్టిన అమ్మాయిమీదే ఉన్నాయి.

ఆ అమ్మాయికి నిండా పదమూడేళ్లు ఉంటాయో లేవో కూడా అనుమానమే.

అయినా తనకన్నా పదేళ్లు పెద్దవాడ్ని చెంపదెబ్బ కొట్టగలిగేంత తెగువ, సాహసం ఆమెలో ఉన్నాయి.

అందుకు ఆడజాతి మొత్తం గర్వపడా ల్సిందే!

కాని, కొట్టేముందు ఆ మగవాడి చెయ్యి కావాలని తగిలిందో, పొరపాటున తగిలిందో ఓ క్షణం ఆలోచించరు.

మగవాడి చెయ్యి తగిలింది కాబట్టి అతన్ని తిట్టెయ్యటమో, కొట్టెయ్యటమో జరిగిపోవల్సిందే!

అంతేకాని అతను తనతండ్రిలా, అన్నలా ఓ మంచి మనిషై ఉంటాడే మోనన్న ఆలోచన పొరపాటున కూడా రాదు.

వెనుక ఉన్న జనం మీద పడటంతో

ఆమెకు అతి దగ్గరగా నిలబడ్డమాట వాస్త వమే! అయినా కండక్టరు వెనక్కి, ముందుకి నడిచినప్పుడు కూడా ఆమెకు తగలకుండా అతి జాగ్రత్తగానిలబడ్డాడు.

అయినా అనుమానించింది.

బస్సులో తనచుట్టూ ఉన్న మగవా ళ్లంతా తనని తాకడానికే బస్సు ఎక్కిన వాళ్లలాగా వాళ్లకేసి ఎంతో అసహ్యంగా, చిరాగ్గా చూస్తూ నిలబడింది.

వాళ్లు ఆమెకు తోటి ప్రయాణీకుల్లా కనిపించటం లేదు. మగవాళ్లు లాగానే కనిపిస్తున్నారు. అవకాశం దొరికితే వాళ్లు మీదపడి మింగేస్తారు. చాలా జాగ్ర త్తగా ఉండాలన్న భావనే ఆ మొహంలో చూశాడు.

ఏమైతేనేం ఈ సంఘటనతో బోసు బాబు ఓ నిర్ణయానికి వచ్చేశాడు.

ఆడవాళ్లంటే అంటరాని వాళ్లు!

వాళ్లకి దూరంగా ఉండాలేకాని దగ్గర వ్వకూడదు.

అలాగే వాళ్లది ఓ ప్రత్యేక జాతి!

ఆ జాతికి మగవాళ్లమీద ప్రేమ, గౌరవం రెండూ లేవు.

అలాంటప్పుడు ప్రపంచంలో ఎక్కడా లేనిది ఈ దేశంలో మాత్రం వాళ్లు ఎందుకు పూజింపబడాలి? అర్థం లేద నిపించింది.

తనైతే వాళ్లని ద్వేషిస్తున్నాడు, అసహ్యించుకొంటున్నాడు. ఈ డాక్టరు ఆమెని చూశాక ఈ మూడ్నెల్లనుండి అతని ఆలోచనల్లో చాలా మార్పు వచ్చింది.

ఆడవాళ్లంటే ఆకర్షణ ఏర్పడింది. ఆదరణ ఏర్పడింది.

సరిగ్గా ఇదే తరుణంలో అంత ఆరా ధించిన ఆమెకూడా చెంపదెబ్బ కొట్టడంతో బోసుబాబు పరిస్థితి పిచ్చెక్కినట్టుగా ఉంది.

కనీసం ఆడకుక్క కనిపించినా రాయి పెట్టి కొట్టేయ్యాలన్నంత కసిరేగిపోయింది అతనిలో.

మళ్లీ యథాస్థితికి వచ్చేశాడు.

సరిగ్గా ఇది జరిగిన పదిరోజుల తర్వాత ఓ రాత్రి బోసుబాబుకి విపరీతమైన పంటి నొప్పి రావటంతో, పొద్దుటే హాస్పటల్‌కి బయల్దేరి వెళ్లాడు.

కొత్తచీటి రాయించుకొన్నాక రూము నెంబరు పదికి వెళ్లమంటె వెళ్లాడు.

చీటి ఇచ్చిన ఓ పావుగంట తర్వాత తనపేరుపెట్టి పిలవడంతో లోపలికి ప్రవే శించాడు.

అక్కడ కుర్చీలో ఓ ఇన్‌ఛార్జి కూర్చొని ఉన్నాడు. అతనిచుట్టూ పది,

## పదాల పరమార్థం

ఓరిమి-కూరిమి<br>
మేలిమి-తాలిమి<br>
పదాల పరమార్థం<br>
తరువుని చూచి తెలుసుకున్నాను!<br>
నిర్మలత్వం-నిష్కళంకం<br>
నిస్వార్థం-జీవ తత్వం<br>
పదాల ప్రాణరహస్యం<br>
ఝరిని చూచి తెలుసుకున్నాను!<br>
మకరందం-సుగంధం<br>
మనోల్లాసం-మౌనరాగం<br>
పదాల సౌజన్యస్ఫూర్తి<br>
విరిని చూచి తెలుసుకున్నాను!<br>
జాగృతి-ప్రకృతి<br>
నవ్యత్వం-భవ్యత్వం<br>
పదాల చైతన్యదీప్తి<br>
రవిని చూచి తెలుసుకున్నాను!!

-సి. కామేశ్వరరావు

## ట్రీట్ మెంట్

పదిహేనుమంది డాక్టర్లు నిలబడి ఉన్నారు.

ప్రతి పేషెంట్‌ను ముందుగా ఆ ఇన్‌ఛార్జి పరీక్షించి ట్రీట్‌మెంట్ కోసం ఒక్కొక్క డాక్టరుకి ఒక్కో పేషంటుని అప్పచెప్తున్నాడు.

అక్కడ నిలబడ్డ డాక్టర్లవైపు చూసిన బోసుబాబు గుండె ఆగినంత పనయింది!

డాక్టరు వచ్చి కూర్చోమని పిలుస్తున్నా స్థాణువు లా అలాగే నిలబడి పోయాడు.

ఆ నిలబడ్డ వాళ్లల్లో తనని చెంపదెబ్బ కొట్టినామె కూడా ఉంది!

ఈసారి గట్టిగా కేక పెట్టడంతో వెళ్లి స్టూలుమీద కూర్చున్నాడు.

కూర్చున్నాడే కాని మనసు మాత్రం స్థిమితంగా లేదు.

ఒకవేళ తనని ట్రీట్‌మెంట్‌కోసం ఆమెకే అప్పచెప్తే?

ఎందుకనో బోసుబాబు గుండె చల్లబ డింది.

పారిపోవాలా? ఉండాలా?

ఆమెచేత చికిత్స చేయించుకొనేకన్నా బయటికి వెళ్లి రాయిపెట్టి పన్ను చిత క్కొట్టుకోవడం మంచిదనుకొన్నాడు.

పంటికి చిన్న హోల్ ఏర్పడింది, దాన్ని క్లీన్‌చేసి పూడ్చాలని చెప్పి కనుసై గతో సరిగ్గా ఆమెనే పిల్చాడు ఆ ఇన్‌ఛార్జి.

బోసుబాబు బిగుసుకుపోయాడు.

ఏవో సలహాలిచ్చి ఆమెకు అతన్ని అప్ప గించడం జరిగింది.

ఆ క్షణంలో బోసుబాబు వెళ్లిపో వాలో, ఉండాలో తేల్చుకోలేని అయోమయ స్థితిలో పడిపోయాడు.

బుర్ర పని చెయ్యటం కూడా మానే సింది.

అదే క్షణంలో ఆమె తనవెంట రమ్మ న్నట్టుగా చిరునవ్వుతో చూసి ముందుకి నడిచింది.

ఆ నవ్వు ఎంత మనోహరంగా ఉందంటే, ఆ క్షణంలో బోసుబాబుకు ఆడవాళ్లపట్ల ఉన్న కసి ద్వేషం ఏమీ గుర్తుకి రాలేదు.

అదే చిరునవ్వు ఆమె నుండి కోరు కొన్నాడు.

ఇప్పుడు పేషెంటుగా మాత్రం దాన్ని పొందగల్గాడు.

వెళ్లి ఆమె చూపించిన కుర్చీలో కూర్చున్నాడు బోసుబాబు.

ఎప్పుడూ ఆమెని దూరంనుంచే చూసేవాడు. అలాంటిది దగ్గరకి ఆమె మరింత అందంగా ఉంది అనుకొన్నాడు.

ఓ అయిదు నిముషాల తర్వాత ట్రీట్ మెంట్ ప్రారంభమయింది.

ఈ మధ్యలో ఆమె ఏమన్నా మాట్లా డుతుందేమోనని చూసాడు.

ఉహూ! ఆమె ప్రవర్తన అప్పుడే మొద టిసారిగా తనని చూసినట్టుగా ఉంది.

ముందుగా పంటిలోపల ఉన్న పుచ్చుని క్లీన్ చెయ్యడంకోసం ఆమె ఏదో ఇన్ స్ట్రుమెంట్‌ని ఉపయోగించటం జరిగింది.

ఆ ఉపయోగించడంలో ఆమె చేతి వేళ్లు వచ్చి బోసుబాబు పెదాలపై కదల సాగాయ్.

ఆ చేతివేళ్లు తాకే ఆ రోజు చెంపదెబ్బ తిన్నాడు.

ఇప్పుడు అవే చేతి వేళ్లు తన పెదాలని నొక్కి పెట్టడానికి సైతం సందేహించడం లేదు.

బోసుబాబులో ఏదో అలజడి ప్రారం భమయింది.

అలాగే ఆ రోజు సినిమాహాల్లో చెయ్యి వెళ్లి స్తనాల్ని తాకిందని ఆమె ఎంతో ఆవే శపడింది.

ఇప్పుడు చికిత్సకోసం తల వెనక్కి వంచి కూర్చోవడంతో, ఆమె స్తనాలు వచ్చి తలని తాకుతున్నాయి.

అయినా ఆమె వెనుకాడటం లేదు.

అవసరం అయితే ఇంకాస్త ముందుకు వంగి ఏకాగ్రతతో తనపని చేసుకుపోతోంది.

ఆమె స్తనాలు ఇంకా అలా తాకుతూనే ఉన్నాయి.

కాని, తనలో ఎలాంటి వికారాలు కలుగటం లేదు.

చిన్నప్పుడు తల్లివడిలో ఉన్నప్పుడు ఆ అనుభూతులు ఎలాంటివో తెలియవు. గుర్తు లేవు.

ఇప్పుడే ఆ అనుభూతులు ఎలాంటివో తెల్సుకొంటున్నాడు.

ఆమె చూపులెంత చల్లగా ఉన్నాయో చేతులంత మృదువుగా ఉన్నాయ్. పసిపిల్లవాడి నోటిలో వేలుపెట్టినా వెంటనే తీసి వేలు తుడిచేసుకొంటారు. అలాంటిది ఆమె చేతివేళ్లు ఇంకా తననోటిలో కదలడం బోసుబాబుకి గిల్టీగా ఉంది.

వంటిలోపల తిరుగుతున్న ఇన్స్ట్రుమెంట్ ఇంకాస్త లోపలికి వెళ్లడంతో ఆ రాపిడికి పన్ను జివ్వున లాగింది.

తట్టుకోలేని బోసుబాబు చిన్నకేకతో ఆమెచెయ్యి గట్టిగా పట్టేసుకున్నాడు.

పట్టుకొన్న ఆ చేతిని ఓ నిముషం సేపు వదల్లేదు కూడా.

అయినా ఆమె విడిపించుకునే ప్రయత్నం చెయ్యలేదు.

"బాగా నొప్పి పుట్టినట్టుంది కదూ?"

ఆమె మాటల్లోని కరుణకి, కంఠంలో ధ్వనించిన బాధకి బోసుబాబు కాస్త చలించాడు.

అవునన్నట్లుగా తలూపాడు.

"ఇంకెంతసేపూ? రెండు నిముషాలు ఓపికపడితే అయిపోతోంది. ఏది నోరు తెరవండి మరి."

ఆ ఓదార్పుకి బోసుబాబు ఇంకాస్త చలించి, ఓ పసిపాపలా ఒదిగిపోయి కూర్చున్నాడు.

ఆమె అన్నట్టుగానే రెండు నిముషాల్లో పని పూర్తయిపోయింది.

బోసుబాబుకైతే అంత త్వరగా ఆమె దగ్గర్నుండి వెళ్లిపోవాలన్పించడం లేదు.

బలవంతాన కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు.

"రెండేళ్లల్ల తర్వాత మళ్లీ ఒకసారి వస్తే పర్మినెంటుగా ఉండేటట్టు పన్నుకి సిల్వర్‌కోటింగ్ ఇస్తాం, రండి" అంది నీళ్లతో చేతులు శుభ్రం చేసుకొంటూ.

తలూపాడు.

అప్పటికీ బోసుబాబుకి అడుగుముందుకు పడటం లేదు.

ఆమె ఏమన్నా రెండు మాటలు మాట్లాడుతుందేమోనన్న ఆశ అతణ్ని కదలనివ్వడం లేదు. అతనూ నోరు విప్పి మాట్లాడలేకపోతున్నాడు. భాషకందని భావం బోసుబాబుని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

అది గ్రహించిన ఆమె అతనివైపు చూస్తూ అంది, "ఆ రోజు నేను చాలా తొందరపడ్డాను. మీకు సారీ చెప్పటానికి రెండుసార్లు మీ ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చాను కూడా..."

సంతోషంతో బోసుబాబు గుండె లయ తప్పింది.

"మీరు మానేశారని తెలిసి బాధపడ్డాను..."

ఆ క్షణం వరకూ ఆమెనుండి అలాంటి ఆదరణ ఊహించని బోసుబాబు కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి.

"అయినా ఓ ఆడపిల్ల చెయ్యిపట్టుకోవడం మీ మనసుకి తప్పుగాఅనిపించలేదా?"

ఏం చెప్తాడు? మీ చేతివేళ్లు అందాన్ని చూసి తట్టుకోలేక పట్టుకొన్నానని చెప్తాడా!

"ఈ పది రోజుల నుండి కొండంత బరువు మోస్తున్నట్టుగా ఉంది నా పరిస్థితి. మిమ్మల్ని చూడంగానే సగం బరువు దిగిపోయింది. ఇప్పుడు మీరు క్షమించానంటే ఆ సగం కూడా దిగిపోతుంది" నవ్వింది.

బోసుబాబు కూడా నవ్వాడు.

"చెప్పండి మరి. లేదంటే నేను జీవితాంతం మోయాల్సి ఉంటుంది."

ఆ క్షణంలో ఆమె డాక్టరులా కాకుండా ఓ సామాన్యమైన ఆడపిల్లలాగానే కనిపించింది బోసుబాబుకి.

వచ్చేస్తుంటే "రెండేళ్లల్ల తర్వాత తప్పకుండా రండి" అంటూ హెచ్చరించి మరీ పంపింది.

ఇది జరిగిన వెంటనే, బోసుబాబు తండ్రికి ఆ ఊరు నుండి ట్రాన్స్‌ఫరయిపోయింది.

మళ్లీ ఆమెను కలవకుండానే అతను ఆ ఊరు వదిలివెళ్లిపోయాడు.

పరాయి మగాడి చెయ్యి తగిలితేనే ఎంతో అపవిత్రంగా భావించే ఈ ఆడవాళ్లే అవసరం అయితే వాళ్లకి సేవలు చెయ్యడానికి కూడా సిద్ధమేనని తెల్సుకొన్న బోసుబాబు ఇప్పుడు పూర్తిగా మారిపోయాడు.

ఇదివరకటిలా వాళ్లు ఎదురయినప్పుడు అసహ్యించుకోవడం లేదు, కోపగించుకోవడం లేదు.

వాళ్లల్లో తల్లిని, చెల్లిని చూడటమే కాదు.

వాళ్లని ప్రేమిస్తున్నాడు.!

పూజిస్తున్నాడు!!

వంటితోపాటు తన మనసుకి కూడా "ట్రీట్‌మెంట్" చేసిన ఆమె మాత్రం బోసుబాబు మనసులో 'ఆమె'గానే మిగిలిపోయింది. ○

## ఇమేజ్ పోయిన

## సల్మాన్‌ఖాన్



నటుడిగా సల్మాన్‌ఖాన్ తనకున్న కొద్దిపాటి యిమేజ్‌ను పోగొట్టుకుంటున్నాడు. టీనేజ్ రొమాన్స్ పాత్రలకు ఖాన్ తులతూగ గలడన్న చిత్ర నిర్మాతల ఆశలు అడియాసలు చేస్తున్నాడట. షూటింగ్ సమయాల్లో సల్మాన్ ప్రవర్తనే కారణమంటున్నారు. మేకప్ గదుల్ని బెడ్‌రూంలుగా తయారుచేస్తూ యూనిట్‌లోని అందరి దృష్టిలో పడుతున్నాడు సల్మాన్ ఇది తెలుసుకున్న నిర్మాతలు ఖాన్‌ను బుక్‌చేయటానికి అంత ఉత్సాహం చూపటంలేదు పాపం...సల్మాన్‌ఖాన్!



# మణికంఠుడు

## ప్రయాగ రామకృష్ణ

**ఇంతవరకూ సాగినకథ-9:** మహోన్నతమైన దాంపత్య జీవితం గురించి, ధర్మార్థకామ మోక్షాలను అనుభవించటం గురించి ప్రజలకు తెలియజేయవలసిన బాధ్యతను బ్రహ్మ తన మానసపుత్రుడైన అత్రిమహర్షిపై వుంచుతాడు. అత్రి భార్య అనసూయ పాతివ్రత్యానికి మెచ్చి త్రిమూర్తులు దత్తాత్రేయుడ్ని ప్రసాదిస్తారు. గాలవ మహర్షి కూతురు లీలాదేవిని వివాహం చేసుకున్న దత్తాత్రేయుడు మహిషివి కమ్మని లీలను శపిస్తాడు. నారదుడి సలహాపై త్రిమూర్తులు సృష్టించిన మహిషం అదృశ్యం కావటంతో మహిషి బ్రహ్మ గురించి తపస్సు చేసి వరాలు పొందుతుంది. జగన్మోహినిని పరమశివుడు కామిస్తాడు. ఫలితంగా కలిగిన మగబిడ్డను పార్వతి కైలాసం తీసుకువెళ్తుంది.

(గత సంచిక తరువాయి)

శివుడి కైలాసంలో కోలాహలంగా వుంది.

శివుడి భటులు, భక్తులు, దేవ రుషులు పండగ చేసుకుంటున్నారు. ధర్మశాస్తను ఎంత చూసినా తనివి తీరడం లేదు వాళ్ళకు. కన్నులకు అద్దుకుని మురిసి పోతున్నారు

ఎంత చక్కని వాడు!

ఎంత తీయని వాడు!

పసివాణ్ణి ఎవరి చేతిలోనూ ఒక్క నిమిషం కూడా వుండ నివ్వకుండా ఎగరేసుకు పోతున్నారు

కొంత మంది కానుక లిస్తుంటే మరికొంత మంది మంగళారతు లిస్తున్నారు కొంతమంది దీవిస్తుంటే మరికొంత మంది ముద్దులు పెడుతున్నారు

'ఈ కైలాస దీపం మా వినాయకుడికి, సుబ్రహ్మణ్యేశ్వరుడికి తమ్ము డయ్యాడు ఇంత చక్కనయ్యకు పార్వతమ్మ కడుపున పుట్టే అదృష్టం లేకపోయినా ఆవిడ చేతుల్లో పెరిగే పుణ్యానికి నోచుకున్నాడు' అంటూ ఇంకొందరు ధర్మశాస్త తల నిమిరి మెటికలు విరుస్తున్నారు

శివుడు చూస్తున్నా డిదంతా

మానవ జగత్తంతా కామం, క్రోధం, లోభం, మదం, మత్సరం, మోహం, దర్పం, అహంకారంతో సంక్షోభిస్తున్న వేళ కొండ కోనల్లో, చీకటి గుండెల్లో అరిపోవు దిరుగనట్టి జ్యోతై అజరామర ఖ్యాతై నిలిచే 'అయ్యప్ప' దివ్యరూపం స్ఫురించి మహదానంద పడ్డాడు

రోజులు గడుస్తున్నాయి

పసివాడి ఆట పాటలతో కాలమ్మే తెలీదం లేదు

ఒక రోజు నారదు డొచ్చాడు

శివుడు మహర్షికి నమస్కరించాడు

ధర్మశాస్త కూడా చిట్టి పొట్టి చేతులతో నారద మునికి వందనం చేసాడు ముని మందహాసం చేసి 'చిరంజీవ' అన్నాడు.

తరవాత శివుడి వైపు తిరిగి 'పార్వతీ పతీ ఇన్నాళ్ళకు నేను తెలుసుకున్న రహస్య మేమిటో చెప్పనా? అనుబంధాలనూ, ఆత్మీయతనూ దేవుళ్ళయినా తెంచుకోలేరు ఈ బిడ్డను పెంచడానికే మొదట మొహం ముడుచుకున్న వాడివి ఇప్పుడు గుండెల మీద ఎక్కించుకుంటున్నావు ఇది కలో వైష్ణవ మాయో తెలీదం లేదు' అన్నాడు

అది విని ధర్మశాస్త 'పెంచడ మేమిటి? నన్ను మీరు పెంచు కుంటున్నారా? అసలు నేను మీ అబ్బాయిని కానా?' అని బుంగమూతి పెట్టి తల్లి కాళ్ళను చుట్టేసు కున్నాడు

పార్వతి కళ్ళు జలదమాలిక లయ్యాయి

'ఛీ తప్పు అదేం కాదు నువ్వు మా అబ్బాయివే నీకు నేను అమ్మని– నువ్వు నాకు ముత్యాల కొండవి' అని ధర్మశాస్తను ముద్దాడింది

మా అమ్మ మంచిది బంగారు తల్లి– అన్నట్టు ఆ పసివాడు తల్లి మెడ చుట్టూ చేతులు వేసి వెనక్కి ముందుకి కాసేపు ఉయ్యాల వూగి ఆ తర్వాత గర్వంగా మహర్షి వైపు చూసి పారిజాత వనం వైపు పరుగెత్తాడు.

నారదుడు నవ్వుతూ వినమ్రగాత్రుడై 'పరమేశా! మృత్యువును కూడా జయించి ముల్లోకాలనూ పాదాక్రాంతం చేసుకోవాలన్న పేరాశతో మహిషి తపస్సు చేస్తే దానికి భయపడి బ్రహ్మదేవుడు ఎలాంటి వర మిచ్చాడో నీకు తెలుసు అయితే నువ్వూ, విష్ణువూ మహత్వ సంపన్నులు కాబట్టి మీరిద్దరూ పురుషోత్తములైనా మీ మాయా విశేషం వల్ల మీకు బిడ్డ కలిగాడు అయితే మహిషి విధించిన మరో షరతు ప్రకారం దాన్ని సంహరించే వాడు భూలోకంలో పన్నెండేళ్ళ పాటు నివసించాల్సి వుంది అందుకు ఇప్పుడు సమయం ఆసన్న మైంది. ధర్మశాస్తను నువ్వు మానవ లోకానికి పంపాలి అతను మహిషిని వధించి దేవలోకాన్ని దాని బారి నుంచి విముక్తం చేయాలి' అన్నాడు





అది వింటూనే శివుడు కళ్ళ నీళ్ళ పర్యంత మయ్యాడు 'ముక్కుపచ్చ లారని వాడు. తల్లి పెట్టే గోరు ముద్దలు తిని తన ఈడు పిల్లలతో ఆడుకో వల్సిన వాడు ఒక్కడూ ఆ భూలోకంలో వుండడమా. పద్మ నా బిడ్డను పంపను వాడు లేకుండా క్షణం కూడా వుండలేను' అన్నాడు

మహర్షి నవ్వాడు.

'ఈశా! వ్యామోహాలూ, బంధనాలూ మానవ మాత్రులకే అనుకున్నాను నీ సంగతీ అంతేనన్న మాట' అన్నాడు

శివుడు సందిగ్ధంలో పడ్డాడు

మహర్షి అది తెలుసుకుని 'పార్వతీ వల్లభా! నీ మమకారం వల్ల నీ బిడ్డని నువ్వు వదల లేకుండా వున్నావు కాని దుఃఖ భాజనమైన ఇహలోక జీవితం గడుపుతున్న వాళ్ళను సేద తీర్చేందుకు అవతరించిన



పుణ్య బాలుడితను ఇతని పైన ఎందరు ఆశలు పెట్టుకుని వున్నారో ఇతని శిరస్సు పైన ఎన్ని భారాలు మోపబడి వున్నాయో నీకు తెలియంది కాదు ఇతని శుభాగమనం కోసం భూలోకం నిరీక్షిస్తోంది నువ్వు ఆలస్యం చేయడానికి వీల్లేదు సురాధిపత్యాన్ని ఇంద్రుడికి దక్కించేందుకు, నరక బాధల నుంచి సామాన్య మానవులను విడుదల చేసేందుకు నీ బిడ్డ తరలి వెళ్తున్నాడు ఇది నీకు గర్వంగా లేదూ?' అన్నాడు

శివుడు ఉరుకున వచ్చాడు

కాదూ అవునూల మధ్య వూగిసలాడాడు హృదయంలో సంఘర్షణ రేగింది నారద మహర్షి శివుడికి నచ్చ చెప్పేందుకు రక రకాలుగా ఆలోచనలు చేశాడు ఈశా నీకు తెలియందేమీ నేను చెప్పబోవడం లేదు ఇంతకు మునుపు నువ్వు, విష్ణుమూర్తి బ్రహ్మదేవుడూ దత్తావతారం దాల్చినప్పుడు మీకో విప్రోత్తముడు గురువుగా వుండేవాడు గుర్తుందా? ఆయన పేరు రాజశేఖరుడు మీకు పరా విద్య అపరా విద్య గురించి బోధించే వాడాయన పాపం ఆయనకు సంతానం లేదు పిల్లల కోసం తపించి పోతుండే వాడు దత్తాత్రేయుడు శిష్యుడుగా చేరాక అతని బుద్ధి కుశలత, వినయ విధేయతలు, జ్ఞాన పిపాస చూసి ఇలాంటి వాడు ఒక్కడంటేఒక్కడైనా నా కడుపున బిడ్డగా పుట్ట కూడదా- అని ఆయన ఆశపడితే అప్పుడు దత్తాత్రేయు డేమన్నారు?ముందు ముందు తాను ధర్మశాస్తగా అవతరించి నప్పుడు తప్పకుండా ఆయనకు బిడ్డయి, ఆయనకు కన్నుల వెలుగై హృదయానందమై నిలుస్తానని మాటిచ్చారు

అప్పటి గురువుగారైన ఆ రాజశేఖరుడే ఇప్పుడు మానవ లోకంలో పందళ దేశాధిపతిగా, రాజశేఖర భూనాథుడుగా వున్నారు. ఆ రాజ దంపతులకు ఈ జన్మలో కూడా సంతానం లేదు ధర్మ శాస్త తన పూర్వావతార కాలంలో ఆయనకు చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకోడానికి కూడా ఇదే మంచి తరుణం' అన్నారు.

శివుడు కొంచెం ప్రసన్న వదనుడయ్యాడు నారదుడు సంతోషించి 'ఇదేకాదు




ఇంకో ముఖ్యమైన కర్తవ్యాన్ని కూడా నీ బిడ్డ నెరవేర్చాల్సి వుంది రామావతార కాలంలో దశరథ తనయుడు శ్రీరామచంద్రుడు ఉత్తర పంపా తీరాన నివసించిన శబరికి సగుణ సాయుజ్యాన్ని మాత్రమే ప్రసాదించాడు ఆవిడ శ్రీరాముని ఆదేశం మేరకు

ఇప్పుడు దక్షిణ పంపాతీరాన ఒక శబర జాతి నాయకుడికి కుమార్తెగా వృద్ధి పెరుగుతోంది ఆ తల్లి నిర్యాణ సాయుజ్యం కోరి అక్కడే ఒక కొండ శిఖరాన తీవ్ర తపస్సు చేస్తోంది శబరి కోర్కెను సఫలం చేయడానికి కూడా ఇదే తగిన సమయం ' అన్నాడు

శివుడు అప్పటికే నిర్ణయానికి వచ్చాడు ధర్మ శాస్తను దగ్గరకు పిలిచి 'నాయనా' పరోపకారమే నీ జీవితలక్ష్యం కావాలి. మానవ కళ్యాణమే నీ ఆశయం కావాలి పరోపకార మంతటి పరమ ధర్మం మరొకటి లేదు దీన జనోద్ధరణకు మించిన పరమోత్కృష్ట పుణ్యం కూడా వేరొకటి లేదు సామాన్య మానవులు దివ్య జీవనం గడిపేందుకు అవసరమైన మార్గాన్ని నువ్వు ఏర్పరచాల్సి వుందని నారద మహర్షి చెబుతున్నారు నీకూ అది సమ్మతం కావాలి నీ మార్గం శుభప్రదం కావాలని నేను కోరుకుంటున్నాను భూలోకంలో సత్యమార్గ పరిపాలన, సత్యమార్గాను వర్తన, సజ్జన సాంగత్యం యేమరుపాటు లేకుండా సాగించు నిందా దూషితమైన కర్మలన్నిటినీ విసర్జించు ఈ శరీర సహాయంతో ఎంత వరకు లోక కళ్యాణానికి పాటుపడాలో అంతవరకూ పాటు పడు అందరితోనూ మృదువుగా సంభాషించు దయాదాక్షిణ్యాలతో మెలుగు నీ చుట్టూవున్న వాతావరణాన్ని ప్రశాంత మధురం చెయ్యి

# మణికంతుడు

ఇంతకంటే నేను నీకు చెప్పగలిగింది లేదు' అని ప్రియ సుతుణ్ని గుండెలకు హత్తుకున్నాడు

ధర్మశాస్త చేతులు జోడించి 'తండ్రీ! మీ ఆశీస్సులతో నాకుశ్రీరామ రక్ష మీరాదేశించినట్టు దాన ధర్మాలూ పుణ్య కార్యాలూ చేస్తూ ధర్మ రక్షణ చేస్తూ సదా చరణతో మెలుగుతాను' అని ప్రమాణం చేశాడు

కన్నతండ్రి హృదయం ఆనందమయమై పోయింది కంఠం గద్గదమైంది. కళ్ళలో నీటిధార కదిలింది కొడుకుని దగ్గరకు తీసుకుని శిరస్సున ముద్దుపెట్టి మూర్ధం అఘ్రాణించాడు కొడుకు తండ్రి పాదాలకు మళ్ళీ మ్రొక్కి సాష్టాంగపడ్డాడు

దీర్ఘాయుష్మాన్ భవ-

* * * * * *

దక్షిణ పంపా తీరం చాలా అందమైనది నదీ తీరంలో పెద్ద పెద్ద వృక్షాలను మధుమాలతీ లతలు, మల్లె తీగలు అల్లుకుని వుంటాయి గాలి విసురుకి రాలిపడ్డ పూలు నదీప్రవాహంలో పూల తెప్పల్లా కదిలి వెళ్తుంటాయి ప్రవాహ వేగానికి నీరు పాల నురుగులు కట్టి పూలతో పాటు ముందుకు సాగుతుంటాయి

నదికి చుట్టూరా పచ్చటి గుబురుల్లాంటి అడవి ఆకాశాన్నంటే వృక్షాలతో పట్టపగలు కూడా చిరు చీకటి పందళ దేశాన్ని పాలించే రాజశేఖర మహారాజుకు ఆ పరిసరాలంటే ప్రాణం. ఏ మాత్రం వ్యవధి దొరికిన పరివారంతో అక్కడికి విహారానికి వస్తాడు పక్కనే పారుతున్న నదీ ప్రవాహపు గలగల శబ్దాలు వినడం ఆయనకు ముచ్చట ముందుగా అక్కడికి వెళ్ళి దోసిలి నిండా అమృతం లాంటి నీరు తాగి ఆ తరువాత వేట ప్రారంభిస్తాడు

ఆ రోజూ అలాగే చేశారాయన.

ఇంతలో ఆయనకు ఎక్కడి నుంచో పసివాడి ఏడుపు వినిపించింది మహారాజు తాళలేక పోయాడు పసివాడి జాడ కనుక్కోమని పరివారంలోని వాళ్ళందర్నీ తలో దిక్కుకూ పంపాడు విల్లూ బాణాలూ అందుకుని తనూ బయలు దేరాడు ఇసుక తిన్నెలు దాటి అడవిలో అడుగు పెట్టాడు

ఒకచోట ఎత్తైన మద్ది చెట్టు

ఆ చెట్టు మొదట్లో - ప్రళయంతో ప్రపంచమంతా నాశనమవుతున్న వేళ సముద్ర మధ్యాన రావి ఆకు మీద పసిపాపడై పడుకున్న వటపత్ర శాయిలా ఒక చిన్నారి నోట్లో కాలి వేళ్ళు పెట్టుకునేందుకు విశ్వప్రయత్నం చేస్తూ మధ్య మధ్యన ఏడుస్తున్నాడు

మహారాజు పరుగు లాంటి నడకతో వెళ్ళి పసివాణ్ని చేతుల్లోకి తీసుకున్నాడు

చిన్నివాడు చిరునవ్వు నవ్వాడు

(ఇంకా వుంది)

## రచయితలకి సూచనలు

ఆంధ్ర సచిత్రవారపత్రికకి పరిశీలనార్థం తమ రచనలని పంపే వారు ఈ కింది సూచనలని గమనించ కోరుతున్నాము

రచనలు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి కాగితానికి రెండు వైపులా రాసి ఉన్న రచనలని పరిశీలించటం జరగదు

పరిశీలనకి పంపే రచనలు కథలైతే 10 అరఠావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది వ్యాసాలు 3 అరఠావు పేజీలు మించరాదు వ్యాసాలు పంపేవారు వాటికి సంబంధించిన బొమ్మలు లేదా ఫోటోలు జతపరిచి పంపటం అవసరం

రచనలు స్వంత రచనలై ఉండాలి అనువాదాలు, అనుసరణలు కాపీ రచనలు పంపరాదు ఆ మేరకి రచయిత(త్రి) హామీ పత్రం రాసి సంతకం చేసి రచనతో పాటే పంపాలి

రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే రాసి ఉండాలి వ్రాత ప్రతి మీద రచయిత(త్రి) పూర్తి చిరునామా స్పష్టంగా పిన్‌కోడ్‌తో సహా రాయాలి

కథల పరిశీలనకి 1-2 నెలలు నవలల పరిశీలనకి కనీసం 6 నెలలు పట్టవచ్చును పరిశీలన అయిన తర్వాత ఏ విషయం ఆయా రచయిత(త్రు)లకి తెలియచేయటం జరుగుతుంది ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపకోరేవారు తమ రచనతో పాటె స్వంత చిరునామా కల తగినన్ని తపాలా బిళ్ళలు అతికించిన కవరు జత పంచి పంపాలి లేకపోతే వాటిని తిప్పి పంపటం సాధ్యం కాదు రచనలు తిప్పి పంపే విషయంలో తగిన జాగ్రత్త తీసుకోటం జరుగుతుంది కానీ పోస్టులో పోయే వాటి విషయంలో మేము బాధ్యతని స్వీకరించలేము వాటిపైఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు

రచనలు పంపిన వారు తమ చిరునామా మారిన సందర్భంలో వెంటనే ఆ విషయాన్ని మా కార్యాలయానికి తెలియ చేస్తూ ఒక కార్డు రాయటం అవసరం

ఉత్తరాలు, తదితర పాఠకుల శీర్షికలకి రాసే వారు కూడా తమ పేరు పూర్తి చిరునామా ఇవ్వాలి రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే ఉండాలి లేకపోతే వాటిని పరిశీలించటం జరగదు

పరిశీలనకి పంపే రచనలని సంపాదకుడు ఆంధ్ర సచిత్రవారపత్రిక గాంధీనగరం విజయవాడ - 520003" అనే చిరునామాకి పంపాలి కవరు పైభాగంలో శీర్షికపేరు రాయటం మంచిది

– సంపాదకుడు

# 1990లో క్రీడారంగం : ఒక సమీక్ష

క్రీడారంగము విచిత్రరంగం. దీనిలో సాధించిన విజయాలు, సృష్టించిన రికార్డులు అనిశ్చయమైనవి. ఈ రోజు గల ప్రతిభ రేపు యుండదు. నేడు సృష్టించిన రికార్డు మరుసటి దినం అధిగమించ బడుతుంది. గత ఏడు విజేతలు, వివిధ పోటీలలో అధిగమించ బడిన రికార్డులు యీ ఏడు నిశ్చలముగా యుండునని నమ్మకం లేదు. ఇదివరకటి సంవత్సరాలలో సాధించిన గెలుపులు, నెలకొల్పిన రికార్డులు 1990లో కోల్పోవడం మనకు తెలిసిందే.

1990లో జరిగిన వివిధ పోటీలు సమీక్షించుకుంటే వరల్డ్ హెవీ వెయిట్ బాక్సింగ్ ఛాంపియన్, ఎవరూ ఊహించనటువంటి పరిస్థితులలో ఒక గుర్తింపు లేని బాక్సర్‌చే ఓడించ బడ్డాడు. 38 ఏళ్ళ వృద్ధ ఫుట్‌బాల్ ఆటగాడు 'ఇటాలియా' 90 వరల్డ్ కప్‌లో సంచలనం సృష్టించాడు. తూర్పు జర్మనీకి చెందిన అగ్రగామి క్రీడాకారులు 'డ్రగ్స్' సేవించినట్లు ఆ దేశస్థులు బయట పెట్టుట, ఒలింపిక్ పోటీలు జరిగే స్థలములు నిర్ణయించే టప్పుడు తమ అభిప్రాయము కూడా తెలుసుకో వలసి

రోగర్‌మిల్లా






కపిల్‌దేవ్

యున్నదని క్రీడాకారులు తిరుగుబాటు, క్రికెట్ రంగంలో విప్లవం, టెన్నీసు పోటీలలో అగ్రగాముల ఓటమి, బీజింగ్ ఏషియాడ్‌లో చైనా అఖండ విజయం మొదలగునవి కనిపిస్తాయి. క్రీడారంగ బుద్ధిజీవుల ఊహకు అందనివి యీ రంగంలో అనేకం జరుగుతుంటాయి. అలాగే జరిగిన సంవత్సరం కూడా జరిగాయి.

## ప్రపంచ ఫుట్‌బాల్

గత ఏడు ప్రపంచంలోని అన్ని దేశాలలో, చిన్న పెద్ద సామాన్యుడి నుండి ధనవంతుని వరకు, స్త్రీ పురుషులు సహితం ఎంతో ఆకర్షించిన క్రీడా పోటీ ఇటలీలో జరిగిన వరల్డ్ కప్ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్. అతి చిన్న దేశాలు ఫైనలు పోటీలలో ప్రవేశించుట, సృష్టించిన సంచలనం, అనేక పోటీలు 'డ్రా'గా ముగియటం ప్రపంచ ఫుట్‌బాల్ అభిమానులలో ఆసక్తి పెంచింది. ఇదివరకు జరిగిన వరల్డ్ కప్ పోటీలవలే యీ సారి పోటీల్లో అనుకున్న ఫలితాలు కనిపించక పోవుట విశేషం. ఐర్లాండ్, ఆస్ట్రియా, కామరూన్, కోస్టారికా, స్కాట్‌లాండ్, స్వీడన్, యు. ఎ. ఇ, కొలంబియా, నెదర్లాండ్ లాంటి చిన్నదేశాలు, ఫుట్‌బాల్ ఆటకు అంతగా ప్రాముఖ్యత లేని యు. ఎస్. ఎ. ఫైనలు 24 జట్లలో యుండుట విశేషం. రెండు సెమీ ఫైనల్సు ఫలితాలు 'పెనాల్టీ షూట్ అవుట్'' వలన నిర్ణయించ బడ్డాయి. ఫైనలు ఫలితం కూడా యిదే పరిస్థితిలో, వివాదాస్పదముగా పెనాల్టీ వలన నిర్ణయించబడింది. పశ్చిమ జర్మనీ మూడవ సారి 'వరల్డ్ కప్ సోకర్' టైటిల్ గెల్చింది. క్రీడారంగ మేధావుల అంచనాలు కాకుండా కొన్ని విచిత్ర ఫలితాలు కనిపించాయి. ముఖ్యముగా 'కామరూన్' జట్టు బ్రెజిలియన్ పద్ధతిలో, శక్తివంతముగా ఆడుట ఎక్కువ ఆకర్షించినది. ఈ పోటీలలో పాల్గొన్న వృద్ధ క్రీడాకారులలో రెండవ వానిగా యున్న కామరూన్ రోగర్ మిల్లా, రిటైర్‌మెంటు తర్వాత తిరిగి ప్రవేశించి అద్భుత నైపుణ్యము సంపాదించాడు. క్రిందటిసారి విజేతలు అయిన అర్జెంటీనాపై ప్రారంభ పోటీలో కామరూన్ సాధించిన విజయం మరువలేనిది. క్వార్టర్ ఫైనలు స్థాయికి చేరిన మొదటి ఆఫ్రికా జట్టు యిది. ఐర్లాండ్ కూడా క్వార్టర్ ఫైనలుకు చేరింది. అతిచిన్న దేశం 'కోస్టా-రికా ఆఖరి 16 జట్లలో యున్నది. ఐరోపా కప్ పోటీలలో అగ్రస్థానము పొందిన ఇటలీ జట్టు ఆ దేశాన్ని ఫైనల్సుకు చేర్చలేక పోయినది. మెరడోనా ప్రకాశం తగ్గినది. స్కిలాగి ప్రతిభ కనిపించింది.

ప్రముఖ ఆంగ్ల క్రీడా పత్రిక 'వరల్డ్ సోకర్' (బ్రిటన్) జరిపిన అభిప్రాయ 'పోల్'లో ఇటాలియన్ క్లబ్ మిలాన్ ఆటగాడు మాథ్యూస్ 21.9 శాతం ఓట్లతో ప్రథమస్థానం పొందాడు. 1990 వరల్డ్ కప్ గెల్చిన పశ్చిమ జర్మనీ సారథి యతను. ద్వితీయస్థానం ఇటలీకి చెందిన సల్వెటోర్ స్కిలాగి, మూడవ స్థానం అర్జెంటినా సారధి డీగోమరడోనాలకు లభించాయి. పశ్చిమ జర్మనీ జట్టు విజయానికి రూపము యిచ్చిన

మేనేజరు ఫ్రాన్జ్ బాకన్‌బవర్ (52.7 శాతం), కోస్టారికా మేనేజరు బోరా ములిటివోనిక్ రెండవ, అర్జెంటీనా మేనేజర్ కార్లస్ బిలర్డో తృతీయస్థానం పొందారు. పశ్చిమజర్మనీ యీ ఏటి ఉత్తమ జట్టుగా, ఎ. సి. మిలాన్, కామరూన్‌లు రెండవ, మూడవ ఉత్తమ జట్టుగా ఎంపిక అయ్యాయి.

## అథ్లెటిక్స్

అథెలెటిక్ రంగంలో తూర్పు జర్మనీ ప్రతిభ యీ ఏడు తగ్గలేదు. యుగోస్లావియాలో జరిగిన ఐరోపా అథెలెటిక్ ఛాంపియన్‌షిప్‌లో 20 ఏళ్ళ క్యాట్రిన్ క్రబ్బె ఆ దేశమునకు 20 బంగారు పతకాలలో లభించిన 12 బంగారు పతకాలు గెల్పులో యున్నది. స్ప్రింట్ డబుల్, 4x100 మీ. మహిళల రిలేలో ప్రథమస్థానము గెల్చినది. 'డోపింగ్' రాక్షసియింకా అమెరికా అథెలెట్స్‌ను పట్టి పీడించుచున్నది. యు. ఎస్ ఎస్.ఎ. కు చెందిన అగ్రగామి ఎథెలెట్స్ 'డ్రగ్ పరీక్ష'లో పట్టుబడ్డారు. తూర్పు, పశ్చిమ జర్మనీ క్రీడాధినేతలు తమ దేశంలో క్రీడా యోధులకు 'డోపింగ్' బాగా అలవాటు చేసారు అని ఆ దేశస్థులే బహిరంగ ప్రకటనలు చేయుచున్నారు.స్టెరాయిడ్స్ ఉపయోగించినట్లు నిర్ధారణ అగుటతో 400 మీటర్ల ప్రపంచ రికార్డ్ హోల్డర్ బుచ్‌రేనాల్డ్స్, షాట్‌పుట్‌లో ప్రపంచ రికార్డు హోల్డర్ రాండీ బర్నస్‌ను రెండు సంవత్సరములు పోటీలలో పాల్గొన కుండా నిషేధించారు. మరొక విశేషం ప్రపంచ జావలిన్ రికార్డు నాలుగుసార్లు అధిగమించ బడుట. కామన్‌వెల్త్ గేమ్స్, యూరోపియన్ ఛాంపియన్ షిప్‌లలో స్వర్ణ పతక విజేత రెండుసార్లు అధిగమించి, యిప్పుడు నూతన 'రికార్డు హోల్డర్' అయ్యాడు.

## టెన్నిస్

టెన్నిసు రంగంలో ఏ ఒక్కరు పురుషుల, మహిళల గ్రాండ్‌స్లామ్ ఒక్కసారి మించి సాధించలేదు. 1966 నుండి యిదే పరిస్థితి ఇంత వరకు ప్రతిభ యుండియు, విజయములు పొందలేక




పోయిన అర్జెంటినాకు చెందిన మహిళ గ్యాబ్రిలా సబాటిని స్టెఫీగ్రాఫ్ పై రెండు పెద్ద పోటీలలో గెల్చినది. స్టెఫీగ్రాఫ్ వ్యక్తిగత, కుటుంబ వ్యవహారాల వలన కొంతకృంగినది. ఒక్క ఆస్ట్రేలియన్ ఓపెన్‌లో మాత్రము గెల్చినది. ఆమెతో టి దేశస్థుడు, మూడుసార్లు వింబుల్డన్ విజేత బోరీస్ బెకర్ యీ ఏడు నిస్పృహ కలిగించాడు. 30 ఏళ్ళ ఈక్విడేరియా వాసి


వెంకటపతిరాజు

ఆండ్రెస్ గోమజ్ ఫ్రెంచ్ ఓపెన్ గెల్చాడు యు. ఎస్. ఎ. 29వ సారి డేవిస్‌కప్ గెల్చినది. 1982 తర్వాత మళ్ళీ మహిళల ఫెడరేషన్‌కప్, 14 ఏళ్ళ జెనిఫర్ క్యాప్రిటీ కృషి వలన యు. ఎస్. ఎ. కు లభించింది స్వీడన్ వాసి స్టెఫెన్ ఎడ్బర్గ్- ఇవాన్ లెండెల్ పై గెల్చి వింబుల్డన్ టైటిల్ గెల్చాడు. గ్రాండ్‌స్లామ్‌కప్, ఆరు మిలియన్ డాలర్ల బహుమతి యు. ఎస్. ఓపెన్‌షిప్ సాధించిన శాంప్రాస్‌కు లభించింది. యు. ఎస్. ఓపెన్‌లో గెల్చిన అతి పిన్నవాడు ఇతను. 1989లో యితని స్థానం 81 మాత్రము.

మైక్ గ్యాటింగ్ ఇంగ్లాండు జట్టును దక్షిణ ఆఫ్రికా పర్యటనకు తీసుకొని వెళ్ళాడు. ఆ పర్యటన స్థానికుల అసమ్మతి ప్రదర్శనలు, అల్లరుల వలన మధ్యంతరముగా వమ్ము అయినది. దక్షిణాఫ్రికాలోని కొన్ని క్రీడా సమాఖ్యలు, అంతర్జాతీయ ఒలింపిక్ సమాఖ్య నిబంధనల ప్రకారం సమైక్యతకు చేసిన కృషి ఫలించలేదు.

అంతర్జాతీయ ఒలింపిక్ కమిటీ అథ్లెట్స్ కమీషన్ నార్వే లోని లిల్లీహామర్‌లో జరిగిన సమావేశములో అంతర్జాతీయ ఒలింపిక్ సమాఖ్య తీసుకొను నిర్ణయములకు ముందు తమను సంప్రదించ వలెనని కోరినది రెండుసార్లు ఒలింపిక్స్ హర్డిల్స్ విజేత ఎడ్విన్ మోసెస్, ఒలింపిక్ సమాఖ్యచే


మహమ్మద్ అజారుద్దీన్

'యదార్థములు తెలుసుకొను' బృందం సభ్యుడుగా నియమించ బడ్డాడు.

అంతర్జాతీయ ఒలింపిక్ సమాఖ్య ''డోపింగ్' ల గురించి విచారణకు కమిషన్ ఏర్పాటు చేయదలచినట్లు ప్రకటించింది.

బీజింగ్‌లో జరిగిన 11వ ఆసియా క్రీడోత్సవాలలో చైనా సంచలనాత్మక విజయాలు సాధించి యావత్తు ప్రపంచాన్ని ఆశ్చర్య పరిచింది. జపాన్, దక్షిణ కొరియాలు విఫలమయ్యాయి. మనదేశం నిస్పృహ కలిగించింది.

## మన దేశంలో ....

మనదేశం యిదివరకటి సంవత్సరాలలో, జరిగిన సంవత్సరంలో సాధించిన ప్రత్యేక విజయాలు లేవు. ఆసియా క్రీడలలో విఫలమగుట యావత్తు దేశాన్ని కదలించి వేసింది. ఏంబుల్డన్ జూనియర్ ఛాంపియన్ షిప్‌లో లీయాండర్ పియస్ విజయం పొందాడు. రామనాథన్ కృష్ణన్ తర్వాత యీ విజయం పొందన వ్యక్తి పియస్ 'పయోలీ ఎక్స్‌ప్రెస్' – 'బంగారు లేడిగా ఖ్యాతిపొందిన మన మహిళ, సియోల్

## 1990లో క్రీడారంగం

ఏషియాడ్‌లో "ఉత్తమ ఆసియా ఎథెలెట్'గా ఎంపిక అయిన మన పి. టి. ఉష బీజింగ్‌లో బంగారు పతకం సాధించలేక పోయింది అంతర్జాతీయ పోటీలలో నుండి విరమించుకున్నది. కబాడీలో మనకు ఏకైక బంగారు పతకం ఆసియా పోటీలలో లభించింది. "హర్యానా హరికేన్"గా పేరు పొందిన మన క్రికెట్ యోధుడు కపిల్‌దేవ్ చండీఘడ్‌లో 16 సెక్టర్ స్టేడియంలో శ్రీలంకతో ఆడిన టెస్టులో 376వ వికెట్టు సాధించి ప్రపంచంలో రెండవ స్థానమునకు చేరాడు బెంగళూరులో జరిగిన 'వరల్డ్ అమెచ్యూర్ బిలియర్డ్స్ ఛాంపియన్ షిప్'లో అనుకోని విధముగా మనోజ్ కొఠారి గెలుపు పొందాడు. మిజో గిరిజన బాలుడు ట్లయహం జోరంథంగా ప్రపంచ బాక్సింగ్ ఛాంపియన్‌షిప్‌లో కాంస్య పతకం సాధించాడు. ఈ పోటీలలో మనదేశం సాధించిన మొట్ట మొదటి పతకం యిది. చదరంగ యోధుడు, అంతర్జాతీయ 'గ్రాండ్ మాష్టర్' బిరుదు విజేత విశ్వనాథన్‌ఆనంద్ మన ఉత్తమ ఆటగానిగా ఎంపిక అయ్యాడు.

భారత వ్యతిరేక నినాదాల మధ్య లాహోర్ వరల్డ్ కప్ హాకీ పోటీలో మనకు ఫైర్‌ప్లే ట్రోఫీ' లభించింది. అంతకుమించి మన హాకీజట్టు సాధించిన విజయాలు లేవు.

ఆక్‌లాండ్‌లో జరిగిన కామన్వెల్త్ గేమ్స్‌లో మన సుబ్రతకుమార్‌పాల్ అనే వెయిట్ లిఫ్టర్ 'డోపింగ్' చేసాడు అని నిర్ధారణ కాబడుట వలన బయటికి పంపివేయ బడ్డాడు. ఇటువంటి దుస్థితి మన క్రీడారంగంలో యిదివరలో లేదు.

## క్రికెట్

క్రికెట్‌లో మనదేశ జట్టునకు నూతన సారథిగా తెలుగు వాడు అజారుద్దీన్ నియమించ బడ్డాడు. గత రెండు ఏళ్ళలో మొదటి సారిగా శ్రీలంకపై చండీఘడ్‌లో ఆడిన టెస్టుపోటీలో విజయం లభించింది. "బాల మాంత్రికుడు" సచిన్ టెండూల్కర్ ప్రపంచ క్రికెట్ రంగంలో ధృవతారగా ప్రకాశించుచున్నాడు. పశ్చిమ గోదావరి జిల్లాలో పుట్టిన సాగి లక్ష్మి వేంకటపతిరాజు టెస్టు ఆటగాడు అయ్యాడు.

జాతీయ ఒలింపిక్ సమాఖ్య రెండుగా చీలిపోయి, కోర్టు ఎక్కినది. మనకు క్రీడాభివృద్ధికన్న పదవులు ముఖ్యము అని మరొకసారి దీనివలన నిరూపించ బడింది.

## వెయిట్‌లిఫ్టింగ్

జరిగిన సంవత్సరములో తెలుగు వారు చెప్పుకో తగిన ముందంజ ఏమి వేయలేదు. బీజింగ్ ఏషియాడ్‌లో శ్రీకాకుళం వాసి ఎన్. లక్ష్మి వెయిట్ లిఫ్టింగ్‌లో పాల్గొని అయిదవ స్థానం పొందినది.

తెలుగు క్రీడాసమాఖ్య అధినేతలు, నిర్వాహకులు మన క్రీడా రంగానకు రాష్ట్ర ఒలింపిక్ సమాఖ్య పెత్తనంలో సమాధి కట్టారు. తెలుగువారు గర్వించ తగిన ఒక్క విజయం కూడాలేదు.

–ముకరమ్

# పిత్త కోశం శస్త్ర చికిత్సలో లాపరోస్కోపిక్ టెక్నిక్

అమెరికాలో ప్రతి సంవత్సరం పిత్తాశయంలో రాళ్ళు (గాల్ స్టోన్స్), పిత్తకోశం (గాల్ బ్లాడర్)ను తొలగించబడే ఆపరేషన్ చేయించుకునే వారి సంఖ్య దాదాపు అయిదు లక్షలు ఇప్పుడు అటువంటి వారి సౌకర్యార్థం సునాయాసంగా చేయబడే "లాపరోస్కోపిక్ కొలెసిస్టెక్టమీ" అనబడే ఒక క్రొత్త సాంకేతిక విధానం అమలులోకి వచ్చింది ఈ విధానం మామూలుగా చేసే శస్త్రచికిత్స విధానం కన్నా ఆరోగ్య పరంగానూ, ఆర్థిక పరంగానూ కూడా మేలైనది అంటున్నారు వైద్యులు

శస్త్ర శాస్త్ర నిపుణులు పిత్తకోశం తొలగించడానికై లాపరోస్కోపిక్ టెక్నిక్‌లో పొట్ట కోయాల్సిన అవసరం లేదు. పొట్టపై చాలా చిన్న చిన్న గాట్లు పెట్టి వాటి గుండా లాపరోస్కోపిక్ యంత్రాన్ని చొప్పిస్తారు ఈ యంత్రంలో ఒక దీపం, లోపల అవయవాల్ని 16 ఇంతలు పెద్దదిగా చేసి చూపే కెమెరా ఉంటాయి శస్త్ర చికిత్సకై వాడబడే పరికరాలను కూడా ఈ గాట్ల గుండా లోపలికి పంపిస్తారు. ఈ లాపరోస్కోప్‌ని ఒక వీడియో మోనీటర్‌కి కలిపి, వీడియో మోనీటర్‌లో చూస్తూ శస్త్ర చికిత్సను చేస్తారు శస్త్ర చికిత్స పరికరాలను పొట్టపై పెట్టిన గాట్ల గుండా లోపలికి పంపించడానికి చాలా నైపుణ్యం, సామర్థ్యం కావాలి

అతి శీఘ్రంగా జరిగే, నైపుణ్యంతో కూడిన ఈ పద్ధతిలో ఆపరేషన్‌కి ఒక గంట కన్నా ఎక్కువ పట్టదు. కొంచెం సేపు ఆస్పత్రిలో వుండి రోగి ఇంటికి వెళ్ళిపోవచ్చు.

ఇది వరకటి పద్ధతి ప్రకారం అయితే పొట్టపై ఆరు అంగుళాల కోత వలన రోగి ఒక వారం రోజులు ఆస్పత్రిలో వుండి, తరువాత కూడా పొట్టలోని కండరాలకు కలిగిన గాయం మానడానికై ఆరు వారాలు విశ్రాంతి తీసుకోవాల్సి వుండేది అంతేగాక లాపరోస్కోపిక్ కొలెసిస్టెక్టమీ వల్ల పొట్టలోని కండరాలను ఎక్కువగా చెక్కాల్సిన అవసరం వుండదు ఆపరేషనానంతరం చిన్న చిన్న గాట్లను కుట్టి చిన్న బేండేజి వేస్తారు ఇందువల్ల రోగి ఒక వారంలో యధావిధిగా తన పని తాను చేసుకోగలుగుతాడు

పిత్తకోశం జీడిమామిడి ఆకారం గల నాలుగు అంగుళాల తిత్తి లివర్‌లో తయారైన పైత్య రసం (బైల్) ఇందులో నిల్వ వుంటుంది భోజనానంతరం జీర్ణక్రియలో తోడ్పడటానికై ఇది విడుదల కాబడుతుంది కొన్నిసార్లు రాళ్ళు పిత్తకోశంలో తయారయి పిత్తాశయ నాళంలో అడ్డుకొని విపరీతమైన మంట కలుగజేసి, ఒక్కోసారి ప్రాణాంతకం అవుతుంది చిన్న రాయి గాల్ బ్లాడర్ నుంచి వస్తూ ప్రధాన పిత్తాశయ నాళం (మెయిన్ బైల్ డక్ట్)లో అడ్డుకుంటే కలిగే ఫలితమే ఒళ్ళంతా పచ్చగా మారే కామెర్ల వ్యాధి ఒక్కో సారి వ్యాధిగ్రస్తమైన పిత్తకోశాన్ని, పిత్తాశయ రాళ్ళను కూడా ఆపరేషన్ చేసి తీసి వేయాల్సి వస్తుంది

స్త్రీలలో సంతానోత్పత్తి సమస్యలనుకనుగొనడానికై లాపరోస్కోపిక్ టెక్నిక్ చాలా రోజుల నుంచి వాడుకలో వుంది. దీనిని అపెండిసైటిస్, జీర్ణకోశ ఆపరేషన్లలో కూడా వాడుతున్నారు. ఇటీవల నెలల్లో కొందరు శస్త్ర నిపుణులు మూత్ర పిండాలను తీసి వెయడానికి కూడా ఈ టెక్నిక్‌ని వాడుతున్నారు కొందరు హార్ట్ ఆపరేషన్‌లలో కూడా ఈ టెక్నిక్‌ని వాడటానికై పరిశోధనలు జరుపుతున్నారు

శస్త్ర శాస్త్ర నిపుణులు ఈ లాపరోస్కోపిక్ టెక్నిక్ పై పరిశోధనలు జరిపి ఈ టెక్నిక్‌లో క్రొత్త పరికరాలను కనుగొని ఇతర ఆపరేషన్లలో కూడా దీని వాడుకను విస్తృతం చేయాల్సిన అవసరం ఇంకా ఎంతైనా వుంది

మనదేశంలో స్త్రీలకు చేసే కుటుంబ నియంత్రణ ఆపరేషన్లలో లాపరోస్కోపిక్ టెక్నిక్‌ని ఎక్కువగా వాడుతున్నారు

– ప్రమీల




పొట్టపై పెట్టిన చిన్న గాట్ల ద్వారా లాపరోస్కోప్‌ని, శస్త్ర చికిత్స పరికరాలను రోగి పొట్టలోనికి చొప్పించి ఆపరేషన్ చేయు విధాన దృశ్యం

సీరియల్

# భారత మహాకవిత్రయం

భాగవతుల సుబ్రహ్మణ్యం

**ఇంతవరకూ సాగినకథ-13:** చాళుక్య ప్రభువు రాజరాజ నరేంద్రుల కుల బ్రాహ్మణుడు నన్నయ భట్టారకుడు మహామంత్రి వజ్జియ, నన్నయల సలహాపై రాజరాజ నరేంద్రుడు విజయాదిత్యుడిపై యుద్ధానికి సన్నద్ధమవుతాడు. సోమేశ్వర త్రైలోక్యమల్లుడు రాజ్యబహిష్కరణ చేసిన నారాయణభట్టు-నన్నయ ద్వారా రాజాశ్రయం సంపాదించి అగ్రహారాలు దానంగా పొందుతాడు. అధర్వణాచార్యుడి-శాపం మూలంగా చీదమార్యుడు ఉన్మత్తుడవుతాడు. నన్నయ్య రచించిన ఆంధ్ర మహాభారతంలోని కొన్ని పర్వాలను రాజరాజ నరేంద్రుడు విని సంతృప్తి చెందుతాడు. త్రైలోక్యసోమేశ్వరుడు-రాజరాజ నరేంద్రునితో పోరుకు సిద్ధమవుతాడు. యుద్ధభూమిలో నన్నయ్య మరణవార్త రాజరాజ నరేంద్రుని కృంగదీస్తుంది

(గతసంచిక తరువాయి)

## 45

జ్యేష్ఠ మాసం ఎండ నిప్పుకణాల్ని వెదజల్లుతోంది

చిత్రకూట దుర్గం ప్రాంతంలో కుమార విక్రముడు, వేగి చోళ యువ సామ్రాట్టు కుళోత్తుంగుడికి గట్టి ప్రతిఘటన ఇస్తున్నాడు.

నెలన్నరకు పైగా ముట్టడి సాగుతోంది..

ఆ యుద్ధం ఒక పక్క కుళోత్తుంగుడి సహనాన్ని పరీక్షిస్తూంటే పులిమీద పుట్రలా, చోళరాజ్యం మీదకి చేదిరాజు యశఃకర్ణ దేవుడు దండెత్తి వస్తున్నాడని వేగులు వార్తలు తెచ్చారు.

వానప్రస్థాశ్రమంలో శేష జీవితాన్ని గడుపుతున్న పినమామ రాజేంద్రదేవుని అభ్యర్థిస్తూ, రాత్రికి రాత్రే లేఖ రాయించాడు కుళోత్తుంగుడు.

ఫలితంగా-రాజేంద్ర దేవుడు, రాజ్యరక్షణ కోసం మళ్లీ ఖడ్గధారణ చెయ్యక తప్పలేదు.

ఆయన ఆ పర్య సంసారబంధ రీత్యా చేపట్టలేదు. రాజ్యంలో సామాన్య ప్రజల ధన మాన ప్రాణ రక్షణార్థం తప్పనిసరి పరిస్థితుల్లో చెయ్యవలసివచ్చింది.

నిజానికి యశఃకర్ణదేవుని సేనావాహిని మాత్రమే అక్కడ విరుచుకుపడింది. ఈ లోగా విజయాదిత్యుడి ప్రత్యేక పథకం ప్రకారం చక్రకూటంలో త్రికళింగాధిపతి ధారావర్ష దేవుడు, కావాలనే తిరుగుబాటుసృష్టించాడు. అతడొక సామంతరాజు మాత్రమే!

రాజరాజ నరేంద్రుడు కర్ణాటసేనాని మధుసూదనుడ్ని, కొల్లిపాక వైపు నుంచి చక్రకూటం వైపు తరుముతూ వెళ్లడానికి నిశ్చయించుకున్నాడు.

* * * *

నన్నయ మరణంతో నారాయణభట్టు సర్వం కోల్పోయిన వాడిలా, ఎప్పుడు చూసినా దైన్యంగా వుంటున్నాడు. అన్యమనస్కంగానే దైహిక వ్యాపారాలు నిర్వర్తిస్తున్నాడు.

నెలలు గడిచినా దిగులు తగ్గలేదతడికి.

నన్నయ సహాయంతో కుపమకు ఘనంగా వివాహం జరిగిపోయినందువల్ల, ఆ బాధ్యత కూడా ఏనాడో తీరిపోవడంతో ఇష్టసఖుడ లేని ఆ రాజ్యంలో వుండడానికి నారాయణ భట్టు ఇచ్ఛగించలేకపోతున్నాడు.

దానికి తోడు రాజ్యంలో నిరంతర యుద్ధాల వల్ల మత వైషమ్యాలు పెచ్చు పెరిగిపోయాయి. పరోక్ష పీడన అధికమైంది.

స్వదేశమైన కన్యాకుబ్జానికి వెళ్లిపోదామనుకున్నాడు భట్ట నారాయణుడు. .

ఇటీవలే తాను 'వేణీ సంహారం' నాటకం ప్రారంభించాడు. ఇంతలోనే విధి బలీయమై మిత్రసంహారం జరిగిపోయి, తన రచనకు విఘాతం ఏర్పడింది మిత్ర వియోగానికి తట్టుకోలేక నివాళిగా, సంస్కృత ప్రాకృత పైశాచీ భాషలు మూడింటిలోనూ ఆశువుగా ఒక 'శోక కావ్యం' వెలయించాడు.

మనస్సు గట్టి చేసుకుని గంటం తీశాడంటే చాలు! కళ్ల ఎదుట అస్పష్టంగా-లీలామాత్రంగా మిత్రుడి రూపం... కళ్ళకు కట్టినట్టు కన్పిస్తోంది... బాష్పధారలు కమ్ముకొస్తున్నాయి...

"భట్ట నారాయణస్యాధి కృతి మధినవం..

'వేణీ సంహారం' నామ నాటకం ప్రయోక్తు ముద్యతాః. ."

అని సూత్రధారుడి చేత పలకించినదాది నన్నయతో ఆ విషయం తీరిగ్గా ప్రస్తావిద్దామనుకున్నాడు. మిత్రుడితో చర్చించి రసవత్తరంగా తీర్చిదిద్దాలనుకున్నాడు. కొన్ని పాత్రల చిత్రణలో నన్నయ సలహాలు తీసుకుందామనుకున్నాడు. ముఖ్యంగా యుధిష్ఠిరుని పాత్ర. రాజ

నీతిజ్ఞత జోడించి ఆ పాత్రౌన్నత్యం మిగిలిన వాటిపై ప్రభావం చూపించేలా చెయ్యాలన్న ఆలోచనతోనే ఇంతకాలం గడిచిపోయింది.

వంగదేశ ప్రభువు జగునాదిశూరుడు తమ దేశం రమ్మని కబురంపాడు. ఆ ప్రభువు ఆహ్వానం మన్నించి వెళ్లిపోతేనో?...

ప్రదేశ పరంగా దూరం జరిగినంత మాత్రాన, మానసికంగా ఆలోచనలు మిత్రుని వీడి సంచరించగలవా?...

కాల స్థలమార్పు తనకు కావాలి...

డోలాందోళిత మనస్కుడై పరిపరి విధాల యోచించాడు. చివరికి దేశాంతర గతుడై వెళ్లడానికే నిశ్చయించుకున్నాడు.

* * * *

మహాభారత రచన అరణ్య (పర్వ) మధ్యాన ఆగిపోవడం రాజరాజును కలవరపెట్ట సాగింది. నన్నయకు దీటుగా భారత రచన కొనసాగాలంటే, ఏం చెయ్యాలా అని యోచించాడు వజ్జియతో. మహామాత్యుని సలహా ప్రకారం, నన్నయ రచనలో నిరుపమానమైనవి- మకుటాయమానమయినవి అయిన పద్యరత్నాలకు నకలు ఏర్పాటు 'అనుకృతులు' తయారించి, ఆ తాళపత్రాలను ఇతర రాజ్యాలకు పంపి 'ఈ తీరున భారతాన్ని పూరించగల వారిని, వేంగీదేశం సగౌరవంగా సమాహ్వానింపనున్నద'ని లేఖలు జత చేయించాడు. పర్వానికొక పద్యాన్ని మచ్చుగా ఇచ్చాడు. నన్నయ చివరి పద్యం 'శారద రాత్రులు...' ఆదిపర్వంలోని 'విందు మనంబు..' సభాపర్వంలోని 'పాదమాతంగ ' పద్యాలు నన్నయ రచనా విశేషాలకు దర్పణంగా భావించాడు రాజరాజు.

మహాభారతాంధ్రీకరణ అవిచ్ఛిన్నంగా కొన

## యశః కర్ణదేవుని యశోవర్ణనకిది మచ్చుతునక

తన తండ్రి రాజరాజ నరేంద్రుడు మరణిం చేనాటికి యువరాజు రాజేంద్ర చోళుడు (కులోత్తుంగుడు) ఆహవమల్లుని సైన్యాలు ఎదుర్కొంటున్న తరుణంలో స్వదేశం మీదకి చేదిరాజు యశః కర్ణదేవుడు దండెత్తి విజయం సాధించాడు.

ఇతడు తన 'ఖైరా' తామ్ర శాసనంలో ఇలా రాయించుకున్నాడు.

"ఆంధ్రాధీశమరంధ్ర దోర్వ్రీ సితం
స్వాఛంద ముచ్చిందతా
యేనా భ్యర్చిత భూరిభిః స భగవా
న్భీ మేశ్వరో భూషణైః
యస్యా వర్ణయ దాత్త నృత్యంహతి
భ్రూవల్లి గోదావరీ
వీర్యాణ్యున్మద హంసనాద మధురైః
శ్రోతస్వరైః సప్తభిః"

[రాజరాజు భాండాగారాన్ని కొల్ల గొట్టి మాణిక్యాభరణాది భూషణాలను తాను దక్షవాటి భీమేశునికి కాను కగా ఇచ్చినట్టు, తన కీర్తిని సప్తగోదా వర స్రవంతి తరంగాలతో నృత్యంచేస్తూ సప్తతంత్రుల మధుర స్వనంతో మదహం సలా గానం చేస్తున్నట్లు వర్ణితమై వుంది పద్యంలో]

సాగాలన్న ఆకాంక్షతో చేసిన ఈ ఏర్పాట్లు ఒక వంక పర్యవేక్షిస్తూనే మళ్లీ రణభూమి కెగాడు రాజరాజనరేంద్రుడు

* * * *

ఓబలంవాడి, గాంగవాడి రాష్ట్రాల్లో త్రైలోక్య ఆహవ మల్లుని సైన్యాలను ఎదు ర్కొంటున్న కులోత్తుంగ చోళుడికి తండ్రి వీర స్వర్గాన్నలంకరించాడన్న వార్త అశనిపాతంలా తాకింది.

చేదిరాజు యశఃకర్ణదేవుడు తన తండ్రిని నిర్జించాడని తెలిసి, క్షణం కూడా అక్కడ నిలువరించుకోలేక వేంగివైపు పయనమయ్యాడు కులోత్తుంగుడు

కాని ఈ లోగానే వేంగి ఖజానా యశః కర్ణదేవుని స్వాధీనమైంది బొక్కసంలోని మాణిక్యాభరణాది భూషణాలను, దక్షవాటి భీమేశునికి కానుగ్గా సమర్పించి వేంగీరాజుగా తనను తాను ప్రకటించేసుకున్నాడు.

కులోత్తుంగుడు మహోద్రగ ఆగ్రహావేశా లతో వేంగిని చేరేసరికి యశఃకర్ణదేవుడు పారి పోయాడు అప్పటికే రాజరాజనరేంద్రుడు మరణించి మాసం దినాలు గడిచిపోయాయి

ఈ హృదయాందోళనా భారాన్ని రెట్టింపు చేస్తూ, కులోత్తుంగుడి మీద మరో పిడుగు పాటు.

ఇక్కడినుంచి పారిపోయిన యశఃకర్ణదే వుడు, తన పినమామ రాజేంద్రదేవుడిని కూడా నిర్జించాడని తెలిసి కులోత్తుంగుడు క్రుద్ధుడయ్యాడు.

వేంగి-చోళ రాజ్యాలు రెండింటికీ ఘన కీర్తనలనద్ది తన తండ్రినీ-తన పినమామనీ పొట్టన పెట్టుకున్న యశఃకర్ణదేవుని తన కరవాలాని కెరగావించనిదే నిద్రపోనని భీషణ ప్రతిజ్ఞ చేశాడు కులోత్తుంగుడు

తండ్రి మరణం ఓవక్క కుంగదీస్తున్నా, శత్రువు తీసిన దొంగ దెబ్బలు హృదయాన్ని భస్మీపటలం చేస్తుంటే-యశఃకర్ణుణ్ణి వెంటాడి వెంటాడి త్రికళింగను దాటి, అచిరకాలం లోనే వైరిఘుడం చక్రకూటం సాధించాడు.

పూర్వం నుంచీ గజ సైన్యానికి ప్రసిద్ధి చెందిన చేది రాజ్యపు ఏనుగు మందలను అపారంగా గణించాడు కులోత్తుంగుడు

[కులోత్తుంగ చోళుని చేది విజయం 'కళిం గత్తుప్పరణి' అనే కావ్యంలో మనోహరంగా వర్ణించబడింది]

* * * *

విజయా దిత్యుడే సందు కనిపెట్టి, కులోత్తుంగుడటు చేది రాజును తరుముతూ పోగానే, రాజమహేంద్రి మీదకు దండెత్తి సుల భంగా వశపరుచుకున్నాడు ద్రాక్షారామం దగ్గ రున్న జననాథపురానికి రాజధానిని మార్చేసి, తననే రాజుగా ప్రకటించుకుని పట్టాభిషేకం కూడా జరిపించేసుకున్నాడు

వేంగి సింహాసనం అధిష్ఠించాలన్న అభి లాషను ఆ విధంగా నెరవేర్చుకున్నాడతడు

చేదిరాజును జయించి విజయ పరంపరను చవిచూస్తూ రెండేళ్ళకు-అంటే శాలివాహన శకం 985 నాటికి రాజమహేంద్రికి తిరిగి వచ్చేడు కులోత్తుంగుడు

ఆ సరికే పెద్దనాయిన విజయాదిత్యుడి పెద్దకొడుకు ఇమ్మడిశక్తివర్మ రాజ్యాన్ని ఏలు తున్నాడు

వేంగీ సింహాసనాభిలాష తీరగానే, విజ యాదిత్యుడు తన జ్యేష్ఠపుత్రుడు శక్తివర్మను సింహాసనం మీద కుర్చోబెట్టాడన్నమాట!...

కులోత్తుంగుడి దక్షిణ దేశ దిగ్విజయో త్సాహ మంతా ఇది చూసేసరికి నీరుగారి పోయింది.

రాజ్యాన్ని అనుభవిస్తున్న సవతి తమ్ముడ్ని సంహరించేదాకా తోచలేదు కులోత్తుంగుడికి.

ఇద్దరూ ద్వంద్వ యుద్ధానికి తలప డ్డారు .

విజయం వరించి వేంగి మళ్లీ కులోత్తుం గుడి పరమైంది. శక్తివర్మ ఆ యుద్ధంలో వీరగతి పొందాడు.

* * * *

కొడుకు కోసం ఎంతో శోకిస్తాడు విజ యాదిత్యుడు. అతడి హృదయాన్ని పశ్చా త్తాపం దహించసాగింది

ద్వంద్వ యుద్ధంలో శక్తివర్మను నిర్జించి అదే కోపంతో, అట్నుంచి అటే అతడి తండ్రినీ సంహరించాలని ఆవేశంగా వచ్చిన కులోత్తుంగుడ్ని విజయాదిత్యుడు ఆర్తితోనే ఆహ్వానించాడు.

"రా నాయనా! రా తండ్రీ! ఈ పాపిని కడతేర్చి, నీ కరవాలపుదాహాన్ని తీర్చుకో" అని లొంగిపోయాడు

గతమంతా జ్ఞప్తికి తెచ్చుకుని, కులోత్తుం గుని కౌగలించుకుని బాధపడ్డాడు

శత్రువీర శిరస్సులను చెండాడడంలో ఎంత కఠినుడో ఆర్త జనహృదయాలకు ఉల్లాసం కలిగించడంలో అంత సౌమ్యుడైన కులోత్తుం గుడు కరిగిపోయాడు .

తండ్రి సమానుడైన పితృవ్యుని తప్పి దాలన్నీ, స్వజనబంధుప్రీతి కొద్దీ విశాల హృదయంతో మన్నించాడు.

స్వజనులతో కలహం ఆత్మహత్యా సదృ శమని, ఇతరులతో పోరాటం వచ్చినపుడు కలిసి ఎదుర్కోవాలి తప్ప మనలోమనం కలహించుకోరాదని చెప్పి పినతండ్రి దుఃఖాన్ని బాపి వేంగీ రాజ్యాన్ని ఏలుకొమ్మని, తాను తల్లి అమ్మంగిదేవితో సహా చోళ రాజ్యానికి వెళ్లిపోయాడు కులోత్తుంగుడు

* * * *

రాజరాజనరేంద్రుని మరణంతోనే సువి శాల వేంగీ సామ్రాజ్యంలో ఒక సువర్ణా ధ్యాయం ముగిసిపోయింది.

మృదుమధుర రసభావ భాసుర నవార్థ రచనా విశారదుడై నన్నయ లోకాంతర గతు డైన నాటి నుంచే వేంగీ పతనం ప్రారంభ మైంది

## 46

"సనకాది రుషుల్ని ఉద్ధరించడానికి శివుడు 14 సార్లు ఢక్కా వాయిస్తూ ప్రత్య క్షమయ్యాడు. అప్పుడు ఈశ్వరుడు చెప్పినవే

మాహేశ్వర సూత్రాలు. భాష్యకారుడు పతంజలి నుడివిన అసలు పాణినీయశిక్ష ఏమంటోంది?" నన్నెచోడుడు స్వగతంగా అనుకుంటూనే.

"యే నా క్షర సమామ్నాయ
మధి గమ్య మహేశ్వరాత్
కృత్ స్నం వ్యాకరణం ప్రోక్తం
తస్మై పాణినయే నమః"

[మహేశ్వరుడి వల్ల అక్షర సమామ్నాయం (అఅఉ-కఖలు) పొంది, వ్యాకరణమంతా రచించిన పాణినికి నమస్కారం] అని మదిలోనే నమస్కరించి, తాను రచిస్తున్న 'కుమార సంభవం' ఒక్కసారి ఆమూలాగ్రం అనుశీలించాడు. అది శివకల్యాణగాథ.

రాజ్యవ్యాప్తంగా వీరశైవం వేళ్ళూనుకుంటున్న తరుణం...

పేరు ప్రతిష్ఠలున్న కవులంతా వైదిక మతం మీద కత్తిగట్టారు...

అంతో-ఇంతో పాండిత్యం వున్నవారు సైతం శైవారాధానాపరులయ్యారు.

అద్వైత భావం వున్న మహాకవులు వ్యాకరణాన్ని సానబట్టడానికీ-ఆంధ్ర భాషాలక్షణ నిర్దేశానికీ నడుం కట్టారు తప్ప, స్వతంత్ర రచనల జోలికి పోలేదు. 'నందికేశ్వర కృత కారిక' వంటి లక్షణ గ్రంథాలు వారికి ఆదర్శప్రాయా లయ్యాయి.

'కుమార సంభవం' కావ్యపీఠికలో తాను చాళుక్యరాజుల ప్రశంస చేసి, తెలుగుభాషను నిలిపిన వైనాన్ని ముందుగా స్తుతించాడు.

"మును మార్గ కవిత దేశం
బున వెలయగ దేశికవిత బుట్టించి తెను
గును నిలిపి రంధ్ర విషయం
బున జన చాళుక్యరాజు మొదలుగ బలువుర్"

తనతోపాటు పాల్కురికి సోమన, మల్లికార్జున పండితుడుకూడా తాను తెనుగు కావ్యాలలో సంస్కృత సమాసాలు కుప్ప తిప్పలుగా ప్రయోగించడమేకాక కన్నడ భాషా పదాలు - శృతి స్మృతి వాక్యాలు కూడా వేసుకున్నారు.

తెలుగులో సహజసిద్ధంగా వాడుకలో వున్నపదాలెన్నో సంస్కృత వ్యాకరణం ఒప్పుకోకపోయినప్పటికీ, పాల్కురికి సోమన తన 'బసవ పురాణం'లో వాడుకోలేదూ?

సర్వాంగ కచ్చంబు, నిత్యానడి. పుడమీశ, భక్తకూటువలు, సద్భక్తి సమూహి. . వంటి పదాలెన్నో విరివిగా వాడిన ఈ వీరశైవ కవులు నన్నయ 'విపులశబ్ద శాసనత్వం' మాత్రం అంగీకరించలేకపోయారు. స్వతంత్రమైన కొత్త సారస్వతోద్యమం నెలకొల్పాలన్న తపన, నన్నయ తెలుగు రీతి మీద వీర వ్యతిరేకత మహాభారతాంధ్రీకరణని ఒక మూలకి నెట్టేశాయి.

## వలపుల బంధం

గగన సామ్రాజ్యాన్నేలే
చక్రవర్తి శశాంకుడైనాసరే.....!
చివరకి ....
కొలనులోని
పగలమారి కలువభామ
కొంగుముడి
బందీయుడే కదా!

-జె.వి. లక్ష్మీరమణ

## భారతమహాకవిత్రయం

వీరశైవ కవులందరి దృష్టిలోనూ సారస్వతం గౌణం. అంటే - గుణకారి. మతమే ప్రధానం. తెలుగువారికి తెలుగుభాషలో శివ భక్తి ప్రాధాన్యత, మత ప్రాశస్త్యం బోధించడమే ప్రధాన సంకల్పం. అందుకేవారి సాహిత్యమంతా స్వమత స్థాపన - పరమత ఖండనలతో నిండిపోయింది.

చివరికి వారి వీరశైవం, చిన్నపిల్లల అక్షరాభ్యాసం వంటి సంఘటనల వర్ణనల్లోనూ ద్యోతకమైంది. తాను మాత్రం ఎందుకు వారి కంటె తీసిపోవాలి? అందుకే తాను సైతం -

"గిరి సుత తొలు పలుకుల సు
స్వర మొదవగ 'ఓం నమశ్శివాయ సదా స్మ
ద్వర దాయ నమశ్శంకర
శరణు మహాదేవ ఏవ శరణ'న జొచ్చి(న)ట్టు"

-ఎన్నో తావుల శైవం విజృంభించేలా రాశాడు.

కాళిదాసుని సంస్కృత కావ్యానికి అనుకృతే అయినా, తన 'కుమార సంభవం' స్వతంత్ర కావ్యగౌరవం పొందడానికి ఎన్ని హంగులుండాలో అన్నీ కల్పించాడు నన్నెచోడుడు.

శ్రీకారంతో కావ్యారంభం, గురువుకు అంకితమివ్వడం, ఇష్టదేవతా స్తుతి, కుకవి నింద, షష్ఠ్యంతాలెత్తుకోవడం, వర్ణనలు.... ఎన్నో అంశాలు కొత్తగా తాను కల్పించినవే!

* * * * *

మరోవైపున -

మత ప్రచారం చేస్తూ, మల్లికార్జున పండితుడు దేశం నలువమూలలా పర్యటిస్తున్నాడు. రాజ్యంలో ఏ మారుమూల విడిది చేసినా శైవం వర్ధిల్లగల అవకాశాలకు ఊపిరులూది మరీ సంచరిస్తున్న పరమశివ భక్తుడాతడు. కవిత్వం శైవమత ప్రచారం కోసం కాక, ఇతరత్రా ప్రయోగిస్తే అలాంటి వాళ్లమీద జాలి కూడా వుండకూడదనే తత్త్వం అతడిది.

ద్రాక్షారామంలో సద్విజుని ఇంటపుట్టి, జంధ్యాన్ని వదలకుండానే వీరశైవుడిగా దేశ సంచారానికి సాగి, తన 'శివ తత్త్వసారం'తో ప్రతిచోటా శివ భక్తుల్నీ - శిష్యగణాన్నీ పోగు చేసుకోసాగాడు మల్లికార్జున పండితుడు.

రుద్రమహిమ, గణసహస్రనామాలు, అమరేశ్వరాష్టకం, లింగోద్భవదేవుగద్యం - ఈ నాలుగూ దేశాటనం చేస్తూనే రాయసాగాడు.

వీరశైవమత స్థాపకుడూ - కన్నడమంత్రి అయిన బసవేశ్వరుణ్ణే సందర్శించాలన్న అభి

## కులోత్తుంగుని రాజ్యత్యాగనిరతికి నిదర్శనం

చిరకాలంగా పితృవ్యుని మానసం ఎరిగివున్నవాడవడం వల్ల కులోత్తుంగుడు సుప్రసన్నతతోనే వేంగీరాజ్యాన్ని ఏలుకొమ్మని 7వ విజయాదిత్యుడికిచ్చి వేసినట్టు బెల్లూరి శాసనంలోని ఈ వాక్యాలు చెప్తాయి:...

కులోత్తుంగుడు, విజయాదిత్యుని మరణానంతరం ఈ రాజ్యాన్ని పరిపాలించడానికి తన కొడుకు కుమార వీరచోడుని పంపిస్తూ ఇలా అంటాడట!

"మయా వేంగీ మహీరాజ్యం చోడ రాజ్యాభిలాషిణా
మత్పితృవ్యే పురాన్యస్తం విజయాదిత్య భూభుజః
నచ వంచ దశాబ్దాని పంచానన వరాక్రమః
మహీరక్ష న్మహీ నాథో దివం దేవోప గతః!!"

[తాను వృద్ధుడై, కొడుకులకు పట్టం గట్టినా కూడా విజయాదిత్యుడికి రాజ్యపాలనా భారం తప్పలేదు. ఇమ్మడి శక్తి వర్మ అకాలమరణానంతరం విజయాదిత్యుడు 15 ఏళ్లు రాజ్యం చేశాడు. అనంతరం వేంగీ సింహాసనాన్ని కులోత్తుంగుడి 3వ తనయుడు కుమార వీరచోడుడు అధిష్ఠించాడు.]

# మహాభారతంపై క్విజ్ - (2)

1. "అంబనవాంబు జోజ్జ్వల కరాంబుజ! శారదచంద్ర చంద్రికా డంబర చారు మూర్తి!........ననున్ గృపజూడు భారతీ" అనే పద్యం ఏ పర్వంలోది? ఎవరు రాశారు?
2. భారతంలో "మాలిని" అనే మారుపేరు ఎవరికుంది ?
3. విరాటరాజు భార్యపేరు ?
4. "ఆంధ్రపత్రిక"వారి నీతిపద్యం- "ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము...." అనే పద్యం రాసిందెవరు?
5. "వృద్ధుల బుద్ధులు సంచలింపవే" అనే సూక్తిని రాసినకవి?
6. దుర్యోధనుని చెల్లెలు పేరు?
7. 'భూమికంటె బరువైనదేది?' అనే యక్ష ప్రశ్నకు సమాధానం?
8. 'ధర్మవ్యాధోపాఖ్యానం' కవిత్రయంలో ఎవరు రాశారు?
9. భారతంలో ఎఱ్ఱనరాసిన మొదటి పద్యమేది?
10. ఏకచక్రపురంలో ప్రజల్ని భక్షించే రాక్షసుడిపేరు?

-డి.ఎస్.శాస్త్రి

సమాధానాలు :

1. అరణ్యపర్వం- ఎఱ్ఱన. 2. విరాటరాజు కొలువులో- ద్రౌపదికి మారుపేరు. 3. సుదేష్ణ 4. తిక్కన- శాంతిపర్వంలో. 5. నన్నయ. 6. దుస్సల. 7. తల్లి. 8. ఎఱ్ఱన. 9. "స్ఫురదరుణాంశు రాగరుచి, దొంపిరివోయి నిరస్తనీరదా వరణములై—" అనే పద్యం. 10. బకాసురుడు.

లాష అతడిది.

ఎంతో ప్రయాసపడి కన్నడం లక్ష్యలక్షణ సహితంగా నేర్చుకోవడమేగాక ప్రభులింగస్తోత్రం- బసవగీత అనే రెండు కన్నడ గ్రంథాలుసైతం రాశాడు.

ఈ శైవసాహిత్యంతోనే అతడు రాజధాని చందవోలు చేరాడు.

రెండవ వెలనాటి చోళుని పరిపాలనా సమయం.....

మత సామరస్యధోరణి అపారంగా వున్న చోళభూపతి, మల్లికార్జున పండితుడ్ని కవిగా ఆదరించాడు. విశేషంగా సమ్మానించాడు.

వాస్తవంగా అక్కడ రాజమతం బౌద్ధం.....

మతోన్మత్తత ఆవహించిన మల్లికార్జునుడీ సంగతి తెలిసుండీ, ఒకనాడు నిండుకొలువు కూటంలో - తననాదరించి ప్రభువు సమక్షంలోనే ఆస్థాన బౌద్ధ విద్వాంసులతో వాదానికి సమకట్టాడు. గెలుపోటములు తేలలేదు కాని, పరస్పర నిందతో ఆనాటి వాదం ముగిసింది.

సాయంత్రం తమ బసకు వచ్చిన దగ్గర్నుంచీ మల్లికార్జున పండితుడికి మహో ఉద్రేకంగావుంది. అతడి ప్రధాన శిష్యులు రేమయ్య - దేవయ్యలు ఈ సంగతి కనిపెట్టారు. తమ గురువరేణ్యులను నిందతోహింసించిన బౌద్ధపండిత ముఖ్యుడు బౌద్ధగురువును రాత్రికి రాత్రే దారుణంగా వధించారు వాళ్లు.

తెల్లవారింది....

బౌద్ధగురువు దీనమరణం కళ్లారా చూసిన చోళభూపతి చలించిపోయాడు.

మల్లికార్జున పండితుడిపై అనుమానంతో ప్రశ్నించాడు.

"శివద్రోహుల్ని క్షమించడం మాకు మహాపరాధం. దానికి శిక్ష మరణదండనే! ఆ శిక్ష మేమే స్వయంగా విధించాం!" అని గర్వంగా చెప్పుకున్నాడు మల్లికార్జునుడు.

ప్రభువు కోపం తారాస్థాయికి చేరింది.

"మా రాజ్యంలో మేమెంతగా పరమత సహనం పాటిస్తున్నా, తమరా విషయం గమనించక, మతమౌఢ్యంతో ఒకనిండు ప్రాణాన్ని పొట్టన పెట్టుకున్నారు. ఈ నేరానికి మీకు కళ్లు పెరికించడమే శిక్ష" అని వెంటనే ఆ శిక్ష అమలు జరిపించాడు.

అందుడైనా అతడి మూర్ఖపుపంతం విడనాడలేదు. పరమత నిరసన - స్వమత స్థాపనే ధ్యేయంగా 'శివ తత్త్వసారాన్ని' పెంచుకుంటూ 700 పద్యాలు వీరావేశంతో రాశాడు.

తెలుగుకవుల్లో కవిత్వాన్ని మతోపదేశానికి వినియోగించిన వాళ్లలో అగ్రగణ్యత తనదే కావాలనుకున్నాడు. అద్వైత మతం శైవమతాన్ని నిర్మూలింప యత్నిస్తున్న బాధ అతడ్ని అణువణువునా దహించేస్తోంది.

"స్వేచ్ఛాచారులు మిధ్యా
విచ్ఛేదన వేదశాస్త్ర విప్లవ వాదుల్
ప్రచ్ఛన్న దోషు లజ్ఞా
నాచ్ఛాదిత దుష్ట చిద్ద్వైతు లజా!"

అని అన్యమత నిరసన ప్రధానాశయంగా చేసుకున్నాడు.

తన శాఖవాడే అయిన 'పాశుపతుల' బసవేశ్వరుణ్ణే శరణు వేడి, అతడిద్వారా - తనను అంధుణ్ణే చేసిన చోళరాజు పని పట్టాలనుకున్నాడు. (శైవుల్లో రెండు ప్రధాన శాఖలు - కాలముఖులు, పాశుపతులు).

## 47

శంకరాచార్యుల అద్వైతం ముదిరి వెర్రి తలలు వేస్తున్న కాలం.

మూర్ఖపండితులతోపాటు మహామౌఢ్యం మూర్తీభవించిన మంత్రివర్యులు రాజాస్థానాల్ని శాసిస్తున్నకాలం... అటువంటివారిలో అగ్రగణ్యుడు బిజ్జలరాజు భాండాగార మంత్రి బసవేశ్వరుడు.

కర్ణాటరాజు, కాలచురి వంశీకుడు - బిజ్జలుడు. పశ్చిమ చాళుక్యులనుంచి 'వేగినాడు'ను స్వాధీనం చేసుకొని పునర్నిర్మిత పురం కల్యాణిని రాజధానిగా పరిపాలిస్తున్నాడు. (ఈ కల్యాణి నగరాన్నే, గతంలో చోళరాజు రాజాధిరాజు అగ్నికి ఆహుతి చేసింది.)

కులోత్తుంగ చోళుడు తాను చోళరాజ్యాన్ని పరిపాలించడానికే నిర్ణయించుకుని, పశ్చిమ చాళుక్యుడైన తన పిత్రవ్యుడు విజయాదిత్యుని సంతతికి చాళుక్యరాజ్యం వదిలివేశాక వేంగిలో తగిన పరిపాలనా దక్షుడు లేక రాజ్యం చిన్నాభిన్నమైంది.

[శకవర్షాలు 990 నుంచి మహాదుర్దశను చవిచూసిన వేగి, దాదాపు పందేళ్లు అధికారం అటూ ఇటూ చేతులు మారుతున్న సందర్భాల్లో మరీ హీనస్థితికి దిగజారింది.]

శకవత్సరం 1035 నుంచి 1058 వరకు బిజ్జలుడు పశ్చిమ చాళుక్యులనుంచి రాజ్యం ఆక్రమించుకుని, రాజ్య విస్తరణ చేసుకుంటూ వచ్చాడు.

శైవం వీరావేశంతో రాజ్యం నలుచెరగులా చెలరేగిపోతోందానాడు.

'శివుడొక్కడే దైవం....'

'పరదేవతల్ని నమ్మేవారూ - శివుని నమ్మనివారూ పరమ పాపులు...'

'శైవ మత ప్రచారం చెయ్యని కవి,

కవికాదు....'

-ప్రతి శైవుడికీ పురసరానా శైవపార మ్యత ప్రవహిస్తున్న ఆ తరుణంలో 'లింగ వసాయితం' అనే ఖడ్గం ధరించి బసవేశ్వ రుడు బలిమిని మతప్రచారానికి పూనుకు న్నాడు. అధికారం చేతిలో వుండడంతో మరీ చెలరేగిపోయాడు.

తన మేనమామ కూతురితో అవైది కంగా పెళ్లి జరుపుకోవడమేగాక, తన సోదరిని బిజ్జలుడికిచ్చి పెళ్లిచేసి, ముద్దుల బావమరిది అయిపోయాడు. ఇక - తన గుప్పిట్లో చిక్కాడు రాజు. 'శ్యాలకో గృహ నాశాయ' అనే నాను డివి సార్థకం చేసేలా ప్రవర్తించసాగాడు. శివసాధువులకోసం ప్రభుత్వ ధనాగారంలోంచి విశేషంగా ఖర్చుపెట్టసాగాడు.

సహజంగా బిజ్జలుడు జైనావలంబి. బాంధవ్యం కొద్దీ బావమరిది బసవన్నను మొదట్లో హెచ్చరించాడు. తర్వాత నిందిం చాడు. చివరకి దండోపాయం తప్పదనుకు న్నాడు. అది బసవన్నకు తెలిసింది. దాంతో ఒక పథకం ప్రకారం - బసవేశ్వరుడు దేశాన్ని వదిలి రహస్యంగా మైసూరు చేరుకున్నాడు. అప్పటికే బిజ్జల రాజు తనవి తీవ్రంగా నిరసిస్తు న్నాడన్న సంగతి అతడికి బాగా బోధపడింది.

అది శకవత్సరం 1088...

## భారత మహా కవిత్రయం

మతోన్మాదం పూర్తిగా తలకెక్కిన బస వేశ్వరుడు రక్తసంబంధాల్ని సైతం పరిగణింప లేకపోయాడు. తన సోదరినిచ్చి, తన చేతుల మీదుగానే కల్యాణం జరిపించిన బసవన్న తన చేతులతోనే ఆమె పసుపు కుంకుమలు తుడి చేయడానికీ వెనుకాడలేదు.

తన అనుయాయులకు రహస్యంగా ఆజ్ఞలు జారీ అయ్యాయి... వాటి ప్రకారం బసవన్న అనుచరులు, అతడి పరోక్షంలో, ఒక నాటి అర్ధరాత్రి - నిద్రిస్తున్న బిజ్జల ప్రభువుని శయ్యమీదనే వధించేశారు.

మర్నాడు దయానికే, ఆ విషయం రాజ ధానీ నగరమంతటా దావానలంలా వ్యాపిం చింది.

ప్రజలు తిరగబడ్డారు.

వీర శైవులు కూడా దక్షయజ్ఞ విధ్వం సంకాలంలో వీరభద్రుని ప్రమథగణాల్లా విరు చుకుపడ్డారు.

రాజు సైన్యం జైనమతానుయాయులు.

బసవన్న అనుచరులు వీరశైవులు -

మధ్యలో ప్రజలు....

మత మారణకాండ మహాబీభత్సంగా సాగింది.

కల్యాణి నగరం మరోసారి పీనుగులపెంట అయింది.

గృహ దహనాలు - పరమత హింసా యధేచ్ఛగా జరిగాయి.

బసవేశ్వరుని జాడ కనుక్కోవడంలో ప్రభుభక్తి పరాయణులు కృతకృత్యులయ్యారు.

ఆ తర్వాత నాలుగేళ్లకు - అంటే శకవ త్సరం 1092లో బసవేశ్వరుడికి లింగైక్యం సిద్ధించింది.

దారిలో ఇతర మతానుయాయులతో కల హించుకుంటూ బసవేశ్వరుణ్ణి దర్శింపవస్తున్న గుడ్డి 'మల్లికార్జునుడికీ' వార్తతో ఆశనిపాత మైంది.

ఎంతగానో విలపించాడతడు.

మార్గమధ్యంలో శ్రీశైలం దగ్గరే ఆగి పోయాడు.

అక్కడే వుండిపోయి, శివనామస్మరణ లోనే శేషజీవితం గడపడానికి నిర్ణయించుకు న్నాడు. బసవన్న మరణించిన కొద్ది కాలానికే అతడూ తనువుచాలించాడు.

(* మల్లికార్జున పండితుని జీవితమే 'పండితారాధ్య చరిత్ర'గాను - బసవన మంత్రి చరిత్రనే 'బసవ పురాణం'గాను రచించి, మత వ్యాప్తికోసం వారి కృషిని బృహత్తర దీక్షతో ఆ తర్వాత సాహితీ విక్షిప్తం చేశాడు పాల్కురికి సోమన)

(ఇంకా వుంది)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## "హలో! హలో!!"

త్వరలో!
అతి త్వరలో...!!

**ఇది సూపర్ లేడీ రైటర్ సువర్ణాకన్నన్ అపూర్వ సృష్టి!!**

చిక్కటి చీకటిలో ఒంటరి నక్షత్రం లాంటి రాజాగారి భవంతి!
**అందులోపల నల్లత్రాచు అంటే భీతి! భీతి! అందరి మొహాల్లో ఎనలేని భీతి! భయం! ఎనలేని భయం! ఎందుకు? ఎవరా? నల్లత్రాచు? ఏమాతని విలయ తాండవం? ఆ కాలనాగు విషపు కోరలకు రాజాబలి కావల్సిందేనా? లేకదాని పుత్కారాలకు ఎదురువున్నదా?**

పాఠకలోకాన్ని క్షణం క్షణం ఉత్కంఠతతో ముంచెత్తుతూ మీరు ఎవ్వరూ ఎదురు చూడని మలుపులతో కొసవరకూ రసవత్తరంగా అమిత వేగంగా సాగే కథా గమనంతో అత్యద్భుత సూపర్ సస్పెన్స్ సీరియల్!



త్వరలో! త్వరలో!

## "డాక్టర్లు వస్తున్నారు జాగ్రత్త!"

**డాక్టర్లను చూసి భయమేల?** ఆంధ్రసచిత్రవారపత్రిక పాఠకుల కోసం **చావా శివ కోటి** సీరియల్!

రోగుల పట్ల సేవా భావం లేని డాక్టర్లపై శివకోటి ధ్వజమిది!
**అమాయక జనాలకు హెచ్చరిక**
**గడుసు వైద్యులకు వార్నింగ్!**

ధనార్జనే జీవిత ధ్యేయంగా భావించే ఒక డాక్టరు చేసిన పని పర్యవసానం. సైన్సు ప్రగతి-వైద్యం దుర్గతి! ఇకపైనా? కానేకాదు. అంటున్న సరికొత్త సీరియల్ త్వరలో మీ ముందు కొస్తూంది!






## ★ శ్రీమద్రామాయణము– మానవ ధర్మము

రచన: డా. మోపిదేవి కృష్ణస్వామి, పుటలు: 56, వెల: మేలు ప్రతి పదహారు రూపాయలు, సాదా ప్రతి పన్నెండు రూపాయలు, ప్రతులకు: ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్టీ, 23–10–7, పురుషోత్తం వీధి, సత్యనారాయణపురం, విజయవాడ– 11, మానవధర్మంలోని మధురానుభూతిని, పవిత్రతను, పరమార్థాన్నీ తెలపటమే కాకుండా; మన జీవితాలను రామమయం చేయాలన్న ఉద్దేశ్యంతో రచయిత ఈ గ్రంథాన్ని రచించారు.

## ★ మనం – మన సంస్కారం

రచయిత: ఎ. విశ్వేశ్వర రెడ్డి, పుటలు: 49, వెల: ఇరవై రూపాయలు, ప్రతులకు: ఎ. విశ్వేశ్వర రెడ్డి, అసిస్టెంట్ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, సోమాజిగూడ, హైదరాబాద్– 500482. వ్యక్తిత్వానికి వెలుగునిచ్చే అనేక చిట్కాలను రచయిత ఈ పుస్తకంలో పొందుపరిచారు నిత్య జీవితంలో ఆచరించ తగిన సూత్రాలను రచయిత మనకు ఈ సంకలనం ద్వారా తెలియ జేశారు. వివిధ అంశాల మీద ఆధునిక ఐతిహాసిక సంఘటనలను ఉదహరిస్తూ వ్రాసిన ఈ పుస్తకంలో పాప వేసిన కార్టూన్లు తగినట్లుగా వున్నాయి. ○



ఢిల్లీలో జరిగిన ఢిల్లీ తెలుగు సంఘం 12వ వార్షికోత్సవాలను మాజీ రాష్ట్రపతి శ్రీ జ్ఞానీ జెయిల్‌సింగ్ ప్రారంభించారు. ఈ సందర్భంగా రాష్ట్ర మంత్రి శ్రీమహమ్మద్ జానీ సావనీర్‌ను విడుదల చేశారు. ప్రముఖ హాస్యనటుడు సుత్తి వేలుకు సన్మానం జరిగింది ఎనిమిది తెలుగు చిత్రాలను ఈ ఉత్సవాల్లో ప్రదర్శించారు.

## అవీ·ఇవీ·అన్నీ

విజయవాడలో జరిగిన నాటికల పోటీలో 'త్రివేణి' నాటకం ప్రదర్శించి ప్రథమ బహుమతిపొందిన రసన సమాఖ్య బృందం కూర్చున్న వారిలో కుడి నుంచి రెండవ వారు సమాఖ్య కోశాధికారి కె.ఎల్.రావు.



## మినీకవితలపోటీ

సహృదయ సాహితి దశాబ్ది ఉత్సవాల సందర్భంగా మినీకవితల పోటీని, గురజాడ 75వ వర్ధంతిని పురస్కరించుకొని 'దేశభక్తిగీతం' ఆంగ్లానువాదాల పోటీని నిర్వహిస్తున్నట్లు సాహితి అధ్యక్షులు శ్రీ చిత్రకవి ఆత్రేయ తెలియజేశారు. పై పోటీలకు రచనలు పంపేందుకు ఆఖరుతేదీ జనవరి 31వ తేదీ. రచనలు-రామతీర్థ, 45-46-20/బి/1, శ్రీనివాసనగర్, అక్కయ్యపాలెం, విశాఖపట్నం-530 016 అన్న చిరునామాకు పంపాలి. ○

# సినిమా.. సినిమా..

## ప్రార్థన

"నలభై రోజులు ప్లాన్ చేసిన వర్క్‌ను 30 రోజుల్లోగానే పూర్తి చేయగలగడం డైరెక్టర్ కె. విజయభాస్కర్ ప్రతిభే. ఆయన తీసేది ఏదిటో మూడు నెలల క్రితం చెప్పారు. వైవిధ్యమైన ఇతివృత్తం గనుక నేనే చిత్ర నిర్మాణానికి పూనుకోగా భాగస్వామిగా తెనాలి ప్రముఖులు కందేపి సాంబశివరావుగారు లభించడం నాకు కొండంత బలాన్ని ఇచ్చింది. మా అబ్బాయి నిక్కీ పేరుతో నిక్కీ ఫిలిం సర్క్యూట్ బ్యానర్‌లో చిత్రాన్ని పూర్తి చేశాం. హైదరాబాద్‌లోని డి. రామానాయుడుగారి డబ్బింగ్ థియేటర్‌లో డబ్బింగ్ ప్రారంభిస్తున్నాం. అక్కడ తొలిసారిగా డబ్బింగ్ జరుపుకునేది మా చిత్రమే," అన్నారు సురేష్. ఈయన హీరోగా ఈయన శ్రీమతి అనితారెడ్డి, కందేపి సాంబశివరావుతో కలిసి నిర్మించే "ప్రార్థన" చిత్రంలో అంజలి, చారుహాసన్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, సాగరిక, బెనర్జీ, బేబీ స్మిత, ప్రియ, దినేష్, వినోద్, జాకీ, వినయ్, మాస్టర్ సురేష్, బడి తాతాజీ నటవర్గం. సీతారామశాస్త్రి దేవేంద్రన్, ప్రతాప్, కృష్ణారెడ్డి, మ... షియా భాస్కర్, ప్రభు, ప్రమీల, సుధాకరరెడ్డి, ఎస్. శ్రీనివాస్, వెంకట్, శంకర్ ప్రభృత సాంకేతిక బృందంతో నిర్వహణ: ఆకుల చిన్నికృష్ణ. సమర్పణ: రావి రవీంద్ర చౌదరి. "ప్రార్థించే మనసుకన్నా ప్రాణాలు కాపాడగలిగే రెండు చేతులూ మిన్న అనేది ఇతివృత్తం. ప్రేమ, వయలెన్స్, సెంటిమెంట్ వగైరా అన్నిఅంశాలూఉంటాయి. ఈ చిత్రంతో సురేష్ యాక్షన్ హీరోగా స్థిరపడతారు," అన్నారు స్క్రీన్ ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే కె. విజయభాస్కర్.

-జి.వి.జి.

"ప్రేయసి"తో సోనియా